వైటూరు గ్రంథమండలి.

# రామతీర్థస్వామి జీవితము.

బ్రహ్మజ్ఞానోద్బోధనలు.

**Volume I.**

మూడవకూర్పు 1000 ప్రతులు.

సంపాదకులు:

మునిగంటి జగన్నాథశాస్త్రి.

తణుకు. పశ్చిమగోదావరి.

1933

వెల 0-10-0.

# రామతీర్థస్వామి జీవితము.



"మృత్యువు నాజీవితమును పడుగున నిరంతరము ముందు వెనుకలకు (పేక) నేయుచున్నను నేను నాశనము నొందజాలను; నే నెన్నడును పుట్టలేదు. కాని యప్రశాంత జలరాశి మీది కెరటములవలె నా భౌతికశరీరము లనంతములు" "శరీరము శిథిలయ్యెమ మట్టి మట్టిలో చేరును. నే ననంతగర్భమున యమరత్వకేళిని సల్పుదును; అన్ని చెవులును నాచెవులు, అన్నికండ్లును నాకండ్లు, అన్ని చేతులును నాచేతులు, అన్ని మనస్సులును నామనస్సులు నేను మృత్యువును మ్రింగివేసితిని, భిన్నత్వమును పానము చేసితిని"

అని గానము చేసిన పరమహంస రామతీర్థస్వామి పంజాబుదేశమున గుజరనువాలా జిల్లాలో మురోలివాలా యను గ్రామమున 1873 సంవత్సర కార్తిక శుద్ధ పాడ్యమిరోజున భక్తశిఖామణియు, హిందీరామాయణామృతవృష్టిని కురిపించినవాడును నగు తులసీదాసు వంశమున నుదయించెను.

కొద్దిరోజులకే యితనితల్లి దివి కేగుటచే నీతడు తన యన్నయగు గోసైను గురుదాసు పోషవర్గమున పెరిగి పెద్దవాడయ్యెను, పువ్వు పుట్టుటతోడనే వాసన వేయుననునట్లు యీశిశుపుష్పము సుగంధపరిమళముతో వికసింప నారంభిం

చెను. జ్యోతిష్కు లందరును నీయపూర్వశీసంపన్ను డగు బా లుడు తేజస్వంతు డగుననియు, శేముషీ కాంతు డగుననియు, జాతి నుద్ధరించగల మహాపురుషు డగుననియు జోస్యముల చెప్ప నారంభించిరి. చిన్నతనమునందే యతడు రామాయణ, భాగవత భారత పురాణగాథల నతిశ్రద్ధతో వినుచు, తనలో తాను ప్రశ్నించుకొనుచు, యితరులను ప్రశ్నించుచు, వారికితగు సమాధానములను తానే చెప్పుచు, మన యిప్పటి కూసు విద్యార్థులవలె 'భరాటా, రమయానా' యను చదువుకాక, భారతవిజ్ఞానబీజములను దోహదము చేసికొనుచుండెను. కుశాగ్రబుద్ధి, చింతన స్వభావము; ఏకాంత నిమగ్నత యను గుణత్రయముచే నొప్పుచు నితడు విద్యయనిన నల్లేరుపై బండివలె చటచట బోవుచు ప్రతి తరగతిలోను యగ్రేసరుడై మొట్టమొదటివాడుగా పట్టభద్రుడై 20 వ యేట యం. ఏ., పరీక్షయందు గణితశాస్త్రపారంగతుడయ్యెను. ప్రిన్సిపలు బెల్లుదొరగా రితని యద్భుత బుద్ధిబలమున కాశ్చర్యమును జెందికలెక్టరుపరీక్షకు చదువుమని యితనిని ప్రోత్సహించెను. స్వారాజ్య సామ్రాజ్య సింహాసనముల నధిష్ఠించి విశ్వైక్యపరిపాలనమును చేయువలసిన సార్వభౌముడు కలెక్టరునౌకరి కంగీకరించు టెట్లు తటస్థించును! రేయింబవళ్ళు కష్టపడి సంపాదించుకొనిన గణితశాస్త్రజ్ఞానము నితడితరులకు బోధింప నుత్సహించుచుండెడివాడు. రెండువత్సరములు

లాహోరు క్రిష్టియను కాలేజీలో యాశాస్త్రపండితుడుగా నుండి, కొంతకాలము మఱియొక కాలేజీలో నధ్యాపకుడుగా నుండి 1899 వ సంవత్సరమున నితడరణ్యములకు తపస్సుకు పోయి మరునటి సంవత్సరమున ప్రపంచబంధముల నన్నిటిని త్రెంచుకొని సన్యసించెను. 27 వత్సరముల చిఱుతప్రాయము; నెలజవ్వనమున నున్న సతీతిలకము; అఖండమేధాసంపత్తు; సన్యాసము; ఎట్టి విపరీతసంఘటనములు !

ఇతని జీవితమును గురించి మనకు విశేషాంశములంతగా తెలియవు. కాని జీవితమంతయు నితడసిధారావ్రతచర్యను నడపెను. బాల్యమున విద్యనభ్యసించుకాలమునను కూడ నితడు తపఃకాలమునే గడిపెను. తిండిలేక మలమల మాడుచు బల్బున తెలవారువరకును కూర్చునియే పెంకి గణితశాస్త్ర ప్రశ్నకొరకు నోగడిపిన రాత్రు లనేకము లీమహామహుని జీవితమున గలవు. వివాహమైనదిగాని యెప్పుడయ్యెనో యెంతకాల మాతడు గృహస్థజీవితము ననుభవించెనో కానరాదు. కాని యతని భార్య గుణవతియు, భర్తృపరాయణియు నై యతని కెల్లప్పుడును సపర్యల నొసగుచు శిష్యురాలై యతని యాధ్యాత్మికాభివృద్ధి కెంతయు తోడ్పడి భారత గృహిణీధర్మమును నెరవేర్చి, భర్త సన్యసించినతరువాత నతనినే స్మరించుకొనుచు సన్యాసినియై జీవితమును సఫలముచేసికొనెను ఇదియే కదా భారత సతీత్వము !

రామతీర్థస్వామి 27 వ యేట సన్యసించి మరియారు వత్సరములు మాత్రము భౌతికశరీరమును ధరించి తరువాత యొకనాడు హఠాత్తుగా 1906 వ వత్సరమున గంగానదీ పుణ్యస్రోతస్సులలో నిరంతర జలసమాధి నేర్పరచుకొనెను. ఇట్లు జరుగుటకు కొన్ని నిమిషములకు పూర్వ మత డిట్లు మృత్యుదేవత నాహ్వానించెను.

"ఓ మృత్యుదేవతా! రమ్ము! నాశరీరమును తీసికొని పొమ్ము. నాకేమి యును జంకు లేదు! నాకేమియును కొదువ లేదు నేను ధరించుటకు నాకనేక శరీరములుకలవు. ఆదిత్య రజిత తంతులను, సుధాకర కాంతులను నేను ధరించి నివసించగలను. పర్వత ఝరీరూపమును దాల్చి నేను దివ్యగానమును చేయు దేవతవలె తిరుగాడ గలను. నేను రాజసవితో వీచు వాయువును; సుగంధముతో మత్తెక్కినమలయమారుతమును. ఈ నా యన్నిరూపములును మార్పు నొందుచు దిరిమ్మరు రూపములు. నే నా పర్వతాగ్రములనుండి వచ్చి మృతినొందినవారిని లేవనెత్తితిని; నిద్రిపోయినవారిని లేపితిని; కొందరి ముఖాంబుజ సౌందర్యమును విశదీకరించితిని; కొద్ది మంది బాష్పపూరితనయనముల ననువయించితిని. గులాబిని గుజ్జగూబను కూడ నేను చూచితిని. వాటితో నానందించితిని. నేను దీనిని స్పృశించితిని; దానిని స్పృశించితిని. నేను నాశిరోవేష్టనమును ధరించి వెళ్ళిపోవుచున్నాను. నే నిచ్చ

టకు పోయెదను; నే నచ్చటకు పోయెదను. నన్నెవరును కనుగొనలేరు. నాతో నే నేమియు నుంచుకొనను."

ఈవిధముగా 33 వత్సరములు నిండకముందే, ముక్కుపచ్చ లారకమునుపే 20 వ శతాబ్దపు భారతభాగ్యరాశియు, యుగపురుషుడును, బ్రహ్మతత్త్వవేత్తయునగు పరమహంస రామతీర్థస్వామియొక్క భౌతికశరీర మకాల కాలధర్మము నొందెను

కాని మహాత్ములు త్రికాలాతీతులు. వారు తమశరీరములతో జీవించునది కొలదికాలమే యైనను వారికెన్నటికిని చావనునదియే యుండదు ఈ 33 వత్సరములలోను కూడ రామతీర్థస్వామి తన భౌతికశరీరములో నెంతకాలము జీవించెనో చెప్పజాలము. కొంతమంది యమెరికను స్నేహితులు, రామతీర్థస్వామి యీశరీరములో నెప్పుడును జీవించనే జీవించడు. అత డెప్పుడును దేవత్వములోనే నివసించును. ఎప్పుడును యుత్కృష్టమైన యాధ్యాత్మికచింతనములనే చేయుచు, వాటిలోనే రాత్రింబవస్లు నివసించుచు, శరీరమనునది యొకటికలదను భావమునే మరచియుండు స్వామిజీ వంటివారు భౌతికశరీరములో చాలకాలముండజాలరని జ్యోతిషము చెప్పిరి. అతడు నిజముగా తనశరీరమునే మరచిపోయెను. లేదా మినుకుమినుకుమను కించిచ్ఛరీరజ్ఞానము కలిగి యుండెను. జీసస్ శరీర మతని దేవత్వజీవితమున కొక రథమువంటిదని రాము

శివాడును, వేణీసుధామృతవృష్టిని వెదజల్లెడువాడును, కాళిం
దీఫణిఫణాగ్రతాండవమూర్తియు నగు కృష్ణవిగ్రహమును
ప్రత్యక్షముగా దర్శించుచుంటి నని చెప్పుచుండెడివాడు. ఇది
తన యాధ్యాత్మికాభివృద్ధిలో మనస్సుయొక్క యేకాగ్రతావస్థ
యని యాతడు తరువాత వ్యక్తపరచెను. జనసంకులమైన లా
హోరుపట్టణ మందలి యాత్మక్షేత్రము గతిసంగృహీత మగుటచే నత
డు సమయానుకూలముగ కొండశిఖరములందును హిమవత్పర్వతములకును,
తత్ప్రాంతారణ్యములకును బోవుచు యుపనిషదర్థములను,
బ్రహ్మవిద్యారహస్యములను విచారణచేయుచుండెను. ఇట్టి
తని స్వాత్మజ్ఞాన సముపార్జనము బ్రహ్మపురి యరణ్యములలో తన
యాత్మను తెలిసికొనెను; భయశోకములంతరించెను, యానందధాము
డైన యేకత్వస్థితినిపొందెను; విచారభ్రమలు తొలగిపోయె
ను. పరమాత్ముడే తానని తాన మెవనికి కలుగునో యట్టి
వాని కీవిశ్వమంతయు శరీరమువలె సేవచేయుననుసిద్ధాంత
మున కాతడు రాగలిగెను. ఈమహాజ్ఞాని పట్టణములకంటెను
రాజసౌధములకంటెను పర్వతశిఖరములను హిమవన్నగాగ్రము
లందును, సాంద్రారణ్యములందును ప్రకృతిరాజ్యము నేలు
చుండెడివాడు మనుష్యులు చేరరాని ప్రదేశములందతడు
రొంటరిగా నిశీథమందు పిట్టవలె సంచరించెడివాడు. మంచు
కొండలు విరిగి మీదపడుచుండ కాలూనుటకు వీలులేనిపర్వ
తశిఖరముల కతడవలీలగా నెగబ్రాకి కైలాసము, మానస

సరోవరము, బ్రహ్మకపాలము మొదలగు ప్రకృతివిధులను తన వశము చేసికొనెను. ఒకచోట నితని కైదు పెద్దపులులు త్రోవ కడ్డము వచ్చెను. వారొకరినొకరు తేటిపాఱచూచుకొనిరి; పెద్దపులులు పలాయనమయ్యెను.

ఇక మానవలోకమున నితని రాజ్య మవిచ్ఛిన్నముగా సాగెనని వేరుగ చెప్పనక్కఱలేదు. ఇకముందును సాగ నున్నది; విద్యుల్లతలవంటి యీతనిమందహాసము లితరులకు మిరుమిట్లు గొలుపుచు వారిలో నుత్సాహశక్తిని ప్రజ్వలింప జేసెడివి. ఇతడెప్పుడును బ్రహ్మానంద భరితుడై పృథ్వీపతుల రాజ్యవైభవముల నధఃకరించుచుండుటచే రాముపాదుషాయని పిలువబడెడివాడు. "నేను రామపాదుషాను మీహృదయములే నాసింహాసనములు. నేను వేదములను బోధించినపుడు ను కురుక్షేత్రములో విద్యగఱపునపుడును, మెక్కా, జెరూ సెలములలో నుద్ఘోషించినపుడు నన్ను మీరు సరిగా గ్రహింపజాలకపోయిరి. నేను తిరిగ నాకంఠము నెత్తి పాడుచున్నాను. నీవు బ్రహ్మపదార్థమవు; నీకు గాన్పించు విశ్వమంతయు నీవు; దీని కెవ్వరును, యేశక్తియు నెట్టి యాటంకమును కలిగించజాలదు. రాజులుకాని, దేవతలుకాని, దయ్యములుకాని దీనిముందర నిలువజాలవు. సత్యపథ మమోఘము. భ్రమ జెందకుము; నాతలయే నీతలకావలెనన్న దీనినొక్కసారి త్రుంచి చూడుము; ఒకతలకు వేయితలలు బయలుదేరును." అని రామతీర్థస్వామి యొకసారి చాటెను.

ఇతఁడు వేదాంతులలో వేదాంతి; పండితులలో పండితుఁడు. కవులలో కవిసార్వభౌముఁడు. ఇతఁడు పరమపదించువరకును విసుగులేకుండ రేయింబవలు లనేకశాస్త్రములను గ్రంథములను చదువుచు ప్రాచ్యపాశ్చాత్య వేదాంతములను సంపూర్ణముగా మథించెను; శంకర, కపిల, కణాద, గౌతమ, పతంజలి, జైమిని, వ్యాస, క్రిష్ణ, కేంటు, హిజెలు, గెదీ, ఫిష్టి, స్పినోజా, కోమ్టి, స్పెన్సరు, డార్విను, హెకెల్, టిండాలు, హాక్స్లీ, స్టార్, జోర్డను, జేమ్సుల వేదాంతగ్రంథముల నవగతము చేసికొనెను; పర్షియను, యింగ్లీషు, హిందీ, ఉరుదు, సంస్కృతభాష లితనికి కరతలామలకములు; ఇత డమెరికాదేశములో సంచారము చేసిన రెండుసంవత్సరములలోను వందలకొలది యుపన్యాసము లిచ్చుటకుతోడు యమెరికా సాహిత్యమునంతను పూర్తిచేసెనని చెప్పినపు డితని యసమానప్రజ్ఞ పాఠకులకే విశదము కాగలదు. ఈకవి ప్రకృతితో లీనమై ప్రకృతిసౌందర్యముల ననుభవించి గానముచేసెను. ఇతనికి సెలయేళ్ళు స్నేహితులు. పర్వతసానువులు పట్టుపాన్పులు. వృక్షచ్ఛాయలక్రింద నీతడు ప్రకృతి రహస్యములను పక్షుల కుహుకుహూరవములద్వారా వినుచుండెను. ప్రకృతిగాన మీతనికి వినబడుచుండెడిది. సముద్రకెరటముల నృత్యములలోను, యరణ్యముల ఝుంఝూమారుతములలోను, నిశ్శబ్దసీమలశాంతిలోను, పర్వతరాజములందును, నితడు సౌభా

గ్యమును కనుగొనుచుండెను. ప్రకృతియొక్క యాత్మతో లీనమగుటయే నిజమైన వర్తనమని యితని యభిప్రాయము. ఈస్థితిలో మానవునొక్కనిని యొంటరిగా విడిచిపెట్టుము; మానవుని యాధ్యాత్మికాభివృద్ధియు నీతియు నిట్టిహానియుందకుం ఠితముగా దోహదము చేయబడును. ఇక్కడనే మానవుడు తయారగును గాని పాఠశాలఫ్యాక్టరీలలోను, పాండిత్యము లోను కాజాలడు! ఇచ్చటనుండి తననిజాత్మను తెలిసికొను నేని మానవు డచంచలమై యభేద్యమైన పర్వతము నధిష్ఠిం చినవాడగును. "నాకంటె యన్యమైన పర్వతమేదియు నాకప కారమును చేయజాలదు. ఆత్మజ్ఞానమే మతము. ఆత్మజ్ఞానమే యీవిశ్వమునంతను త్రిప్పుమహాశక్తి. ఆత్మజ్ఞానమే చేతనాచే తనములకు ప్రాణాధారము. అతిసామాన్య మానవునికూడ దివ్యతేజస్కునిజేసి మానవసాధ్యమగు యసమానజయసంపద లను చేకూర్చగలుగున దీశక్తియే. అనుభవబ్రహ్మవిద్యాలయ మున పూజలొనర్చునాకే నిర్మలాంతఃకరణములను, ప్రసన్న వదనములను, సంతుష్టాంతరంగములను కలిగియుందురు. నా బ్రహ్మవిద్య యొక కేవల మెట్టసిద్ధాంతముగాని ధర్మపన్నము గాని కాదు; జీవితపాలసముద్రమును మథనముచేసి మహాజ్ఞా నులు సంపాదించిన యవినాశియగు యనుభవఫలమైన నవ నీత మీబ్రహ్మవిద్య; అమరత్వప్రసాదిని యీబ్రహ్మవిద్య!" అని యితడు చెప్పెను. ఈయోగిపుంగవుడు తనదివ్యజ్యోతిని

ప్రపంచమంతటకును గొంపోనంచి యింగ్లండు, అమెరికా, జపాను, ఈజిప్టు మొదలగు దేశములలో భారతవిజ్ఞాన శంఖమును పూరించి పాశ్చాత్యదేశములను మైకమునుండి మేల్కొలిపెను. గంగానదీప్రవాహమువలె నితని జ్ఞానప్రవాహము స్పృశించిన దేశములన్నియు పవిత్రములగుచుండెను. ఇతడమెరికా వీధులలో తిరుగుచుండ నీ 'హిమాలయయోగి' యెవరా యని యడుగనివా రెవరును లేరు. ఇత డమెరికా దేశములో దిగవలెనని జపానులో యోడనెక్కెను. ఓడ రేవుకు జేరెను. ఎవరికివా రతితొందరతో గందరగోళపడుచు తమ సామానులను దింపుకొనుచుండ రామతీర్థ నిశ్చలముగా యూరక యానందించుచుండెను. ఒక యమెరికను దేశస్థు డీసంగతినిచూచి యాశ్చర్యపడి యితని నిట్లు ప్రశ్నచేసెను. నీసామానెక్కడ ?

రాముడు తా నెంతసామానుమోసికొని పోగలడో యంతసామానును మాత్రమే యుంచుకొనును.

నీవద్ద నేమైన సొమ్ముకలదా ?

లేదు. రాము డెప్పుడును ధనము నుంచుకొనడు.

నీ విక్కడనే దిగనెంచుచుంటివా ?

అవును.

నీకు సహాయమును చేయుటకు కొంతమంది స్నేహితు లుండవలెను.

అవును, నాకొక డున్నాడు.

ఎవరు ?

రాము డతని భుజమును తన చేతితో స్పృశించి 'నీవే' యనెను. ఈ 'నీవు' ఆయమెరికనుని సూదంటురాయివలె పట్టుకొని యత డానిముసమునుండియు రామతీర్థస్వామికి సమస్తోపచారములను చేయుచు యమెరికాలోనున్నంత కాలమును యతనిని వీడజాలక పోయెను. ఆయమెరిక నొకసారి యిట్లు చెప్పెను. "ఇతడు హిమాలయములనుండి వచ్చిన యొక జ్ఞాన జ్యోతి. ఇతనిని నిప్పు దహించజాలదు; ఖడ్గము ఖండించజాలదు; ఇతని నేత్రము లెప్పుడును యానందాశ్రుపుల చే దీపించుచుండును; ఇతని సందర్శనమే నూతనజీవితము నొసంగగలదు" మరియొకడు ప్రశ్నించగా రామతీర్థస్వామి యిట్లు జవాబు చెప్పెను. "నేను నాలోపలనున్న పురుషునితో నానందించుచుండును. నే నాకలిగొనినపు డాహారమును, దప్పిగొనినపుడు దాహమును నా కెవరో యిచ్చుచున్నట్లు నేను కనుగొంటిని. నా కింతకన్న వేరేదియు నవసరము లేదు. నా కెప్పుడును యెట్టికష్టమును కలుగ లేదు" రామతీర్థస్వామి ఒక్క యమెరికాదేశములో చేసిన యద్భుతములను తెలిసికొనుట కమెరికాదేశమును చూచినవానికే శక్యముగును అత డమెరికాలో యెవరిని పరకుగొనక యడవినుండి తనకట్టెలను తానే తెచ్చికొనుచు నిరాడంబరజీవితమును గడిపెను. రాకుమారులును,

ప్రభువులును, సార్వభౌములును యితనిని చూచుట కితని కుటీరమునకే పోయెడివారు. అమెరికాలో యితడు రోజు కొకటి రెండు యుపన్యాసముల నిచ్చుచు వారిని బ్రహ్మానంద మున నోలలాడించి భారతదేశ నిజతత్త్వమును వారల కెరుక పరచెను. సీన్ఫ్రాన్సిస్కోలో యొకనా డితడు మహావేగ ముగా బోవుచుండగా 'భూమి నీదైనట్లు దానిమీదనుంచి నిర్లక్ష్యముగా నడచిపోవుచున్నాడకేమి,' అని యొక రడిగిరి. 'అవును భూమి నాదేను' అనియతడు బదులు చెప్పెను. ఇత డమెరికాలో నున్నపు డమెరికనుదేశస్థుడనియు, జపాను లోనున్నపుడు జపానీయుడనియు, ఈజిప్టు, యింగ్లండులలో నున్నపు డా దేశవాసియనియు వారుగర్వపడుచుండెడివారు. ఈదేశములలోని పత్రికలన్నియు తెల్లవారునరికి రామతీర్థ స్వామిపేరుతో నిండిపోయెడివి. మసీదులలోను క్రిస్టియను దేవాలయములలోను నత డనేక యుపన్యాసములనిచ్చెను. అతడు తన దిగ్విజయయాత్రను ముగించి భారతదేశమునకు వచ్చునపుడు త్రోవలో స్టీమరుమీదనుంచి తననుగురించి చేసిన స్తోత్రపాఠముల కట్టను సముద్రములో పారవేసెను. అతడు భారతదేశమున దిగుటతోడనే మధురలోని స్నేహితు లందరును యతనినొక నూతనసంఘమును నూతనమతమును స్థాపించుమనికోరిరి. అతడు దాని కెంతమాత్రమును యొప్పు కొనక భారతదేశములో పనిచేయుచున్న సంఘములన్నియు

నాసంఘములే. నేను వాటిద్వారానే పనిచేసెదనని చెప్పి సంతోషమును పట్టజాలక, కండ్లుమూసికొని యానందబాష్ప ములు జలజలరాలుచుండ విశ్వమునంతను ప్రేమాలింగన మొనర్చువానివలె బాహులతలను రెంటిని జాపి "నా యిష్ట దేవతయగు భారతభూమిలో జనించి యామె యన్నమును తినుటచే యామె నీటిని త్రాగుటచే యామె గాలినిపీల్చు టచే పెరిగిన శరీరములు, అవయవములు, కండరములు, నర ములు, రక్తనాళములు, మనోబుద్ధ్యాదులు కలిగిన క్రైస్తవ, హిందూ, పార్సీ, ఆర్యసమాజ, సిక్కు, మహమ్మదీయులంద రును నాసోదరులు; కాదు ! నాఆత్మయే ! నేను వారివాడనే యని చెప్పుదు ! నే నందరను యాలింగనమొనర్చెదను. నే నెవరిని మినహాయించజాలను. నేను ప్రేమను. ప్రేమ జ్యోతి వలె సర్వమును ప్రకాశింపజేయును. సర్వమును జ్యోతిర్మ యము చేయును. నిశ్చయముగా నేను ప్రేమప్రవాహమును తప్ప మరొకటికాదు. నే నందరను సమముగా ప్రేమించుచు న్నాను."

ఈమహాపురుషుని వేదాంత మద్భుతమైన యనుభవ వేదాంతమని యతనియొక్క ప్రతిపలుకును, చేష్టయు చెప్ప కనే చెప్పుచున్నవి. ఆతడు తన వేదాంతతత్త్వమును 'టూకీ'గా యిట్లు చెప్పెను.

చలిచలి ముందుకుపోవు పరిశ్రమ ప్రవాహముగాని పుచ్చి పురుగులోడు పందులగుంట సోమరితనముగాదు. క్రీడవలె కర్మకలాపము ననుభవించుటగాని, గాడిదమోతవలె వెట్టిమూట నీడ్చుట గాదు; సంతుష్టమనస్సుగాని సంశయకీటకాస్పదము గాదు; నిర్మాణదక్షతగాని నాశనదేవతగాదు; సౌభాగ్యసంస్కారముగాని ఛాందసాచారము గాదు; యథార్థభావావేశముగాని నేతిబీరకాయ కబుర్లు కాదు; వాస్తవములనెడు కవిత్వముగాని పుక్కిడిపురాణముగాదు; కార్యములనెడు తర్కముగాని పురాతన గ్రంథప్రమాణముగాదు; ఆత్మజ్ఞానానుభవముగాని శ్లోకములను కంఠస్థము చేయుటగాదు--ఇదియే యనుభవవేదాంతమని యతఁడు చెప్పెను. విద్యుల్లతలవలె మహాత్ములప్పుడప్పు డవసరమునుబట్టి యుద్భవించి విజ్ఞానబీజములను వెదచల్లి యంతర్థానమగుచుందురు. వాటిని కాపాడుకొని, పెంచి, తగుదోహదముచేసి తత్ఫలము ననుభవించవలసిన బాధ్యత మనది గాని వారిది గానేరదు. భారతవిజ్ఞానాకాశమున వెలుగొందు నక్షత్రరాశిలో రామతీర్థస్వామి 20 వ శతాబ్దమునకు చెందిన యసామాన్యనక్షత్రము. ఈ తేజస్సును పూర్తిగా తెలిసికొని దాని నితరులకు బోధింపనెంచుట సముద్రమును తెప్పతో దాటుటకు యత్నించుటవంటిది. ఈకాంతి ననుగమించువారు ధన్యాత్ములు!

## కావలెను! కావలెను!!

### సంస్కర్తలు,

ఇతరులను సంస్కరించు మోహులు కారు,

ఆత్మసంస్కారాన్వేషణ తత్పరులు!

విశ్వవిద్యాలయబిరుదములను

గెలుపొందినవారు కారు.

అహంకార మమకారవిజేతలు!

వయస్సు: బ్రహ్మానందయౌవనము

జీతము: బ్రహ్మత్వము

త్వరగా దరఖాస్తులనంపుడు

భైక్షుకప్రార్థనాప్రపత్తితో కాదు.

అధికారవినిశ్చయముతో

విశ్వైకనియంతకు.

మీనిజాత్మకు.

ఓం! ఓం! ఓం! ఓం!

---

# భారతదేశ సమస్య.

## విద్యార్థులకు రాముని సందేశము.

ఐకమత్యము ! ఐకమత్యము! ప్రతివారును యైకమత్యమునే కోరుచున్నారు. దేశములోనున్న వివిధశక్తులన్నియు నొకటితోనొకటి తలపడుచున్నవి. ఫలితము శూన్యమగుచున్నది. లక్షోపలక్షలైన 'బుర్రలు' చేతులు దేశము నెక్కడకు గొంపోనున్నవో యెవరికెరుక! వేలకొలది జాతులు, మతములు తమ కిష్టమైనమార్గముననే యీ జాతీయనావను నడుప నుంకించుచున్నవి. సరియైన నడక కరుగుటలేదు! మీమీ తెడ్లను యథాస్థానముననే యుంచుకొనుడు. మీస్థానముల నలంకరింపుడు; చిందరవందర నొందకుడు; ఏకముఖముగా మాత్రము తెడ్లనువేసి నావను నడిపించుడు. సామరస్యమే, భిన్నత్వములో యేకత్వమే యభివృద్ధిని చేకూర్చగలవు. ఇట్లు మీమీస్థానములలో కూర్చొని పాడుకొనుచు ముందుకుపొండు ! మీ జాతీయధర్మము దీనినే శాసించుచున్నది. శరీరమంతయు స్వస్థముగానున్నపుడే శరీరావయవములును స్వస్థతనొందును. ఇట్టిధర్మపన్నముల నెన్నియేని చెప్పవచ్చును. కాని మన భారతదేశములో చిరకాలమునుండి సామరస్యము,

వైకమత్యము యేల శూన్యమైపోయెను. దీనికి రెండు ప్రధానకారణము లున్నవి.

(1) అనుభవజ్ఞానశూన్యత.

(2) ప్రజాభివృద్ధి.

(1) అనుభవజ్ఞానశూన్యత:—

ఆల్బెరూని యనునతడు గొప్ప మహమ్మదీయ పండితుడు. వేదాంతి. అతడు సంస్కృతమును మనవేదములను పఠించెను. మహమ్మదీయుల పరిపాలనకు పూర్వమే యతడు మనదేశమంతటను సంచారముచేసి చాలవిషయములను గ్రంథస్థముచేసెను. హిందూ వేదాంతకవిత్వఖగోళశాస్త్రిములపట్ల యతని కత్యధికగౌరవము కలదు. అతడు కలుసుకొనిన కొంతమంది పండితుల పాండిత్యము నెంతయు మెచ్చుకొనెను. కాని ప్రజాసామాన్యముయొక్కయు స్త్రీలయొక్కయు స్థితిమాత్రము చాలదుర్భరముగానుండెను. వారు శారీరకముగాను మానసికముగాను, నైతికముగాను, యాధ్యాత్మికముగాను కూడ యధఃపతితులై దిక్కులేనివారై సర్వవిధముల నధోగతికి తేబడిరి. సాంఘిక, రాజకీయ మతసంబంధమైన విద్వేషములతో దేశమంతయు నిర్వీర్యమై, వికలమనోబుద్ధులు కలవారై ప్రజలు మహమ్మదుగజినీ దండయాత్రలముందర శిక్షణలేని 'భేడిమూక'వలె వికావికలై ధూళిధూసరమువలె నెగిరిపోజొచ్చిరని యతడు వర్ణించెను. తరువాత బేబరుకూడ (1526),

ప్రజలు కళాకౌశలము లేనివారనియు, హస్తనైపుణ్యము లేని వారనియు, పారిశ్రామికజ్ఞానము లేనివారనియు శిల్పము, ఆరామములు, కాలువలు చివరకు తుపాకిమందునుకూడ నెరుగనివారనియు, వారిలో కలయిక లేదనియు నిరసించెను. మనుష్యులలోనుండు దృష్టిలోపములకై యిందులో మనము కొంత కొట్టివేసినను యీస్థితి కడు శోచనీయము! మన యనుభవ జ్ఞానశూన్యతయే భారతదేశ యధఃపతనమునకు ముఖ్యకారణము.

శారీరకష్టమును నిరసించుట, యసహాజమైన శాఖోప శాఖలుగ జాతి, కులభేదములను పెంచుకొనుట, విదేశయాత్రను నిషేధించుట, శిశువివాహము, స్త్రీలను బలవంతముగా నజ్ఞానాంధకారమున బడద్రోయుట- వీటన్నిటికిని యనుభవ జ్ఞానశూన్యతయే కారణము. ఈసాంఘిక దౌర్భాగ్యము, ఈసాంఘికమాంద్యము పోవుటెట్లు? దీనినెదుర్కొనుట విష సర్పముతో చెరలాటమువంటిది. ఆచారములను త్రోసిరాజ నుట యతికష్టము. దానితోసంఘమంతయు మీాద పడుదురు. సంఘమును వీరు దూషించుట వీరిని సంఘము దూషించుట తప్పనిసరియగును. దీనిద్వారా మరల ద్వేషములు, కలహములు, దురభిప్రాయములు చెలరేగును. అట్లని మనమోక్షమునే చూచుకొనుచు మన మూరకయుండవలసినదేనా? అది మాత్ర మెట్లుసాధ్యమగును? అపవిత్రమైనసంఘములో నీవా

క్కుడవుమాత్రము పవిత్రుడవు కాగలవా? మునిగిపోవుచున్న సంఘము నిన్ను తేలనిచ్చునా? నీవును దానితో మునుగవలయును. లేదా తేలవలయును. శరీరమునుండి విడిపోయిన చేతికి బలమేమి చేకూరును?

కాని భారతదేశమున నిట్టివేదాంతశూన్యమైన భావమే చిరకాలమునుండి ప్రబలుచు సంఘమంతకంతకు క్షీణించిపోవుచున్నది. యౌవనవిద్యార్థులారా! మీరింకను పైకిరానున్నారు. భారతభావిస్థితియంతయు మీ చేతులలోనే యున్నది; దానికి మీరే బాధ్యులు. పిరికిపందలు కేవల బహుసంఖ్యాకుల మార్గములచే పరిపాలింపబడుదురు. నిజమైన చేతనాత్మచే నొప్పువ్యక్తి తానే ప్రజాస్వాదయములను వారిభావములను పరిపాలనచేయుచుండును. నీకు విశ్వవిద్యాలయములు బి. యే. ఎమ్. యే. పట్టముల నీయవచ్చును. కాని నీవు పిరికిపందవు కానున్నావో లేక ధీరుడవు కానున్నావో నీవే నిశ్చయించుకొనవలెను. బానిసాధముడవు కానున్నావో లేక జీవితసింహాసనము నధిష్ఠించు రాకుమారుడవు కానున్నావో యది నీయధీనమునందే యున్నది. ధీరత్వముతో గూడిన పవిత్రజీవితమే చరిత్రకు వన్నెదెచ్చును. దేనిమీద ప్రయోగింతుమో దానికి చలనము నిచ్చునదే శక్తియని న్యూటను చెప్పియున్నాడు. చిరకాలమునుండి మనదేశమున దురాచారపిశాచముపై నాధారపడి యనేకద్వేషవిద్వేషము

లు చెలరేగి దానిని పాడుచేయుచున్నవి; చలనము లేకుండ చేయుచున్నవి. శీల, సంస్కారములనుసంపాదించినయోయా వనులారా! మీరే యిట్టియనవసరములైన దుష్టశక్తుల నూడ బెరికి దేశములో జీవశక్తి నుద్దీపింపజేయవలెను; ఈపురాణ మాంద్య పిశాచమును (inertia) దగ్ధముచేసి దేశము నెట్లు త్రిప్పవలెనో యట్లు త్రిప్పి నూతనచలమును గలుగజేయుడు! భూతకాలమును వర్తమానముతో నన్వయింపజేయుడు. పవిత్రమైన మీ వర్తమానమును భావిసంతతి కందజేయుడు. మనమెన్నడును మన ప్రాచీనసంప్రదాయములను కోల్పోజాలము. అట్లు కోల్పోయినజాతి బాహ్యమునుండి నాశనము చెందును.

అప్రాచీన మెక్కడైనను దేశానర్థమే. అట్టిదేశము లోపలనుండి కుళ్ళనారంభించును. నీసత్యజీవితమువలన సంఘములో కలహములు తటస్థించునా! అట్లు నీవు తలచెదవా? నీవొక్కడవైనను చెక్కుచెదరక ధైర్యముగా నీస్థానమున యుండుము. ఇదియే పౌరుషము. ఎప్పటికైనను ప్రవాహము నీవైపునకే వచ్చును. వారు భూతకాలమునుజూచి మురియుదురుగాక! సత్యపథమును వీడకుండువేని భవిష్యత్తంతయు నీదే యగును! పవిత్రతను, ధర్మమును పెంపొందించని యైక మత్యము జాతిని రక్షించగలదా? ప్రజల నంధకారములో నుంచుటవలన నైకమత్యము చేకూరునా? మూర్ఖ్యములకు,

ప్రమాదములకు గురియగు పరమదాస్యమా జాతీయసామరస్యము నొసంగునది? నావికులందరును కలసి నావనొక్కవైపుకు సత్యమువైపుకు కాదు-దానికి వ్యతిరేకముగా నడుపుచున్నారనుకొనుడు. అది యాదరణీయమేనా ? అట్టిజాతీయనావ వెంటనే యధోగతిపాలుకాక తప్పదు. సత్య, పవిత్రతలలోనే యైకమత్యము సాధ్యమగును. జాతీయైక్యముకుగోరు మహాశయులారా! మొదట జాతిలోనున్న యనేక యమానుష దాష్ట్యమును పారద్రోలుడు! సత్యముకొరకు, యభివృద్ధికొరకు, మానవకళ్యాణముకొరకు వీటికొరకు చేయు యత్నములలో నొకప్పుడు ప్రజలును, యొకప్పుడు పనిచేయు ప్రచారకులును బాధల ననుభవింపవలసిన యెడల నదంతయు దేశ మాధ్యాత్మికముగా జీవించియున్నట్లు రుజువు చేయుటే యగును.

---

ఆదర్శమైన నడవడికలో బాధ ననుభవించుటే యుండదు. ఆబాధలో సంతోషముండును; ఆకష్టములో సౌఖ్యముండును! అదంతయు ప్రేమజ్యోతుల నంతటను వెదచల్లు శాంతియేయగును. అయినను జ్యోతిస్సందర్శనమే మహాబాధగా చూడబడు సంఘములో బాధలేనిశాంతి, ప్రబోధమును కలుగజేయనిజ్యోతి ఈరెండును కలసి యెట్లుండగలవు? అనేక కష్టపరంపరలుండినను యుండునుగాక! జాతీయోద్ధరణ కవియు నవసరమే. చిన్నయూహలున్న గొప్పమనుష్యులుకారు

దేశమున కాధారము; గొప్పయూహాలున్న చిన్నమనుష్యులే దానికి పట్టుకొమ్మలు; ఆయువుపట్టులు. శాంతి? ఎట్టిశాంతి? పశునిద్రిలో శాంతికలదు. శ్మశానములో శాంతికలదు. మన కట్టిప్రేతశాంతి యవసరము లేదు! మనకు సచేతనమైన శాంతియే కావలెను. ప్రజ లంధకారములోబడి మ్రగ్గుచుండ నీ జ్యోతిని భద్రముగా రక్షించుకొనుటకన్న నీకది లేకపోవుటే వెయ్యిరెట్లు మంచిది. తనచేతగల జ్ఞానసహాయము నవసరమైన వారికొసంగనివాడు తనధర్మమును విడనాడిన మహాపరాధి; పాపి.

(2) ప్రజాభివృద్ధి:—ప్రజాభివృద్ధిని మనము పెంచు తోటలలోని చెట్లయభివృద్ధితో పోల్చవచ్చును. ఇచ్చట తోటమాలి పనికిరానిచెత్తనంతను తీసివేయుచు, చెట్లు దట్టముగుచో వాటిని స్థలాంతరమున పాతిపెట్టుచు, గుబురువగైరాలను కత్తిరించుచుండును. దీనివలన చెట్లలో వైరుధ్యమేమియు లేక సక్రమమైన యభివృద్ధి కలుగుచుండును. అడవులలోని చెట్ల యభివృద్ధియిట్లుండదు. అచ టెప్పుడును వాటిలో విరోధభావ మేర్పడి బలవంతమై చెట్లు పెరుగుచు యడవియెంతయు కీకారణ్యమై చెట్లతో క్రిక్కిరిసియుండును. చిట్టచివర కేదవానలమో యడవినంతను తగులబెట్టుచుండును. తోటలలో నిట్టిది సంభవించదు. కాని తోటమాలి ప్రమత్తుడై తనపనిని నిర్లక్ష్యముచేయుచో సర్వమును తారు

మారగును. అడవిచెట్లగతియే వీటికిని సంభవించును. ప్రజాభివృద్ధికూడ ఈతోటలలోని చెట్లవంటిదే. ఒకసంఘములో ప్రజాభివృద్ధి మితిమీరి పెరిగిపోవుచుండగా కావలసినసంఖ్యకు మీరిన దానికేదో స్థలాంతరము కల్పింపబడకపోయినచో పోరు తప్పదు

శాంతియంతయు నశించును. మానవాభివృద్ధి క్రమము నశించి యడవిచెట్ల సాదృశ్యమువచ్చుటచే నైతికశాసనముల న్నియు నశించి భగవద్విధులు భగ్నమగును. ఇట్టిసమయము లందే జాతు లధఃపతితములై నీతిబాహ్యములగును. యవన రోమకాది యితరపట్టణముల యధోగతి కీయమితప్రజాభివృద్ధియే యాంతరంగిక కారణము. భారతదేశమునకుగూడ నిట్టి విషమగతిపట్టి చాలకాలమైనను మన మింకను యీరక మూలరోగమును నిర్లక్ష్యము చేయుచున్నారము. ప్రపంచములో నేదేశమును ఇంతదరిద్రముతో నిండియుండి యింత ప్రజాబాహుళ్యమును కలిగియుండలేదు. సామాన్య భారత కుటుంబములను చూడుడు! సంవత్సరాదాయ మతిస్వల్పము. ప్రతియేట కుటుంబము వృద్ధియగుచుండును. పైగ డొక్క మాడుచుండగ ప్రతియేట శుభాశుభ, శ్రాద్ధాదికములు మొదలగు యర్థరహిత తంతులకు తలకుమించిన ఖర్చు. ఈ స్థితియే ప్రస్తుత భారతదేశస్థితి. ఒకటి రెండు పశువులకే సరిపోవు తిండియున్న పశువులదొడ్డిలో లెక్కలేకుండ పశువుల

నుంచిన యవి కొట్టుకొని చచ్చును. ఇట్టి యుద్ధకారణమును విడిచిపెట్టి శాంతి శాంతి యనుబోధలు చేయుట నిష్ప్రయోజనము. నా దేశస్థులు స్వభావసిద్ధముగా శాంతిపరులు. సౌమ్యులు. ఏమిలాభము! కడుపు కాలిపోవుచుండ ఈర్ష్యలు స్వార్థములు యెట్లు నశించ గలవు? ఈ ప్రజాభివృద్ధి సమస్యను త్వరలో పరిష్కరించనియెడల జాతియైక్యతను పరస్పరయన్యోన్యతను గురించి చేయుబోధనలన్నియు బూటకములగును. దీనిని మనము పరిష్కరించుటో లేక చచ్చుటో తేలవలెను. దేశమంతటను యింతదరిద్రప్రజ పెరుగుచుండ దయా ప్రేమరసము లభివృద్ధి కావలెననుట యాశ కెదురీదుటవంటిది. ఒకవస్తువు యొక్క ప్రతిప్రత్యేక యణువు నొకదానికొకటి తగినంత దూరములోనుండి తమచుట్టు తాము తిరుగుట కవరోధము లేక యున్నపుడే వస్తువున కాకలరూపు (ఆంతరంగిక స్వాస్థ్యము) చేకూరుననని పదార్థ విజ్ఞాన శాస్త్రవేత్తలు చెప్పెదురు. భారతదేశములోని ప్రజలిట్టి స్థితిలో నున్నారా? ఇతరులతో సంఘర్షణ యక్కర లేకుండ నాడు తమసమాజ స్వేచ్ఛను కలిగియున్నారా? ఒకడు తిండితినుచో పదిమందిపస్తుండవలసిన దేశస్వాస్థ్యమును వెంటనేచేకూర్చుటత్యావసరముకాదా? లేనిచో యడవిలోని చెట్లగతియే మనకును సంభవించుట తప్పదు. దానినే వసిష్ఠమహర్షి భూభారము మితిమీరినపుడు కఱవు, యుద్ధము, భూకంపము, దేశసంకటములు మొదలగు విధ్వంసక

ఘనాహములను ప్రకృతియే సృష్టించుకొనునని చెప్పియు న్నాడు. ఇవి లేకుండ నీయనర్థము లెట్లునశించగలవు. వీటికే మైన మార్గములు కలవా? అనేకములున్నవి.

(1) విదేశయాత్రి కూడదను పిశాచము నూడబెరు కుము. అది స్వర్గమున కడ్డువచ్చునని తలంచుట యంధకార ము. ఎంతమంది యీదేశమున నివసించుట కిష్టపడరో యం తమందియు హాయిగ విదేశములకు బోవచ్చును. పొండు! బయలుదేరి దేశాంతరములకు వెళ్లుడు. ఇక్కడే కూపస్థమం డూకములవలె కూర్చొనినచో లాభ మేమున్నది? అయ్యో! సౌందర్యరాశియైన భారతభూమి కలకత్తా చీకటికొట్టువలె తయారగుచుండుటను మీరు చూచుట లేదా?

(2) ఆర్యులీదేశము నాక్రమించినపుడు వారి కె క్కుడు సంతానముండుట యాశీర్వాదముగ నుండెడిది. ఇప్పు డారోజులు పోయినవి. ఆస్థితి తారుమారైనది. జనసంఖ్య మితిలేక పెరుగుచుండుటయే దేశానర్థక మగుచున్నది. సం తానాభివృద్ధి లేనిచో చనిపోయిన తరువాత స్వర్గము చేకూ రదను పిచ్చివాడున్నచో కొంచెము కళ్లుతెరచి చూడుము నుడు! ఆతడు చనిపోకమునుపే యిక్కడే తనయిల్లు తిండి లేనిపిల్లలు మలమలమాడుచుండ మహానరకముగా తయార గుచుండుటను చూడుమనుడు! భగవద్గీత రెండవ యధ్యా యము 42-45 శ్లో॥ లలో యర్జునునికి కలిగిన యీసంకటము

నుద్దేశించియే శ్రీకృష్ణుడు నిరసించి యున్నాడు. ఆశ్లోకము లను చదివి వాటి స్వతంత్రితత్వమును గ్రహించుడు! మనల నుబాధించుచున్న యీకిరింది దురాచార పిశాచమును నాశ నము కావించవలసియున్నది! వివాహేమూడుట, సంతాన వృద్ధిని గావించుట యజ్ఞానాంధకారమున మునిగి నివసించు ట; దాస్యములో చనిపోవుట! మనయజ్ఞానమునకు మనము మహామ్మదీయ పాలకులను, బ్రిటిషు ప్రభుత్వమును హిం దూదేశములోని మతములను ప్రస్తుత విద్యావిధానమును కారణములని నిరసించవచ్చును. ఇది కొంతవరకు సత్యమై నను యావద్భారత ప్రజాభివృద్ధికి కారణమగు, ప్రపంచము లో నన్నిటికంటెను యతిపవిత్రమగు వివాహసంబంధముల లోని యపవిత్రితయే మనలను కొట్టినది. పవిత్రితమమైన, యతిముఖ్యమైన యీసంస్థ నెంతయశాస్త్రీయముగా నెంత నిర్లక్ష్యముగా నెంతలజ్జాకరముగ చూచుచున్నారు! జాతక ములు చూపించుట, జ్యోతిషములు చెప్పించుట, శుభము హూర్తములను చూచుకొనుట, పవిత్రమైన వేదమంత్రముల నుచ్చరింపచేయుట ఇన్నెన్ని యున్ననేమి! మనవివాహము లకాలములో నశుభప్రదముగా నపవిత్రముగా జరుపబడు చున్నవి. ఆహా! పచ్చికాయదెబ్బ పడవేయ ఫలమగునె! ముక్కుపచ్చలారని దంపతులకు వివాహములనుచేయుచుండ గ్రహములుమాత్రము తమ శుభస్థానముల నలంకరించుట

కెట్లు సాహసించును. ఈయమానుష దృశ్యమును- పశువులు కూడ నొల్లని యీదృశ్యమునుచూచి గ్రహతారకములు వడ వడవణకి తమపదవులను వీడక యుండగలవా! తమ్ముపోషిం చుకొనజాలని శిశుదంపతుల దౌర్భాగ్యవివాహములను పవి త్రముచేయుటకు మారుగ వేదమంత్రములు నాటితో తమ పటుత్వసంపదను గోల్పోవును! కోల్పోయినవి! పుట్టుదరి ద్రులనుకలిపి యశక్తులైన, నిర్వ్యాజకులైన, తిండికొరకు పరాశ్రయము నాశించుసంతానముల ననంతముగా వృద్ధి చేయు వైవాహిక దుర్గంధకలుషితములైన వేదమంత్రకుసు మము లెట్టివైనను శోషించకుండ నుండగలవా?

యువకులారా! ఈప్రవాహము నాపివేయుడు! ఆపి వేయుడు! భావిభారతమునకు బాధ్యులరగు మహానులారా! ఆపివేయుడు! నీతిపేరిట, భారతదేశముపేరిట, మీకొరకు మీసంతానముకొరకు యీఅవివేకశూన్యమైన యకాలమైన, యంధవివాహములను దేశములో జరుగకుండ చేయుడు! ప్రజలను పవిత్రముచేసి యిదికొంత ప్రజాభివృద్ధి నరికట్ట గలదు.

నాసలహాలు యసహజములని భావింపకుడు. మీరట్లు చేయవలెను. లేదా నిరంతరక్షామముచే కృశించుచు నిత్య మృత్యువు ననుభవించుట మనకు తప్పదు. ఇందులో నుత్ప్రే క్ష యేమియు లేదు. శుద్ధసత్యము నీమాటలలో మీకెరిగిం

చుచున్నాను. శిశువివాహ, కన్యావైధవ్యములకన్న ప్రపంచ
ములో నసమాజము లేమైనకలవా ? ఏనాగరికజాతిలోనైనను
యిట్టిదికలదా ? నీలో మనుష్యవాసన యేమాత్రమైన మిగిలి
యున్నచో దీనినాపకుండ యెట్లువిశ్రమించగలవు ! అదిగో !
వైధవ్యమునొందిన చిరుతబాలికలబాహులత లెట్లు యబుద్ధి
పూర్వకముగనే నీసహాయముకొరకు చాపబడుచున్నవో చూ
డుము ! నీకండ్లముందరనే, యీదురాచారచితిలోబడి యంగు
ళముంగుళము చొప్పున సప్రాణదహనములు కావింపబడుచు
న్నవి. ఏపాపము నెరుగని యీబాష్పపూరితనయనములలో
నుండి దేవత్వము మీసహాయములకొరకు చూచుచున్నది.
ఎంతకాల మిట్లుపేక్షవహించెదరు ? భవానీరోదనములను
మీరింకను పెడచెవినిబెట్టిరేని పాపముపండి మిమ్ముకట్టి కుడు
పకయుండునా ? భూమికూడ దానిముందు గజగజలాడవలె
ను ! శాంతి ! మీచేతులతో మీరే తెచ్చిపెట్టుకొనిన శని
యిచ్చటనేయుండగా శాంతియెట్లు చేకూరును; యూరపులో
తక్కువజాతులలోనివారు త్వరగా వివాహములు చేసికొందు
రు. వారిలోని నికృష్టులుకూడ మనంతటి బుద్ధితక్కువపనిని
చేయరు. పైతరగతులవా రెన్నటికిని 30 ఏండ్లలోపున వివా
హమాడరు. దీనివలన తక్కువపిల్లలు యెక్కువ యర్హులైన
వారు కలుగుదురు.

బ్రహ్మచర్యవ్రతమునుగూర్చి మన శాస్త్రములు పిసుగు లేకుండ నుద్ఘోషించియున్నవి పవిత్రతలోనున్నంత శరీరక, యాధ్యాత్మికబలములు మరిదేనిలోను లేవు. సంభోగవాంఛను, సంభోగము మొదలగువాటియందు మనమువ్యర్థబుచ్చు శక్తిని నరికట్టి తిన్నగా నడిపితిమేని నది యోజస్సుగామారి యనంతమైన యధ్యాత్మికశక్తియగును. మీరు మీతుచ్ఛవాంఛలను (సంభోగకోరికలను) నరికట్టవలెను. తుచ్ఛమైన భౌతికవాంఛల నరికట్టక యీపవిత్రసంబంధము నెవఁడుత్యజించి బూడిదపాలు చేయుచుండునో వాఁడు తనకు ప్రాణాధారమగు శుక్లమును (తెల్లరక్తమును) చేతులార ధ్వంసము చేసికొనుచున్న మూర్ఖుడని యెరుగకున్నాడు. ఈదివ్యశక్తిని దుర్వినియోగము చేయుటే యన్నిరోగములకును మూలకారణము. ఈతుచ్ఛవాంఛలను పశువాంఛలనియు (animal passions) మనము పిలుతుము. కాని పశువులుకూడ మనంతయన్యాయమున కొడిగట్టలేదు. అవి మనవలె కేవల వ్యసనములకు పాలగుటలేదు. వివేకవంతుఁడగుటచే తనయుద్రేకముల నరికట్టుకొనగలవాడు కనుకనే మానవుడు పసువులకంటె యెక్కువగా తలంపబడుచున్నాడు. కాని పశువులవలె యవివేకముగా ప్రజాభివృద్ధిచేయుటలో యిరువురును సమానమైనను వాటికంటె యధమముగా కేవల వ్యసనములకొరకే తుచ్ఛవాంఛలకు లోనగు మానవాధము నేమని పిలువదగును?

పవిత్రత ! పవిత్రత ! ఉరిసంభముపాలైననుసరే పవిత్రులుకండు ! అట్లుకానిచో ప్రకృతి మీపై పగదీర్చుకొనును. అడవిలోని వృక్షముల న్యాయమే మీకును పట్టును. కష్టమైనను సుఖమైనను భారతదేశముకొరకు, మీశరీరములకొరకు, మీమతముకొరకు, మీయైహికాముష్మికములకొరకు—వీటన్నిటికొరకును మీరు పవిత్రులుకావలెను. అది లేని ధీరత్వము, అది లేని యైక్యము, అది లేని శాంతి గగనకుసుమములు. ఆకాశ సౌధములు.

విద్య—మనవిశ్వవిద్యాలయములలోని పట్టభద్రులకంటె నింగ్లండు, అమెరికాలలోని చదువులేనివారే యెక్కువ తెలివితేటలను కలిగియున్నారు. దీనికి కారణమేమి? అచ్చటనున్న ముద్రణసౌకర్యములే దీనికి కారణము. వారికి విజ్ఞానము దానిమూలమున నొకగా సమకూర్పబడుచున్నది. ఇంగ్లండు, జపాను, అమెరికాలలో కళాశాలలకన్న వార్తాపత్రికలే యెక్కువగా జ్ఞానమును వెదచల్లుచుండును. మనదేశములో ప్రస్తుతమున్న విద్యాసంస్థ లతిస్వల్పము. వాటివల్ల జరుగుచున్నపనికూడ శూన్యమే. మనప్రజల యజ్ఞానమునకును మనస్త్రీల యంధకారస్థితికిని మనమెవరిని దూషించనక్కరలేదు. మనలనుమనమే దూషించుకొనవలెను. సోమరితనములోను, చెడుకార్యములలోను వృధచేయబడుచున్న ప్రాణశక్తిని స్త్రీల నభివృద్ధిపరచుటకును, ప్రజాప్రబోధ

మును కలుగజేయుటకును, మీ యాత్మాభివృద్ధికిని వినియోగించి దేశముయొక్క యున్నతిని చేకూర్చెదరుగాక! దీనికి సులభమైనమార్గము, సూటియైనత్రోవ దేశీయప్రెస్సును బాగు చేయుటయే. స్త్రీలకొరకును, ప్రజలకొరకును నిజముగా నుపయోగించు వార్తాపత్రికలను దేశభాషలలో స్థాపించవలెను. ఆంగ్లవిద్యలో మునిగిపోయిన యువకులు దేశభాషలను చులకనగా చూచుట మంచిపనికాదు. ప్రతివాడును తనమాతృభాషను తప్పక గౌరవించవలెను. చదువురాని తన చెల్లెండ్రను, అక్కలను, తమ్ములను, కూతులను, భార్యలను యితరస్త్రీబంధువులను ప్రతివిద్యార్థియు తన విధాయికధర్మముగ చదువుట వ్రాయుట నేర్చుకొనునట్లు కృషి సలుపవలెను. పాఠశాలలు మొదలగు సంస్థలకొరకు వేచియుండుట నిష్ప్రయోజనము. ఈపవిత్రధర్మము మీ మీదనే యాధారపడియున్నది. భారతదేశము జీవించియుండవలెనన్న స్త్రీవిద్యాప్రచారము బాగుగా సాగవలెను. ఒక్కబీదవాడుగాని యొక్కస్త్రీగాని చదువురాకుండ నుండకూడదు. ఈయజ్ఞానతిమిరమును మీరేయడంచి దేశక్షేమమును చూరగొనవలెను. నీపొరుగుననున్న పాకీస్త్రీకి విద్యనిచ్చుటకు సిగ్గుగాని, భయముగాని యున్నచో నీనీతులు, నీవిజ్ఞానము నిష్ప్రయోజనములు; నిరర్థకములు. అజ్ఞానులను, దరిద్రులను నీవు తల్లివలె లాలించి వారికి చదువు నేర్పవలెను. ఇంతకన్న దైవకా

ర్యము వేరొండు లేదు. వారికి మెల్లగా ఖగోళము, చరిత్ర, మనశ్శాస్త్రము, ఆర్థికశాస్త్రము మొదలైనవాటిని సుబోధక మగునట్లుగ చెప్పవచ్చును. బీదలను, స్త్రీలను విద్యావంతు లను జేయుట మీకు పరమగమ్యము; దీనిని బాగుగ నిర్వ హించిరేని మీరే దీనివలన చివరకు మీయాత్మోన్నతిని చేసికొందురు. ఇంతకన్నను కూడ ముఖ్యమైనపని మరియొకటి గలదని మీరు మరువరాదు. వ్యవసాయసంబంధమైన పరిశ్ర మలను, శాస్త్రమును వాటిలో యభివృద్ధిగాంచిన యితరదేశ ములలోనేర్చుకొని హిందూదేశములో వెదచల్లవలసిన యగ త్యమెంతయో కలదు.

మతము:—గృహధర్మములు, సాంఘికధర్మములు, జాతీయధర్మములు, యివియే మీకర్మకాండలు. కాని ఏక ర్మకాండయు, ఏయుత్కృష్టకార్యమును యజ్ఞానాంధకార ములో నిర్వహింపబడజాలవు. చీకటిలో చేయుపనులు చీకటి పనులే. విశ్వాస మనుజ్యోతియు, జ్ఞానమను దివ్వెయు సదా నీలో వెలుగుచుండినగాని నీ వేపనిని చేయజాలవు; ముందు కొక్క యడుగైనను పోజాలవు. ప్రతినిత్యము మీకు చేయు బోధనలు, ధర్మోపదేశములు మొదలైన వివరములన్నియు మీదేహములవంటివి. ప్రాణములేనిచో శరీరము నిలువజా లదు. అట్లే యివియును విశ్వాస, జ్ఞానములు లేనిచో నిరర్థక ములు. శూన్యవాదము, చార్వాకము, మిథ్యావాదము,

పాషండకాపాలికాది వాదములు మొదలగువాటి ప్రముఖులు కూడ తమలోనున్న ప్రచ్ఛన్నమతవిశ్వాసముచేతనే జయము నుగాంచగలిగిరి. కొన్ని సందర్భములలో వారుమతములో పండితులమనుకొనువారికంటె యెక్కువమతమునే కలిగియుండిరి. మనకు నిజమైన హృదయసంస్కారము, మనస్సంస్కారము లేక భగవత్పరివర్తనము కలిగిననేకాని మన మేగృహ, సాంఘిక, జాతీయధర్మములను నెరవేర్చజాలము. 'విశ్వాసము చాల మహాత్తుకలది. అది ప్రాణము నీయగలదు' అని కార్లైలుకవి చెప్పియున్నాడు. తన విశ్వాసమునుబట్టియే జాతియొక్క చరిత్ర ఫలప్రదమును యాత్మాభివృద్ధిదమును నగుచున్నది. ఇసుకయెడారులలో నివసించు యరబ్బులు; మహమ్మదులు; ఒకశతాబ్దము; ఇది 'ఖాతరు' లేని యొక యంధకారయుతమైనయిసుకప్రపంచములో నొక్కజ్యోతిపడినట్లు లేదా! ఏమైనది ? నిర్వీర్యమైన యిసుకతిన్నెలు మందుగుండుసామానువలె విజృంభించి గ్రెనేడుమొదలు ఢిల్లీవరకును మిన్నంటెను. అంతయు నీశ్వరమహిమతప్ప మరేమియు లేదు.

మహాత్తుఅంతయు యవ్యక్తముగానున్న నీయంతరాత్మనుండియే యావిర్భవించవలెను. ఎవడు పూర్తిగా దేవభావమునందే నివసించజాలడో లేక దానిలో కొంతవరకే నివసించుచు సంపూర్ణదేవభావముకొరకు నిరంతరము కృషిసలుపడో వాడెట్టివాడైనను, యెంతటిశ్రీమంతుడైనను, వైభవ

ములతో తులతూగువాడైనను గాకుగాక ! 'బోడిలింగము వంటివాడే; మృతకల్పుడే' స్పెన్సరుతన యంత్యగ్రంథములో నిట్లువ్రాసెను. 'మన చింతనశక్తిలో భావమాత్రగాను బుద్ధి శరీరముగాను యున్నది. మనస్సునుగురించి మాట్లాడునపుడు సాధారణముగామనము దేనిని నిర్లక్ష్యముచేయుదుమో యట్టి భావములే దానికి చాల ప్రాముఖ్యములు. భావములు యజమాని. బుద్ధి సేవకుడు. భావస్థానమైన హృదయము, మఱవి శ్వాసముల కునికిపట్టు; కార్యములను పురికొల్పి దానిని ఘటించుటకు వలయుశక్తినికూడ సమకూర్చును. 'యజమానివృద్ధిని (హృదయమును) నిర్లక్ష్యముచేసి నౌకరును (బుద్ధిని) తెగపెంచుటవలన నెట్టిప్రయోజనమును లేదు ! అని స్పెన్సరు చెప్పుచున్నాడు. మనశ్శాస్త్రపండితుడగు జేమ్సుగారుకూడ నిట్లు చెప్పెను. 'మతసంబంధమైన యనుభవములుకూడ తదితరప్రత్యక్షానుభవము లెంతవిశ్వసనీయములో యంతవిశ్వసనీయములే. అంతేకాదు అవి సాధారణముగా తర్కముచే స్థాపించబడిన ఫలితములకంటెకూడ నెన్నియో రెట్లు విశ్వసనీయములు' ఆడంబరభూయిష్టమైన నీ బాహ్యతత్త్వమును దాటి, నిజతత్త్వమునకు సుముఖుడవగుట; నీ నిజతత్త్వములోని గభీరతను తెలిసికొనుట; దానిని గుర్తించి, భావించి, యనుభవించి, నీ నిజతత్త్వములో నైక్యముపొంది ప్రకృతిత

త్త్వమును నదియేయని యెఱింగి 'తత్త్వమసి' యొక్క చేతన మూర్తివై వెలుగొందుట—ఇదియే నీధర్మము.

జీవితము బూడిదపాలుకొఱకు కాదు.

ఒక సన్యాసివద్ద కొన్నిరాగినాణెము లుండెను. వాటి నాతడు కొంతమందిపిల్లల కిచ్చివేయవలె ననుకొనుచుండెను. అనేకమంది బీదబాలు రాతనివద్ద గుమిగూడిరి. అప్పుడు భద్రగజము నెక్కి యొకరాజామార్గమున పోవుచుండెను. యోగి యాడబ్బులను రాజు కూర్చొనిన యేనుగుబూది యంబారిలోపడునట్లు పైకివిసరెను. రాజు తెల్లబోయెను అవి కడుదరిద్రుడవైన నీకొరకే యని యాయోగి పలికెను. 'అదెట్లు' అని రాజు ప్రశ్నించెను. 'నీకు సర్వైశ్వర్యములు ను యున్నవి. కాని నీదాహముతీరుట లేదు. అవిచాలక నీవిం కను రాజ్యములకొఱకు పరితపించుచున్నావు; నీవందరికన్నను దరిద్రుడవు' అని యోగి బదులుచెప్పెను.

ఒకడు యిచుపభోపాణములను డబ్బుతోనింపుచుం డెను. ఒకయోగి యామార్గమున బోవుచుండగా లోపలికా హ్వానింపబడెను. అదంతయుచూచి యోగి నీ వెందుకట్లుచే యుచున్నావని యతని నడిగెను. "స్వామీ! మీకేమిలోటు! ప్రజలు మీకు ఏందు లొసంగుదురు! అట్లు చేయకపోయి నను మీకుమీశరీరములు గడ్డిపరకలు. మాబోంట్లు ధనము ను పోగుచేసికొనిన సమయమువచ్చినపుడుపయోగించుకొన

వచ్చును" అని యతడు బదులు చెప్పెను. యోగిమాటాడక వెడలిపోయెను. మరునాడు యోగి తన కుటీరములోనుండగా యా భాగ్యవంతుడచ్చటకు వచ్చెను. ఆయోగి బహుశ్రమ పడి పెద్దగొయ్యినొకదానిని త్రవ్వి దానిలో గుండ్రటి యంద మైనరాళ్ళను రోజంతయు గుప్పుచుండెను. రాళ్లుకుప్పలుగా పడుచుండెను. ఆభాగ్యవంతుడు మీ రెందుకిట్లు చేయుచు న్నారని యోగినడిగెను. నేనీయందమైనరాళ్లను పోగుచేయు చున్నాను. అవెంతగుండ్రముగానున్నవో చూడుము. అని యోగి బదులుచెప్పెను; స్వామీ! ఇక్కడొక పెద్దకొండయు న్నదే! దానినిండ కోటానకోట్లు రాళ్లున్నవి. మీకీవృధాశ్ర మయేలయని చిరునగవుతో యాభాగ్యవంతుడడిగెను. నాకు కావలసినపుడుపయోగించుకొనుటకు నేను వీటిని పోగుచేసు కొనుచున్నాను. ఎప్పుడైనను యీకొండలన్నియు కొట్టుకొని పోవచ్చును. కనుక నేనిప్పుడే దాచుకొనుచున్నానని యతడ నెను. 'స్వామి! అదెట్లు సంభవమగును? కొండలన్నియు కొట్టుకొనిపోవుటెట్లు?' అని యాభాగ్యవంతుడు యోగిని మరలప్రశ్నించెను! 'మూర్ఖుడా! నీవే నాకీపాఠమును నేర్పి తివి! నీయన్నమును నీకు భగవంతుడు ప్రసాదించని కాల మెన్నడును రాదు! నీశక్తిని, నీయమూల్యకాలమును వెండి బంగారములను పోగుచేయుటకు నీవేల పాడుచేసెదవు. ఇప్ప టికైనను యీపాఠమును నేర్చికొనుము. జీవితము నిట్లు

వృథాపుచ్చరాదు. ఈవిధముగా దుర్వినియోగము చేయరాదు. ఈలేనిపోని విచారములకొరకు జీవితమును దగ్ధము చేయకుము.

## ఆశాపాశము.

తొంబదితొమ్మిది యనువలలో పడకుమని పెద్దలు చెప్పుదురు. దీనిభావమేమి? ఉత్తరదేశమున నిదియొక సామెత. ఒకడు తనభార్యతో తనకుటీరములో నతిసంతోషముతో కాలము గడపుచుండెను. వాడు రోజంతయు పనిచేసి చెమటయూడ్చి యేకొద్దియో సంపాదించి దానితో శరీరయాత్రను గడపుచుండెను. వాని కింక నే ప్రాపంచికకోరికలును లేవు. ఈర్ష్యగాని ద్వేషముగాని లేదు. చేతికొద్దిపని చేసికొనుట, దొరికినదానితో సంతోషించుట యివియే వానికిజీవితము. వానిగుడిసెప్రక్కనొక శ్రీమంతుడుండెను. ఈతని కెప్పుడు నేదోయొక విచారముండెడిది. ఎప్పుడును సంతోషమనునదే యితడెరుగడు! ఒకయోగి వారిరువురయిండ్లను యొకనాడుచూచుట తటస్థించెను. అతడు భాగ్యవంతుని కడకు బోయి నీభాగ్యమే నీవిచారములకు కారణమగుచున్నది నీవు వేటిని కలిగియున్నావో యవికూడ నిన్ను కలిగియున్నవి; నిన్ను బంధించుచున్నవి. నీమనస్సుదీనినుండి దాని మీదకును దానినుండి మరియొకదానిమీదకును సంచారము చేయుచుండును. ఆబీదవానినిచూడుము! అతని కేమియు లేదు.

కాని వానిముఖము సంతోషకాంతులతో నిండియున్నది. వా
నినరము లెంతదిటవుగానున్నవో చూడుము ! వానిచేతులు,
కాళ్ళు యతిసౌష్టవముగా నున్నవి. అదిగో వాడు యీల
వేయుచు, గీతములుతీయుచు, యెంతహుషారుగా, యెంత
నిర్విచారముగా, యెంత తేలికగా పోవుచున్నాడోచూడుము!
ఆధనవంతు డెప్పుడును నట్టియానందమును బొందియుండ
లేదు. ఆధనవంతు డాయోగిమాటలను పరీక్షించ నెంచి
యోగిచెప్పినప్రకార మాబీదవాని గుడిసెలో 99 రూపాయి
లను దొంగతనముగా జారవిడిచెను.

చిత్రము! మరునాడు బీదవానియింటిలో నిప్పేరాజ
వేయలేదు. ప్రతిరోజు వానియింట శుభ్రమైనమంట వెలిగె
డిది. ఆతడు కష్టించి తీసికొనవచ్చిన డబ్బుతో వచ్చునంత
సంభారమును తెచ్చుకొని వండుకొని వారు హాయిగా భుజిం
చెడివారు, కాని ఆరాత్రిమాత్రము వారునిప్పు నీరు యార్పు
కొని పస్తుండిరి. మరునాడు యోగియు భాగ్యవంతుడును
కలసి వానియింటికిబోయిరి. నిన్నమీయింట నిప్పులేదేమి
యని యాయోగి వాని నడిగెను. అతడబ్ధము చెప్పజాలక నిజ
ము నిట్లు చెప్పివేసెను. 'నేనిదివరకు రోజుకు కొన్ని యణా
లనుమాత్రమే కష్టించి తెచ్చుకొని దానితో బియ్యము, కూ
రలు వగైరా ఖరీదుచేసి హాయిగా భోజనముచేసెడివారము.
నిన్నమాయింట 99 రూపాయలతో నొక పెట్టెదొరకెను.

వెంటనే యింకనొకరూపాయియున్న నూరగునుగదా యను నక్కఱయాశ కలిగెను. రోజువిడచిరోజు యొకపూట తిండి మానినచో నొక వారమురోజులలోనైనను నొకరూపాయిను మిగిల్చినచో 100 అగునని మేమూహించుకొంటిమి' అని యతడనెను. కనుక వారు పస్తుండవలసివచ్చెను. ధనికుల లోభత్వములోనున్న రహస్యమిదియే. వారు సంపాదించినకొలది దరిద్రులగుచుందురు. 99 యున్నపుడు 100 కావలెను 99,000 యున్నపుడు 100000 కావలెను.

### భగవంతుడు సర్వత్రనున్నాడు.

ఒక ఖాజీగారొకప్పుడు పాదుషావద్దకు గొప్ప యుద్యోగముకొరకు వచ్చెను. వానిని పరీక్షించుటకు పాదుషా 'భగవంతు డెక్కడ కూర్చొనును ? అతనిముఖమేవైపున నుండును? ఆతడేమితినును; ఏమిచేయును' అని ప్రశ్నించెను, వీటికి సమాధానమిచ్చుటకు వారంరోజులు గడువీయబడెను. సరియగు సమాధానమువచ్చుచో యుద్యోగమగును. ఖాజీగారి కదంతయు నగమ్యగోచరమయ్యెను. గడువుసమీపించుచున్నను యేమియుతోచక యతడు గడువురోజున జబ్బుగానున్నట్లు నటించిపండుకొనెను. ఆతని నౌఖరువచ్చి యతని రోగకారణము నడుగ 'నన్ను బాధించకుము. నేను చావనున్నాను'అని యతడనెను. అయ్యో! సంగతేదియో నాకు తెల్పుడు. మీరు బాధ వడుటకంటె మీకొరకు నేను చని

పోవుటకు సిద్ధముగా నున్నాను అని యతడు బ్రతిమలాడెను. అప్పుడు ఖాజీ నిజమును చెప్పివేసెను. ఆనాఖరు చాలతక్కువజాతివాడు. ఎట్టిగౌరవమును లేనివాడు. కాని ఖాజీకి నిజమైన శిష్యుడు, చదువుకొన్నవాడు. అతడా ప్రశ్నలకు జవాబు చెప్పుట కొడంబడెను. తనజవాబులు సమంజసముగా నుండని యెడల తానే చనిపోవుట కంగీకరించి తన చింకిరిగుడ్డలను ధరించి పాదుషావద్దకు వెళ్లెను. ఈచింకిగుడ్డలవాడొక మహావేదాంతి! హిందూదేశములో రాజాధిరాజులుకూడ నిట్టి సన్యాసులవద్దనే జ్ఞానోపదేశమును పొందుదురు. అతడట్లు పాదుషాదగ్గరకుపోయి మీకేమికావలెనని యడుగగా 'ఓరీ! నీగురువునకిచ్చిన ప్రశ్నలకు నీవు జవాబునీయగలవా?' యని రాజడిగెను. 'అట్లనేచేసెదను' కాని ప్రశ్నించువాడెప్పుడును శిష్యుడు. సమాధానములను చెప్పువాడు గురువు. కనుక మన మతగ్రంథములప్రకారము నీవు నడువవలెను. మనమతధర్మములప్రకారము నాకు గౌరవస్థానము నిచ్చి నీవు క్రిందకూర్చొనుము' అని యావేదాంతి చెప్పెను. రాజు తనదుస్తులను యాభరణములను యతని కిచ్చివేసి తన సింహాసనముమీద కూర్చుండుమని చెప్పి నీసమాధానములు బాగుండనిచో తల నరికించెదనని చెప్పెను. అందుల కాతడదివరకే యొప్పుకొనెను. దేవుడెక్కడకూర్చుండును యనునది మొదటిప్రశ్న. మాటలతో జవాబుచెప్పిన దాని కర్థముకాదని యతడొక

గోవును తెప్పించమనెను. ఒకగోవు తక్షణమే తీసికొనిరాబడెను. 'అయ్యా! ఈయావులో యేమైన పాలుగలవా?' యని యతడు రాజును ప్రశ్నించెను. రాజు 'ఉన్నవి. తప్పకపాలున్నవి' యనిచెప్పెను. 'ఎచ్చటనున్నవి?' యని పండితుడడిగెను. 'పొదుగులో' నని రాజుచెప్పెను. 'కాదుకాదు. తప్పితివి. పొదుగునుకోసిచూడుము! నీకేమియు పాలురావు. పాలు ఆవుశరీరమంతటను యున్న' వనిచెప్పి దాని నాపండితుడు పంపించివేసెను. అప్పుడు కొన్నిపాలు తీసికొని రాబడెను. 'ఈపాలలో వెన్నయెక్కడనున్నది? ఈపాలలో వెన్నయున్నదా' యని పండితుడడిగెను. ఉన్నదని వారుచెప్పిరి. ఈపాలలో వెన్నయెక్కడకూర్చున్నది! యని పండితుడడుగ వారందరును తెల్లబోయిరి. వెన్నయెక్కడ కూర్చుండునో మీరు చెప్పజాలకపోయినను అది యీపాలలో నున్నట్లు మీరు నమ్ముచునేయున్నారు. నిజమునకు వెన్న పాలలో సర్వత్రయున్నది. అని యతడుచెప్పెను. అట్లే భగవంతుడు పాలలో వెన్నయున్నట్లు ఆవులో పాలున్నట్లు యీవిశ్వమంతటను నిండియున్నాడు. పాలకొరకు నీవు ఆవును పితుకవలసియున్నది. అట్లే భగవంతునికొరకు నీవు నీహృదయమను కామధేనువును పితుకవలెను! అని యతడు చెప్పగా రాజు నిర్విణ్ణుడయ్యెను. భగవంతు డెక్కడో యెనిమిదవ స్వర్గములోను తొమ్మిదవ స్వర్గములోను యున్నాడని చెప్పినవారి మాటలు

తల్లియని రాజపుడు కనుగొనెను. రెండవప్రశ్న: భగవంతు డెట్లుచూచును? తూర్పు, పడమర, యుత్తరదక్షిణములలో యెదిశకు చూచును? వారందరును భగవంతు డొక వ్యక్తి యనుకొనిరి! అప్పుడాపండితుడొక దీపము నాజ్ఞాపించెను. ఒక క్రొవ్వొత్తి తూర్పుకుగాని పడమరకుగాని యుత్తరమునకుగాని దక్షిణమునకుగాని చూచుట లేదు. నిజమునకది నల్దిశలను సమముగా చూచుచున్నదని పండితుడు బోధ చేసెను. రాజానందభరితుడయ్యెను. భగవంతుడు నీహృదయములోని జ్యోతి. అది యన్నివైపులను తిలకించుచుండును.

మూడవప్రశ్న: భగవంతు డేమి చేయుచుండును? పండితుడు 'సరే' ముందు ఖాజీని తీసికొనిరండు అని చెప్పెను. ఖాజీవచ్చెను. తన నౌఖరు సింహాసనము నధిష్టించుట రాజు క్రింద కూర్చొనుటయు చూడ నతని కాశ్చర్యము కలిగెను.

అప్పుడు పండితుడు ఖాజీని పండితునియొక్క యథాస్థానమున నుండ నియమించెను. అనగా నౌఖరుపదవి నిచ్చెను. రాజును ఖాజీయొక్క స్థానమున కూర్చొనుమని తాను సింహాసన మధిష్టించి భగవంతుడిట్లే చేయుచుండును. పండితుని రాజుగాను, రాజును ఖాజీగాను ఖాజీని 'ఫాజీ' గాను చేయుచుండును. ఇదియే యతని నిత్యకృషి. ఒకకుటుంబము కొంతకాలము మహాదైశ్వర్యము ననుభవించును. తరువాత

నది యధఃపతితమై పేరులేనిదై మరియొక కుటుంబమును పైకి వచ్చును. కొంతకాల మొక పురుషుని మహాపురుషుడని మి న్నంట పొగడుదురు తరువాత మరియొకడు పైకివచ్చును. ప్రతిదినము ప్రతివత్సరము నిట్టీచక్రము తిరుగుచు నే యుండు ను; మార్పులు జరుగుచునే యుండును. అప్పటినుంచి మన పండితునికి ఖాజీపదవి నిచ్చిరి.

భగవంతు డెప్పుడును కృతజ్ఞుడే.

అతడు తన ఋణములను వడ్డీతోసహా చెల్లించు చుం డును. ఒకదేశములో నొకమహారాజపుత్రు డతివైభవముతో తనప్రజల నేలుచుండెను. అతడు వివాహమాడ లేదు. ప్రజ లందరును నతని నెట్లైన వివాహమాడుమని బలవంతపెట్టు చుండిరి, ఎట్టకేల కతడొప్పుకొనెను. వివాహప్రయత్నములు రాజవైభవముతో చేయబడుచుండెను. శుభదినమున రాజు తన సమస్తపరివారముతోను, భద్రగజము నెక్కి భేరికాది మంగళ వాయిద్యములతో బయలుదేరెను. అతడు తన చిత్తమువచ్చిన కన్యను వరించవలెను. అత డెక్కడకు బయ లుదేరుచున్నాడో యెవ్వరు నెరుగరు. రాజనగరు దాటిరి. ఇంకను ముందుకుపోవుచుండిరి. రాజు దట్టమైన యడవిమార్గ ములనుబట్టి పోవుచుండెను. 'ఈ రా జేమిచేయుచున్నాడు? చివర కీత డేచెరువునైనను చెట్టుచేమనైనను పెండ్లాడనున్నా డా యేమి?' యని వారందరును గుసగుసలు మొదలుపెట్టిరి.

ఇంతలో స్ఫటికధావళ్యములో మెరయుచున్న నొకకాసార
ము, దానిప్రక్క నొకకుటీరము కాన్పించెను. ఆకాసార
మన్నివైపులను యాకసమునంటు చెట్లనీడలతోను, పూపొ
దరిండ్లతోను కడురమ్యముగా నుండెను. వాటికొమ్మలనడు
మ నొకముదుసలి యుయ్యెలలో నూపింపబడుచుండెను.
'ఇతడాముదుసలిని పెండ్లాడునా యేమి?' యని వారు హేళన
చేసికొనుచుండిరి. పరివారమంతయు నచ్చట జేరుటతోడనే
ప్రయాణ మాపివేయబడెను. అచ్చట నొక దేవకన్యకను
బోలు కన్యక తన చిరుతచేతులతో నాముసలి తండ్రి ను
య్యేలలోనుంచి యూపుటను వారు గాంచిరి. ఆరా జెన్ని
యోపర్యాయములు తన చిన్నతనమున నచ్చటకు పోయి
యుండెను. ఆకన్య యెప్పుడును ధర్మానువర్తినియై తండ్రికి
సపర్యలొనగుచు, మలమూత్రముల నెత్తుచు, సర్వోపచార
ములను చేయుచు, తండ్రిని జలకమాడించి, వేళకిష్టాన్నభో
జనమిడి, పితృఋణమును తీర్చుకొనుచుండెను. అమె యెప్పు
డును యీపనినంతయు నాడుకొనుచు, పాడుకొనుచు, నతి
సంతోషముతో చిగురుచిగురున గంతులువేయు పక్షివలె
చేసికొనిపోవుచుండెను. ఆమెయొక్క యీమందస్మితవదనా
రవిందమే రాజు నెంతయు మెప్పించెను. రాజు తన భద్రగజ
మును దిగి యీమునిసమీపమునకు వచ్చి వాని పాదములకు
నమస్కరించెను. 'కుమారా! నీ కేమికావలెను' అని యత

డడిగెను. 'నన్ను నీయల్లునిగ జేసికొన వేడుచున్నా' నని రాజు బదులుజెప్పెను ఆముదుసలికి పట్టరానిసంతోషము కలిగెను. 'రాజా! నేను కడుబీదవాడను! నావంటి సన్యాసిపుత్రికను నీవెట్లు వివాహమాడగలవు' అని యత డనెను. 'నే నింకొక కన్యను వరించదలచుకొనలేను. నే నీమెనే ప్రేమించుచున్నాను' అని యతడనగా ముదుసలి 'సరే' యనెను. ఇతడు మహావేదాంతి; తన కుమార్తెకుకూడ వేదాంతమును బోధించెను.

అప్పు డామెకు సర్వాభరణములును చిత్రవిచిత్రదుకూలములును నొసంగబడెను. ఆమెవీటిని ధరించెను; కాని యామె తన 'బాలతొడుగు'ను మఱచిపోక దానిని కానుకగా తనతో నొకపెట్టెలో పెట్టి తీసుకొనిపోయెను. ఈ కానుకేదియో మీ రెరుగుదురా! ఆపె చింకిగుడ్డలమూట!

ఆమె రాజసౌధమును చేరెను. కాని రాజబంధువుల కిదెంతయు కష్టముగా నుండెను. రాజపుత్రికలను వివాహమాడక యొక ముష్టిపిల్లను వివాహమాడుచో వారామె నెట్లు రాణిగా పూజించగలరు! కానిత్వరలోనే యామె నడవడిక వారి హృదయములను మార్చివేసెను. వా రామె నెంతయు ప్రేమించి గౌరవింపసాగిరి. ఆమె యెప్పుడును, యెట్టికష్టములలోను, యెట్టిసంపదలలోనుకూడ శాంతచిత్తముతోనే నింపుకుండవలె తొణకకుండెను. ఒకసం

వత్సరమైన తరువాత యామెకొక చక్కనిపిల్ల కలిగెను. రాజును, రాణియు నాపిల్లనుజూచి యెంతయో మురియుచుండిరి. మూడునాలు గేండ్లు గడచెను. దేశములో గొప్పకుట్రబములుదేరెను. రాజపుత్రులందరును తిరుగుబాటు చేయుటకు సిద్ధముగా నున్నారు. తక్కువజాతిస్త్రీకి పుట్టిన యాపిల్లరాజ్యమున కధికారిణి యగుట వారికి కంటకముగానుండెను. మరియొకపిల్లను పెంచుకొనుచో పెరిగి పెద్దవారైన తరువాత వీరిరువురిలోను కయ్యములు పెరుగును. ఏమిచేయుట ? ఈ సంగతి రాజు రాణికిచెప్పి ‘ఈపిల్లను చంపివేయుచో మన బాధలన్నియు గట్టెక్కును.’ యని యనెను. రాణి వెంటనేయిట్లనెను. నే నిచ్చటకు వచ్చిననాటినుండియుకూడ నీతోకలసి యీసింహాసనము ననుభవించవలెనని నా కెట్టికోరికయును లేదు. నాకోరికలను, నాయాశలను, నాసర్వస్వమును నాడే నీపరము జేసితిని నావ్యక్తి, నాశరీరము నీలో నాడేకలసిపోయినవి. నాశరీరము నీసేవకేగాని నీ కభ్యంతరమును కల్పించుటకుకాదు. ఈపిల్లను చంపించుట నీకు హితమైనచో నట్లే చేయించుము. ఈపిల్ల నాపిల్లయని నాహృదయాంతరాళమున నే నెప్పుడును తలంచలేదు. అట్లు పిలువలేదు !’ తరువాత నిశీథమందు కటికవాండ్రు కాపిల్ల నిచ్చివేసి రాజు రాణితో యావృత్తాంతమును చెప్పెను. ఆరాణి యావంతయు చలించలేదు ; శాంతి తప్పలేదు ; సంతోషము చెదరలేదు ; ముఖ

కాంతి తగ్గలేదు; ఆమె కేమియు జరుగనట్లే యుండెను. ఇదియే వేదాంతము; బాహ్యసంస్పర్శలను గణనచేయకుండుటే జ్ఞానము.

దేశములో శాంతి కలిగెను. ఇట్లు కొంతకాలము జరిగెను. తరువాత వారి కొకమన్మథునివంటి పుత్రుడుదయించెను. వానిని ప్రేమించనివా రెవరును లేరు. ఇట్లు కొన్నిసంవత్సరములు గడచెను. తిరుగ దేశములో నల్లరిబయలు దేరెను! ఈపిల్లవానినికూడ చంపకపోయినచో దేశములో నరాచకము, యుద్ధము బయలుదేరును; దేశస్వాస్థ్యము చెడిపోవును.' అని రాజు రాణికెరిగించెను. రాణి సంతోషముతో నిట్లనియెను. 'ఈదేశమంతయు నానిజాత్మయే. నాకుచెందినదేదియు లేదు. 'నాది' యనునది నా కేమియు లేదు. నేనుసూర్యునివలెనున్నాను. ఇచ్చుటే నాస్వభావము.' ఆపిల్లవాడుకూడ యిచ్చివేయబడెను. తరువాత మూడవశిశువు కలిగెను. అదియు నట్లే యర్పించబడెను. ఆరాణి యెట్లు ధైర్యమును నిలుపుకొనగలిగెను? ఆమె రాజసౌధమునకు వచ్చిననాటనుండియు తన చింకిగుడ్డలను భద్రముగా దాచుకొని యుంచుకొన్న యొకగదిలోని కొక్కటెయు బోవుచుండును. అక్కడ తన రాజవస్త్రములను తీసివేసి యాచింకిగుడ్డలను ధరించి నేను "సత్"ను అనగా బ్రహ్మమును అని ధ్యానించుచుండును. అట్లు తనదేవత్వము నాచింకిగుడ్డలతోనే గ్రహించి యనుభ

వించును. తానిచ్చట సౌధములలోను రాజవైభవములలోను బంధింపబడియున్నను చిన్ననాటి తన యానందము నెన్నడును కోల్పోలేదు. ఐశ్వర్యములుగాని, భోగములుగాని యామెను తమవంకకు త్రిప్పుకొనలేకపోయెను. ఆమెకు దేనియందును రాగములేదు. ఆమెయునన్నెప్పుడును బాహ్యావిషయములలో చిక్కుపడలేదు. ఆమె యెప్పుడు "సోహం" జపమును చేయుచునేయుండెను. ఇట్లు తనబంధనములను, బాధ్యతలను త్రెంచుకొని యామె పవిత్రురాలయ్యెను. మీరెప్పుడేని క్రుంగిపోయినట్లుగాని, విచారగ్రస్తులయినట్లుగాని బాధపడవలసివచ్చినయెడల నిట్లే చేయవలెను. అన్నిబంధనములను, కోరికలను అవసరములను, రాగములను, మమకారములను తెంపుకొనుడు. తక్షణమే మోక్షసామ్రాజ్యము మీయరచేతిలో నుండును. ఈరాణి యెప్పుడును రాజసౌధములో నున్నంతకాల మిట్లేచేసెను.

రా జొకరాత్రి యామెనుచేరి మాటమాటికి బిడ్డలను చంపుచుండుట బాగుండలేదనియు, పెంచుకొనుటకు తన కిష్టములేదనియు నతడు తిరుగ వివాహమాడుటే యుచితమని తోచుచున్నదనియు చెప్పెను. రాణి తత్‌క్షణమే దాని కంగీకరించెను. ఆమె రాజునుంచి యెప్పుడును యానందమును గోరలేదు; తన యాత్మానందమే యామెకు మహదానందము. తనలోని భగవంతుడే యామె కానందమును గొల్పు

చుండెను. భర్త, తండ్రి, బిడ్డలు, వీ రెవరును ప్రధానముగా తలంపబడ నేలేదు. ఆమెయొక్క నిర్విచారమునకు రా జాశ్చ ర్యపడెను. కాని నూతనరాణి వచ్చుచో యిరుపురకును పొందు పొసగదేమోయని రాజామెను వెళ్ళిపొమ్మనెను. తత్క్షణమే యామె సువర్ణవస్త్రములను తీసివైచి తనచింకిగుడ్డలను ధరించుకొని పంజరమునుండి పారిపోవు పిట్టవలె నదృశ్యమైపోయెను. తండ్రియు కూతురును యథాప్రకారముగా సంతోషముతో కాలమును బుచ్చుచుండిరి.

ఒకనాడు రాజామె నోదార్చవలెనని యటకు వెళ్ళెను; కాని యోదార్చు టెవరిని? ఆమె ముఖకమల మెప్పటివలె చంద్రకాంతులను ప్రసరింపజేయుచుండెను. రా జాశ్చర్యపడి యామెను తనగృహపావనమును జేసి నూతనవధువు నాశీర్వదించుటకు రమ్మని కోరెను. ఆమె యతిసంతోషముతో దాని కొప్పుకొని రాజసౌధమునంతను యత్యాశ్చర్యకరముగా నలంకరించి వధువు నతివైభవముతో సత్కరించి, రాజలోకమును యితర రాణివాసమును నలరింపజేసెను. నూతనవధువు నామె ముద్దుపెట్టుకొని మాతృప్రేమతో యాలింగన మొనర్చెను. వధువుతో నామెచిన్నిసోదరులుకూడ వచ్చిరి; రాణివాసములో గొప్పవిందు లేర్పాటు చేయబడెను. మన పూర్వపు రాణియే దీని కధ్యక్షురాలు. ఆమెయొక్క చిత్తశాంతి, ప్రసన్నవదనము చూచునరికి యచ్చటనున్నవార ందరును ఖిన్నులై

మొదటిభార్యను చూచి 'నీవు సంతోషస్వాంతురాలవుకమ్మా! నీవొక్కతవే నాయఖిలరాజ్యములోను యానందస్వరూపిణివి' అని వారి కతడు నిజవృత్తాంతమును తెలిపెను. ఆ నూతనవధువును యామెసోదరులును రాజుబిడ్డలే. కఱకువాండ్రాబిడ్డలను చంపుటకు చేతులాడక వారి నొకయడవిలో విడిచిపెట్టిరి. ఒకరాజు వానిని పెంచి పెద్దవారినిజేసెను. అప్పుడు హర్షధ్వనులుచెలరేగెను. మన పూర్వపురాణి తిరుగ రాణియయ్యెను పుత్రికను పుత్రులను మరల బడసెను. భగవంతు డెప్పుడును కృతజ్ఞతను మరువడు; సరికదా దానిని వడ్డీతోసహా సమర్పించుకొనును.

ప్రతిగృహిణియు తనప్రేమలో నిట్టి సన్యాసమునే వహించునుగాక! మన భారతదేశములో పతివ్రతయనియు పత్నీవ్రతుడనియు యందుము. అనగా భార్య భర్తద్వారముననే (మన కథలోని రాణివలె) నివసించును; అతనిలోనే భగవంతుని చూచును; శరీర, మానసికము లను రెంటిని యాతని కిచ్చివేయవలెను. భర్తకూడ నిట్లే భార్యలోని భగవంతునికి సర్వము నిచ్చివేయవలెను. ఇందులో స్వార్థ మేమియు లేదు. హిందూదేశమున పూర్వము (కొన్నిచోట్ల యిప్పటికిని) వివాహము లెప్పుడును సూర్యభగవానునియెదుట, వినీలాకాశమే ఛాందినియై వెలుగ నదీతీరముననే జరుగుచుండెడివి. ఇక్కడ భార్య భర్తయొక్క చేతిని పట్టుకొనును. భర్త భార్యచేతిని

పట్టుకొని యా రెంటిని భగవంతున కర్పించును. ఇదియే దీనిభావము. ఇట్టి గృహస్థజీవితమే పరమపావనమై సౌఖ్యముల నొసగూర్చును. ఒకరిలో నొకరు లీనమయినపుడే యా ప్రేమ, యా జీవితము యనుభవయోగ్యమగును! ఆనందావహమగును.



# రామతీర్థస్వామి జీవితము.

## రెండవ భాగము.

—:o:—

### ఆంగ్లస్థానము దానిచరిత్ర.

యూరపియనుజాతులును, క్రిస్టియనుజాతులును సె
నోన్యక సైన్యములతో, సముద్రసన్నాహములతో నితరజాతులను
కొల్లగొనుటకు నుంకించుచున్నవి. 'రాముడు' ఇందుకు వారిని
నిందించజాలడు. జాతియొక్క యాధ్యాత్మికాభివృద్ధిలో నిది
యు నొక యంతరు వగుచున్నది. (ఎప్పుడో యొకప్పుడు జాతి
కిదియు నవసరమే). భారతదేశముకూడ నీస్థితిని యనుభవిం
చినది. కాని యది చాలపురాణదేశమగుటచే ప్రపంచభాగ్య
మునంతను యొకసారి చవిచూచినది; దానితో తులతూగి
నది. దాని నిస్సారతను కనుగొనినది. ప్రపంచైశ్వర్యములకొ
రకు ప్రస్తుతము 'గిజగిజ తన్నుకొనుచున్న' దేశములగతియు
నిట్లే యగును. ఇతరజాతులను కొల్లగొనుటకీజాతులన్నియు
సైన్యముల నేలసమకూర్చుచున్నవి? దానివల్ల నవి దేని నాశిం
చుచున్నవి ? ఆనందము; సౌఖ్యము; భోగము. దీనికొరకే
ప్రపంచములో నీయట్టహాసమంతయు జరుగుచున్నది. ఇంకను

వేయి కారణములను చెప్పవచ్చును. కాని ఈజాతులన్నియు బుద్ధిపూర్వకముగగాని, యబుద్ధిపూర్వకముగగాని, ప్రత్యక్షముగగాని, యప్రత్యక్షముగగాని యాశించు పరమపదమేది? ఆనందము. మరిదేనినికాదు. కాని ఆనందమెక్కడ నివసించును? దానికిస్థానమేది? అది కుటీరములలోనుండునా? సౌధములలో సయ్యాటలాడునా? స్త్రీవదనకమలములా దాని యాలయములు? వెండి, బంగారములా? లేక అవి కొనువస్తువులా? ఎచ్చటనుండును? ఆనంద మెచ్చట నివసించును? దానికిని ఒకచరిత్రకలదు. రైళ్ళు, ఆవిరియంత్రములు, వాయువిమానములు విద్యుత్తులు మొదలగు సాధనములచే నీరోజులలో ప్రయాణముల బడాయి హెచ్చినది. ఆనందముకూడ నిరంతరము ప్రయాణము చేయుచుండును. దాని ప్రయాణముల నొకింత పరికించెదము.

పసికూనలో ప్రారంభించు నీయానందయానను, ఈ మెరుపును తిలకించి చూడుడు. ఈ ప్రపంచములో శిశువుకు పరమానందమును కలుగజేయునది తల్లిచెరగు; తల్లిరొమ్ము. శిశువున కానందస్థానము ప్రపంచములో వేరొకటి లేదు. ఆనందము చేయు ప్రయాణములలో మొదటి మజిలీస్థలము తల్లిచెరగు; తల్లిరొమ్ము. శిశువు తల్లిచెరగుచాటున తన ముఖమునుంచి 'అమ్మా! అమ్మా! నేను ఎక్కడనున్నానో చెప్పుకో! నన్ను కనుక్కో' అని గేలిసేయుచుండును; మహాదా

నందము నొందుచుండును. పకపక నవ్వుచుండును. ఇదియే శిశువుయొక్క యాత్మానందము; హృద్యానందము. ఆపెను పుస్తకము లర్థరహితములు; ధనము నిరర్థకము. పాలును వీడని శిశువుకు ఫలములు, తినుబండములుకూడ రుచింపవు; ప్రపంచైశ్వర్యమంతయు తల్లిచెరగులోనే దాగియుండును.

ఒక వత్సరము గతించును శిశువుయొక్క యానంద స్థానము మారిపోవును. అది మరియొకవస్తువు నాశ్రయించును. బొమ్మలు, 'పాపాయిలు' 'అబ్బాయిలు' ఇవియే యిప్పు డానందస్థానము లగుచున్నవి. ఈరెండవ మజిలీలో శిశువు తనబొమ్మలతో మురియునట్లు తల్లితోకూడ మురియ జాలదు; ఒక్కొక్కప్పుడు వీటికొరకు కన్నతల్లితోకూడ జగడమాడుచుండును. ఈమంటిబొమ్మలకొరకు! ఈకర్రబొమ్మలకొరకు! మరికొన్ని నెలలు, మరికొన్నివత్సరములు గడచును. ఈ బొమ్మలు, ఈ'పాప'లు వాటి మహిమను గోల్పోవును. వాటిలో యానందము లేదు. అది మరియొక స్థలమును చూచుకొనినది. ఈమూడవమజిలీలో శిశువు కొంచెము పెరిగిపెద్దవాడై బాలుడగుసరికి యానందము పుస్తకముల నాశ్రయించును. ముఖ్యముగా కథలపుస్తకము లానంద సర్వస్వము లగుచున్నవి. ఇక్కడ మనము సామాన్య తెలివితేటలు గల పిల్లవాని విషయమే తీసికొనుచున్నాము. కొందరకు మరికొన్ని వస్తువులు రుచింపవచ్చును. కాని మనము సామాన్యమైన పిల్లవానిసం

గతి యాలోచింతము. ఇప్పుడు వానియనురాగము, ప్రేమ యంతయు కథలపుస్తకములపర మగుచున్నది. బొమ్మలు, 'పాపలు' వాటిసౌందర్యమును కోల్పోయి కథలపుస్తకములు వాటిస్థానము నాక్రమించినవి. ఈపుస్తకము లెంతయందమైనవో! ఎంతమనోహరములైనవో! తిండినైనను కోల్పోవును గాని పుస్తకములను వీడడు! కాని ఎంతకాలము! ఆనందము ప్రయాణమును మాత్రము మానదు. ఈ బడిపిల్లకాయ పెద్దవాడై కళాశాలలో ఏయింటరుమీడియటు తరగతిలోనో చేరును. వాని యానంద మిప్పుడు శాస్త్రగ్రంథములమీదకో వేదాంత గ్రంథములమీదకో మారును. ఇట్లు కొంతకాలము గడచును. వానియానందము పుస్తకములమీదనుంచి విశ్వవిద్యాలయములో గొప్పగొప్ప పట్టణముల సంపాదన మీదకు ప్రసరించును. ఇప్పుడు వీని యీకోరికే యానందమునకు ప్రధానస్థాన మగుచున్నది; రాజధాని యగుచున్నది. విశ్వవిద్యాలయములో గొప్పగొప్ప పట్టణములను సంపాదించును. కీర్తికాంతను చేపట్టును. అతను పెద్దయుద్యోగమును సంపాదించును. నెలకు వందలకొలది జీతమును తెచ్చుకొనును. ఇప్పుడు ద్రవ్యార్జనయే వాని యానందస్థానము. ద్రవ్యమును కూడబెట్టుటకే కలలను గనుచుండును. చాల ఐశ్వర్యమును సంపాదించి గొప్పవాడగుటయే యతనికోరిక. ఇట్లు కొంతకాలముద్యోగములో ధనము సంపాదించిన తరువాత నతని యా

నందను మరియొకవస్తువు నాశ్రయించును. అదేమి ? దానిని చెప్పవలెనా ? స్త్రీ! స్త్రీ! ఈయువకునకు భార్య కావలెను. ఇతడు భార్యకొరకు తనయైశ్వర్యమును వెదచల్లుచున్నాడు. ఈతని కిప్పుడు తల్లిచెరగులో సౌఖ్యము లేదు ; బొమ్మలలో సొంపు లేదు ; కథలపుస్తకములు బీరువాలలో భద్రము చేయబడినవి. ఇతని జపము, ఇతని తపము, ఇతని కలలు......అన్నియు స్త్రీకొరకే. ఇతడు భార్యకొరకాత్రపడుచున్నాడు. కష్టించి యార్జించిన ధనమునంతను తన యౌవనసమయమున కిప్పుడు [illegible] స్త్రీకొరకు 'గంగపాలు' చేయుచున్నాడు. స్త్రీలభించును అనుకొని కొంతకాలము [illegible] ననుభవించును. [illegible] మును సాగించును. భార్య! భార్య! యని [illegible] నాటి యానందము మిప్పుడాయనలో [illegible]. ఆనందమంతయు భార్యమీదనుండి రాబోవు శిశువునుగురించి మళ్ళినది. అతడు సంతానమునుగురించి కలలను గనుచుండును. భారతదేశములో వివాహ మగుటతోడనే సంతానముకొరకు దేవుళ్ళకు మ్రొక్కుదురు; తీర్థయాత్రలు చేయుదురు; లేహ్యములు తిందురు ; యోగీశ్వరులనుండి రక్షరేకులను గైకొందరు ; అష్టకష్టములను పడుదరు ; సర్వప్రయత్నములను చేయుదురు.

ఈయువకుని యానందమంతయు సంతానాగమనము లో నుండును. మనకథలోని పసికూన యిప్పు డానందము యొక్క యానందమజలీలో నున్నాడు. అతని కొక శిశు వుదయించును ఇక వాని సంతోషమునకు మేర లేదు; ఉత్సాహము పొంగిపొరలును; ఒక్కసారి యెగిరి గంతు వేయును; ఉబ్బిపోవును; అతడు భూమిమీదనుండి యెన్ని అడుగులు పైకి లేచునోగదా? అతడు నడువడు; గాలిలో విహారము చేయును; ఈదునేమో! సంతానోదయానంద మీవిధమున పట్ట పగ్గములు లేక యుండును. ఈ యారవస్థిలో పసిపిల్ల యొక్క చంద్రవదనదర్శనముతో మనకథలో పెరిగి పెద్దవాడైన పిల్లవానియొక్క యానంద మపారము. ఇదియే దాని యంత్యావస్థ. ఈ యువకుని యుత్సాహ మిక నానాటికి తగ్గిపోవుచుండును. శిశువు పెరిగి పెద్దవా డగుచుండును. వాని యందు పూర్వపుమోహము తగ్గిపోవును. వీని యానంద మిక యీవస్తువునుండి ఆవస్తువు మీదకు, దానినుండి మరియొక దానిమీదకు—యీవిధముగా గంతులు వేయుచుండును.

కాని యీతల్లి చెరగు, బొమ్మలు, పుస్తకములు, ఐశ్వర్యము, స్త్రీ, శిశువు లేక యీప్రపంచమున మరేవస్తువైనను యానందమునకు నిజమైన నివాసములా? యను విషయము నాలోచింపవలసియున్నది. ఈయానందమును మనము సూర్యకాంతితో పోల్చవచ్చును. అదియు యొకచోటనుండి

మరియొకచోటకు ప్రయాణము చేయుచుండును. ఒకప్పుడు ఇండియాలో ప్రకాశించును. ఇంకొకప్పుడు యూరపులో ప్రకాశించును. ఇప్పుడు తూర్పుఅమెరికాలో కన్పించినది. మరికొంచెముసేపటికి పశ్చిమఅమెరికాకు మారిపోవును; మరికొంతసేపటికి జపానులో కాన్పించును; ఈవిధముగా సూర్యరశ్మి యొకదేశమునుండి మరియొకదేశమునకు, యొకస్థలమునుండి మరియొకస్థలమునకు గంతులు వేయుచుండును ఒకచోట నిశీధమైన మరియొకచోట పట్టపగలగును. కాని ఈ సూర్యరశ్మి యెచ్చ యెచ్చట ప్రకాశించునో యాస్థలములన్నియు, యాదేశములన్నియు దానికి పుట్టినిండ్లుకావు. సూర్యరశ్మికి సూర్యుడే పుట్టినిల్లు అట్లే నిరంతరము ఈవస్తువునుండి ఆవస్తువుమీదకు దానినుండి మరియొకదానిమీదకు ప్రయాణముచేయుచుండు యానందమునకు నిలయము వేరొకటియుండవలెను. అది యెచ్చటనుండి యుద్భవించుచున్నది? దానినిజమైన జన్మస్థానమేది? ఈ యానందభాస్కరుని కొంచెము పరీక్షింపవలసియున్నది.

శిశూదయముతో పొంగిన మనకథలోని పెద్దమనిషిని తీసికొనుడు. అతడు తన ఆఫీసులోనున్నాడు; ఉద్యోగధర్మములతో 'కొట్టుమిట్టు' లాడుచున్నాడు; ఇంతలో నతడొకగంటచప్పుడును వినును. అది ఏమిగంట? టెలిఫోనుగంట. క్షణములో నొక్కగంతువేసి టెలిఫోనుదగ్గరకు పోవును.

కాని ఆసంగ తేదిరో వినకపూర్వమే యతనిహృదయము 'తటతట' కొట్టుకొనుటకు ప్రారంభించును. రానున్న యాపదలు మనస్సును టెలిఫోనుద్వారా ముందుగానే తమఛాయలను బాపుచుండుననుసామెత సార్థకమగుచున్నది. అతని హృదయ మెప్పుడును యట్లు కొట్టుకొనలేదు; టెలిఫోనును సమీపించి వార్తను వినును. ఇంకేమున్నది: పాప మాతనికి మాట రాదు: మనస్సు మనస్సులో లేదు; ముఖములో కాంతి తగ్గినది; జీవకళపోయినది; ఏమ్పుచు తనస్థానమునకు వచ్చి చొక్కా, టోపీలను ధరించుకొని గుండుదెబ్బ తిన్నవానివలె ఆఫీసునుండి వెడలిపోయెను; పైయధికారి సెలవునైనను యడుగలేదు; తనదగ్గరనున్న సేవకులతోనైన పలుకాడలేదు; తనబల్లమీద పడియున్న కాగితములనైన జాగ్రతచేయలేదు; తోడియుద్యోగస్థులు వెరగుపడి చూచుచుండిరి; వీధిలోనికి వరుగెత్తుటతోడనే యొకమోటారు వచ్చెను అచ్చట నొక టపాబంట్రోతు యాతని కొక యుత్తరము నిచ్చెను;

ఆయుత్తరములో నొకసంతోషకరమైన (ప్రపంచదృష్టిలో) వార్తయుండెను. ఆతనికొక గొప్పయాస్తి కలసెను. ఒకలాటరీలో 10,000 లభించెను. నిజముగా నీవార్త యతనిని యానందాబ్ధి నోలలాడించవలసినది. కాని, అది యట్లు చేయలేదు. టెలిఫోనులోని వార్త హృదయమును బ్రద్దలు

చేయుచుండగా నీవార్తలో యానందమెక్కడ! అతడు వే నొప్పయధికారిని చూడవలెనని నిశ్చయము కలలను గనుచుం డెనో యాతడే యతనిప్రక్క మోటారులో కూర్చుండెను. కాని, మన పెద్దమనిషి యతని కేసి చూడనైనను చూడక పె డమొగమును బెట్టి కూర్చుండెను. ఏస్నేహితురాలితో మాటా డినంతమాత్రమున తనజీవితము సార్థకమగునని యాత డను కొనుచుండెనో యామెకూడ వానిప్రక్కనేయుండెను. ఆపె ముఖకమలము సూర్యకాంతుల నీనుచున్నను యత డటు కన్నెత్తిచూడనైనను చూడలేదు; పలకరించలేదు. ఇట్లు తనవీథిదగ్గరకు వచ్చెను. అదంతయు భీభత్సధ్వనులతో నిండి యుండెను. దట్టమైనపొగలు ఆకసమున కెగసి సూర్యుని మరుగుపుచ్చుచుండెను; అగ్నిజ్వాలలు మిన్నంటుచుండెను. తనభార్య, తల్లి, అమ్మమ్మ మొదలయినవారందరును రొమ్ము లుబాదుకొనుచు యేడ్చుచుండుట నాతడు చూచెను. ఆదా వానలము తనగృహము నాహుతిచేయుచున్నది.

అప్పుడతని కింకను యనేకమంది స్నేహితులు కాన్పిం చిరి. కాని యొక్కటిమాత్రము కాన్పించుటలేదు. తనయా నందమునకు రాజధాని, 'ముద్దులగుమ్మ' 'బంగారుబొమ్మ' మాత్ర మక్కడలేకపోయెను. బిడ్డడెక్కడ ? బిడ్డడెక్కడ ? యని భార్యను, తల్లిని యందరిని యడిగెను. కాని ఏడ్చు వారు, పెడబొబ్బలుపెట్టువారేగాని సరియైన సమాధానము

రాలేదు. చివరకు నిజము తెలిసినది. బిడ్డను యింటిలోనుంచి యెవరికివారే మరచివచ్చిరి. దాయి బిడ్డనుయ్యాలలో జోకొట్టి యివతలకువచ్చెను. ఇంతలో కొంపలంటుకొనెను. ఎవరికివారే ప్రాణములకొరకు పరుగెత్తిరి. వీరిదగ్గర నున్నదని వారు వారి దగ్గరనున్నదని వీరు యూహించుకొని బిడ్డను విడిచివచ్చిరి. బిడ్డయున్న గది యిప్పుడే యంటుకొనవారంభించెను. వారందరును రొమ్ములు బాదుకొనుచుండిరి; ఏడ్చుచుండిరి; తిట్టుకొనుచుండిరి; నేలపడిదొర్లుచుండిరి. ఏమిలాభము! 'అయ్యలారా! మాబిడ్డను బ్రతికించుడు. మా భాగ్యమునంతను యిచ్చివేసెదము ఏమికావలసిన నదియే యిచ్చెదము! ఇకముందు పదేళ్ళవరకు మేముగడించు సంపాదనంతయు మీకిచ్చివేసెదము! మాబిడ్డను బ్రతికించుడు! అని యజమాని, భార్య, తల్లి, స్నేహితులు అందరును గోలపెట్టసాగిరి. బిడ్డకొరకు సర్వమును త్యజించిరి. ఏమిపోయినను సరే బిడ్డ బ్రతికిన చాలును. ముద్దులబిడ్డడే స్వర్గము. కాని నిజముగా యీబిడ్డడే యానందమునకుపుట్టినిల్లా? ఆనందసర్వస్వమా? లేక నది మరియొకచోట పుట్టుచున్నదా? సర్వమును శిశువుకొరకు త్యజించబడుచున్నది. ధనము నైశ్వర్యము, భాగ్యము, ఆశిశువుకొరకునిప్పులో దూకుటకు సాహసించువారి జీవితములు—ఇవన్నియు శిశువుకొరకు కాహుతిచేయబడుచున్నవి! కాని యీశిశువుమాత్రము మరియొక దానికొరకాహుతిచేయబడుట లేదా? అయినచో

నావస్తువే యానందమునకు నిజమైన జన్మస్థానము కావలెను; అది యేది? ఇన్ని 'తంతులు' జరిగినవి. కాని వారిలో నొక్కరును నిప్పులోనికి దూకలేదు. ఆత్మత్యాగమును చేయలేదు. ఆత్మకొఱకు శిశువును త్యాగముచేసిరి గాని శిశువుకొఱకు తమ్ము త్యాగముచేయజాలకపోయిరి, శిశువుకొఱక కన్నిటిని త్యజించిరి. తమకొఱకు శిశువును త్యజించిరి.

ఆనందములకెల్ల యానందమైన శిశువులో నిప్పుడా నందము లేదు. శిశువులో నంతయందచందములు, యానందము కలుగుటకు కారణ మేది? మన యాత్మనో నుద్భవించు యాత్మ భాస్కరప్రసాదము నది బడయుటే దీనికి కారణము కేవల శిశువే పరమానంద స్వరూపమైనయెడల నది శాశ్వతముగా నిలిచిపోవలసినది. అట్లుండుట లేదు. ఆభాస్కరుడు మనయాత్మలోనే యున్నాడు.

ఇక్కడ మన మానందనిలయమును సమీపించితిమి; దానికి కొంచెముదగ్గరగా జేరితిమి. కేవల శిశువుకొరకే మన కాత డంత ప్రియతముడుగా నుండుట లేదు! ఆత్మకొరకే యాతడు ప్రియతముడగుచున్నాడు. భార్యకొరకే మనము భార్యను ప్రేమించుట లేదు; భర్తకొరకే భర్తను ప్రేమించుట లేదు. ఆత్మకొరకే భార్య నంతగా ప్రేమించుచున్నాము. ఆత్మకొరకే భర్తపై నంతప్రేమ కలుగుచున్నది. ఇదియే పరమసత్యము. 'మేము దానిని ప్రేమించుచున్నాము, దీనిని

ప్రేమించుచున్నాము' అని ప్రజలు చెప్పుచుందురు. ఇది నిజముకాదు. ఆత్మకొరకే మనము భాగ్యమును కోరుదుము. కాని భాగ్యముకొరకేకాదు. ఒకప్పుడు 'ముద్దులమిఠారి' యైనభార్య భర్తకు ప్రయోజనములేనిచో 'విడాకు' లిచ్చివేయబడుచున్నది. ఒకప్పుడు 'నవమన్మథు'డైనభర్త భార్యకు నిష్ప్రయోజనమైనయెడల త్రోసివేయబడుచున్నాడు. ధనము నిరుపయోగమైనయెడల నదత్యజింపబడుచున్నది. నీరోచక్రవర్తియేమిచేసెను? ప్రపంచములోనికెల్ల నతిసుందరమైవరోమకపట్టణ మతనికి నిరర్థకము, నిష్ప్రయోజనముగా కాన్పించెను. దవానలమునినయతనికి బహుప్రీతి. అతడొకపర్వతశిఖరము నధిష్ఠించి రోమపట్టణమునంతయు నొక్కపారి యంటించుమని స్నేహితులకాజ్ఞాపించి యాదవానల వైభవము నతిసంతోషముతో చూరగొనెను. పట్టణమంతయు నాహాలు తియగుచుండ నతడు పిడేలువాయించుచుండెను.

నేనొక చిత్రచరిత్రను కండ్లారజూచితిని. ఒకప్పుడు గంగానది పొంగనారంభించి ప్రవాహ మంతకంతకు వృద్ధికాజొచ్చెను. ఒక చెట్టుకొమ్మలమీద చాలకోతులు కూర్చొనియుండెను. ఒక యాడకోతి తనపిల్లలతో పైకొమ్మలకెక్కి కూర్చొనెను. ప్రవాహమంతకంతకు హెచ్చి చెట్టంతయు మునిగి యాకోతిని సమీపించుచుండెను. పైకెక్కుటకిక కొమ్మలు లేవు. పిల్లలు తల్లినంటిపెట్టుకొనియుండెను.

నీరంతకంతకు హెచ్చుచుండెను. ఆతల్లి యొకపిల్లను కాలిక్రిం దపెట్టెను. ఇంకను నీరు హెచ్చుచుండెను. వరుసగా మరి యొకపిల్లను మూడవపిల్లనుకూడ నాకోతి నిర్దాక్షిణ్యముగా కాలిక్రంద త్రొక్కిపెట్టి యాత్మరక్షణ గావించుకొనెను. చూచితిరా! మనకుపయోగించినంతవరకే వస్తువులుగాని, మనుష్యులుగాని ప్రాణతుల్యులగుదురు. మన కనర్థము వాటి ల్లునేని వారినందరిని యాక్షణమే త్యజింతుము.

కనుక యానందనిలయము మనయాత్మలోనే యిమిడి యున్నది. అదియెక్కడనున్నది? మనశరీరమునంతను మోసి కొనుపోవు పాదములందున్నదా? లేదు. అట్లయిన కాళ్ళే మనకు ప్రపంచమంతటిలోను ప్రియతమములు కావలెను. బాహ్యవస్తువులకంటె ప్రియమైనవైనను నవి చేతులంత ప్రి యములుగావు. చేతులా యానందమునకు జన్మస్థానము? కండ్లా? ముక్కా? శరీరమంతయునా? కాదు. కాదు మాటి మాటికి మనశరీరము మారుచునే యున్నది. కొన్నియేండ్లలో శరీరములోని ప్రతియణువును నూతనయణువునకు స్థానము నిచ్చుచున్నది. బుద్ధి, మెదడు, మనస్సు—ఇవియా యానంద నిలయములు? ఇంతకన్న ప్రియమైనవి మనకున్నచో నివియె ట్లగును? ప్రాణమంత తీపైన వస్తు వేదైన కలదా? చనిపోవుట కొప్పుకొనెదమా లేక మతితప్పిన పిచ్చివానివలె జీవించుట కొప్పుకొనెదమా? యని యెవరినైనను యడిగి చూడుడు!

బుద్ధిని, మెదడును, మనస్సును అన్నిటిని తోసివేసి ప్రాణములను నిలుపుకొనుటయే యత డిచ్ఛపడును. అయితేయీ వ్యక్తి ప్రాణమే, జీవితమే యానందభాస్కరమా ? కాదు ! కాదని వేదాంతము ఘోషించుచున్నది. వ్యక్తియొక్క ప్రాణముకూడ యానందనిలయము కాదు. మనయానందస్థానము, మనస్వర్గము యింకను పైనున్నది. అదియెచ్చటనున్నది ?

ఒకయువకుడు చనిపోవుచుండగా రాముడు చూచెను. విషరోగముచే నత డపరిమితబాధ నొందుచుండెను. మొదట పాదములలో బాధ ప్రవేశించెను. అప్పుడంతగా బాధలేదు. కాని క్రమముగా బాధహెచ్చి శరీరము 'కొంకరలు' వోజొచ్చెను. బాధ మోకాళ్ళకు కడుపుకు యెగప్రాకి హృదయమునకు చేరుటతోడనే వాని ప్రాణముపోయెను. అతడు చనిపోవుచు 'అయ్యో! నన్ని జీవిత మెప్పుడు వీడునోగదా! నన్నిప్రాణము లెప్పుడు విడిచిపెట్టునోగదా!' యని విలపించును.

ఇక్కడ ప్రాణముకంటె యుత్కృష్టమైనదికూడ మన కొకటి కాన్పించుచున్నది. 'నాజీవితము,' 'నాప్రాణము' అనువస్తువు వాటికంటె పైనుండునది, వాటిని కలిగియుండునది మరొకటికలదు; ప్రాణముకంటె తీపైన వస్తువిదియే. ఈ ప్రాణములు, ఈజీవితము ఈవస్తువున కుపయోగము లేనప్పుడిది కూడ త్యజింపబడినవి. అన్నిటికంటెను తీపైన వస్తువు,

పరమానంద ధామ మిదియే. ఇదియే నీలోని నిజమైన యాత్మ. కాళ్ళకంటె చేతులు, వాటికంటె కండ్లు, వాటికంటె మనస్సు బుద్ధి, యంతకంటెను ప్రాణము యీవిధముగా నొకదాని కన్న నొకటి యివి నీనిజాత్మను సమీపించినకొలది యెక్కువ ప్రియతమములగుచుండును. ఈకారణముచేతనే యెక్కువ దానికొరకు తక్కువది త్యజింపబడుచున్నది. ఆత్మకొరకన్ని యు త్యజింపబడుచున్నవి. పొరుగువారి బిడ్డకంటె తనబిడ్డయే ప్రతివానికిని యెక్కుడు రమ్యముగా నుండుటకు కారణ మేమి? 'నాయొక్క పిల్లవాడు' అని నీ వెవ్వరిని పిలుచుచు న్నావో వానిని నీవు నీనిజాత్మయను బంగారముతో పూత పెట్టితివి; కనుక నీకంత ప్రియముగా నున్నాడని వేదాంతము చెప్పుచున్నది. నీవు వ్రాసిన పంక్తియొక్కటి యున్న పుస్తకము ప్లేటోమహాశయుని గ్రంథముకంటెకూడ నీకు మిన్నగా కాన్పించును. ఎందుచేత? నాపుస్తకము అని నీవు పిలుచు దానితో నీయాత్మ ప్రకాశించుచున్నది. నీయందున్న స్వర్గము దానిలో ప్రకాశించుచున్నది. నీస్వర్గము నీయానందధామ ము నీలోనే యున్నది. అహా! ఆనందముకొరకు మరియొక చోట వెతుకుట యెంత యన్యాయము!

ఒకప్రియుడు తనప్రియురాలికొరకు శుష్కించు చుండెను. వానిశరీర మస్థిపంజరమై మాంసమంతయు హ రించెను. ఒకనాడు రాజుగారి దర్బారున కాతడుతీసికొని

రాబడెను. ఆతనిప్రియురాలుకూడ వచ్చెను. రాజామెయం దవికారరూపమును జూచి యనేకమంది యప్సరసలను తెప్పించి వానిని వీరిలో నీయిష్టవచ్చినవారిని వరించుమనెను. "రాజా! రాజా! ఇంతమూర్ఖుడవు గాకుము! ప్రేమ మనుష్యుల సంధులను జేయును. రాజా! నీకు చూచుటకు కండ్లు లేవు! ఈకండ్లతో నాప్రియసిని చూడుము. అప్పుడామె యవికారముగనుండునో యందముగానుండునో నాతో చెప్పుము" అని యతడు చెప్పెను. ఈప్రపంచములోని మోహములకిదియే రహస్యము. నీవే నీదృష్టిచేతనే ప్రపంచములోని వస్తువులన్నిటిని రమణీయములుగా, మనోహరములుగా చేసికొనుచున్నావు. నీకళ్ళతో దానినిచూచి నీతేజస్సునే దానిపై బరపి దానిని మోహించుచున్నావు. గ్రీషియను పురాణములో ఎకోయను నామె తనప్రతిబింబమునే వరించును. మనమోహములన్నియు నట్టివే! అవన్నియు మనయాత్మప్రతిబింబములే; మనలోని స్వర్గప్రతిబింబములే; మనఛాయలే. ఆహా! మననీడకొరకు మనము పరుగెత్తుటెంత యన్యాయము?

ఒకశిశువు అప్పుడే పాకుటకు మొదలుపెట్టెను. దాని నీడ నాశిశువుచూచి యది వింతవస్తువని భ్రమించి దానితలను పట్టుకొనుటకు నీడకేసి ప్రాకెను. నీడకూడ ప్రాకుటమొదలిడెను. శిశువు వెళ్ళినకొలది నీడకూడ ప్రాకుచుండెను.

పిల్లనీడ దొరకకుండున వేడిడిచి గడిపోయెను. నీడకూడ దాని ననుసరించెను. పిల్లలేచి మరలనీడకొరకు ప్రాకుచుండెను. కాని యది దొరకుట లేదు. ఇంతలో తల్లివచ్చి దయదలచి పిల్లనెత్తి మీద చెయిపెట్టించెను. ఆనీడయొక్క తలకూడ, పట్టుబడెను. నీతలను పట్టుకొంటివేని నీనీడనుకూడ పట్టుకొందువు. స్వర్గ నరకములు రెండును నీలోనేయున్నవి. ఆనందము, శక్తి, జీవిత ము, పీటిజన్మస్థానములు నీయందేకలవు. ప్రకృతియొక్కయు మనుష్యులయొక్కయు జాతులయొక్కయు భగవంతుడు నీ యందేయున్నాడు. ఓ ప్రపంచవాసులారా ! దీనివాలకిం పుడు ! దీనివాలకింపుడు! ఈపాఠము సౌధాగ్రములనుండి ప్రతిపట్టణవీధులలోను, రహదారీలలోను చాటించవలసియు న్నది. నీ కేదేని కావలసినయెడల దానినీడకొరకు ప్రాకు లాడకుము ! నీలోనికే పొమ్ము ! నీయాత్మను దర్శించుము! దీనిని నీవు గుర్తించితివేని యీప్రపంచములోని మోహము లన్నియు, సౌందర్యమంతయు, రమణీయవస్తుజాలమంతయు, నక్షత్రాదిగ్రహములుకూడ నీప్రతిబింబము లే! నీ నీడ లేయని నీవు గుర్తెరుంగగలవు. అయ్యో ! ఎంతయజ్ఞానము ! గాలిలో కలియు స్తోత్రపాఠములకొరకా జీవితముల నమ్ముకొనుట ! పుష్పములనమ్మిట కట్టెలను కొనుటకా ! ఆత్మ నర్పించి క్షణ భంగురములగు బుద్బుదములనా యార్జించుట.

ఒకముదుసలి సూదెను తనయింటిలో జారవిడిచి వీధిలో వెతుక నారంభించెను. ఒకపెద్దమనిషి నీవు దేనికొరకట్లాతురముతో వెతుకుచున్నావని యామె నడిగెను. నా సూదెకొరకని యామె చెప్పగా నీవు దాని నెక్కడపోగొట్టుకొంటివని యాత డడిగెను. నాయింట పడిపోయినది. దీపమును వెలిగించుకొనజాలని పేదను కనుక దానికొరకు వీధిలో వెతుకుచున్నానని యామెచెప్పెను ఇంటపోయిన దానికి వీధిలో వెతుకుటయట! ఎక్కడనో వెతుకవలెను గదా! కనుక వీధిలో నెందుకు వెతుకకూడదు.

సరిగా దీనినే మన మాచరించుచున్నాము! స్వర్గధామము నీయందే యున్నది. ఆనందనిధి నీయందే యున్నది. వైకుంఠము నీయందే యున్నది. కాని దానికొరకు వీధుల లోని వసువుల నాసించుచున్నావు! దానికొరకు విషయాన్వేషణముతో ప్రొద్దుబుచ్చుచున్నావు! ఇదియే జ్ఞానమనుకొనుచున్నావు!

ఒకపట్టణములోని నగరాధ్యక్షుడు రాజవైభవముతో నొకవిందును జేయుచున్నాడని యొకపిచ్చివాడు పట్టణమంతయు తిరిగి బాలురనందరను యాహ్వానించెను. అందరును వెళ్ళిరి. కాని విందేమియు జరుగలేదు. పిల్లలందరును తెల్లబోయి నవ్వుకొనుచుండిరి. ఈగమత్తంతయు నసత్యమని తెలిసియుకూడ నీవేల వచ్చితివని వారాపిచ్చివాని నడిగిరి.

వమో ! ఇదంతయు నిజమయినయెడల యీవిందును నే నేల పోగొట్టుకొనవలెనని వచ్చితినని యాత డనెను.

ఈ ప్రపంచములోని వస్తువుల నన్నిటిని తమయూహాప్రపంచముచేతను, యాశీర్వచనముల చేతను స్వర్గోపములుగా చేసికొని మనకథలోని పిచ్చివానివలె మోసపోవుచున్నారము.

నీలోని స్వర్గమును గుర్తించుము. సర్వమును, అన్నికోరికలును, యీడేరగలవు. అన్ని బాధలును, అన్ని దుఃఖములును యుపశమించును.

మానవభ్రాతృత్వము.

మానవులందరును సోదరులు ! మానవలోకములో యేకత్వముగాని భిన్నత్వము లేదు ! ప్రతివాడును, అందరును ఒకటే ! ఒకటే ! అందరును సోదరులే ! ఒక్కసారి మీమనస్సుల నీభ్రాతృ భావముపై కేంద్రీకరించుడు ! ఇది మెట్టవేదాంతముగాదు ! శ్రీరంగనీతి కాదు ! ఇది యనుభవైకవేద్యమైన విషయము ! బ్రహ్మానందము నొసగూర్చు విషయము ! ఆహా ! ఈ ప్రపంచవాసు లందరును నాయాత్మయే ! నేనే ! అని మనము భావించునపుడు కలుగుసంతోష మపరిమితముకదా ! ఆగర్భశ్రీమంతులైన మహాదైశ్వర్యవంతకుమారులును, శేముషీధురీణులును- వీరందరును నేనే! యనుకొనుటలో నెంతయానందము కలదు ! ఇట్లు భావించుము ; మననము చేయుము. ఇట్టిసాధన యద్భుతఫలితముల నిచ్చును. ఈ శరీరము

నీదియని నీ వనుకొనుచున్నట్లే ఈ యన్నిశరీరములును నీవే యని భావించి యీ తత్త్వమును గ్రహించుట మొదలిడితివేని నాదియని నీ వనుకొను శరీరము నీయాజ్ఞలను, నీకోరికలను నెల్లు శిరసావహించునో, నీచేతులు, నీకాళ్ళు మొదలైన సర్వావయవములును నీకోరికల ప్రకార మెల్లునడుచునో యట్లే నీమనస్సును, నీశక్తులను యీ యేకతత్త్వముపై కేం ద్రీకరించితివేని యీ ప్రపంచములోని శరీరములన్నియుకూడ నీకోరికలప్రకారమేనడుచును; ప్రవర్తించును. ఇది యనుభ వముచే గ్రహింపదగిన పరమసత్యము. దీనిని ప్రతివాడును యనుభవముచే పరీక్షింపవచ్చును రుచిచూడవచ్చును; ఇది శుష్కవాదము కాదు; ఆకాశసౌధము కాదు. నీశరీర మెంత సత్యమైన విషయమని నీవనుకొనుచున్నావో యిదియు నంత సత్యమే. ఇది పరమసత్యమేయైనను నాదముకొరకిదియసం భవమని యొప్పుకొనినను కూడ నీయేకత్వమును గ్రహించు టవలన యొక సద్యఃఫలితమును నీవనుభవించెదవు. ఐశ్వర్య ముకొరకు, ధనముకొరకు ప్రజలు విచారించెదరు; క్లేశప డెదరు. వారికి తోటలు కావలెను; మేడలు కావలెను. భూములు మొదలైనవి తమవని యనిపించుకొనవలెను. ఎంతవిచారకరమైన యాలోచన! ధనవంతుల తోటలలో నికి లేక పబ్లికుతోటలలోనికి పోయి గంటలకొలది కూర్చొ ని యాతోటగల ధనికు లెంతగా యానందింతురో యంత

గానే మనమును యానందించకూడదా? తనదని యనుకొను యజమాని యాతోటలలోని పుష్పములను, ఫలములను నా లుగుకండ్లతో చూచునా? వాడుమాత్రము వాటన్నిటిని రెండుకండ్లతో జూచుట లేదా? ఆతోటలలోని పికధ్వను లను, శకుంతగానములను మీవలె రెండుచెవులతో మాత్రమేకదా వాడును వినునది! అట్లయిన నాతోటను కలిగి యుండవలెనననుకొనుటెందుకు? మీ కేలయుండవలెను? ప్రపంచములోని తోటలన్నియును, శరీరములన్నియును నీవేయని భావించుము; గ్రహించుము. అన్ని యమోఘ శక్తులును, అన్ని కుశాగ్రమనోబుద్ధులును నీవే! ఇట్లు మననముచేయుము. ఇట్లు భావించుచుండుము. ఈభావ మెంతమాత్రమును యస్వాభావికముగాదు, జీవితములో యుత్తమాదర్శములను గ్రహించుటకు నీ విన్నియో సుగు ణములను సాధించనక్కర లేదా? అవన్నియును నీకు ప్రయో జనముకే కాని అన్నిశరీరములును నీవే, అందరును ఒకటేయను పరమసత్యమును గ్రహించుట యన్నిటికంటెను శ్రేయస్కరము. అన్నిశరీరములును నీవే! అందరును ఒకటే! దీనిని బాగుగా భావనచేయుము భావనచేయుము!

రష్యా చక్రవర్తిగాని, ఆంగ్ల సార్వభౌముడుగాని, వీధులలో మిన్నంటునట్లు స్తుతింపబడుచు బోవునపుడు వారినిచూచి యసూయపడకుము; కించిత్తైనను భయప

డకును. ఆ రాజదర్జాయంతయు నీదైనట్లు యనుభవించుము! "నేను దానినే, మరేమియునుగాను" ఇట్లు నీవు భావించుట మొదలుపెట్టినచో నీయనుభవమే అందరును ఒక్కటేయనుసంగతిసి నీకు హృద్గతము చేయగలదు. ప్రతిశరీరము, నీకండ్లు, నీకాళ్ళు, నీచెవులు యగును. నీశరీరమే యగును. మానవులందరును సోదరులు! తర్కము దీనిని రుజువు చేయుకపోవచ్చును. శాస్త్రము దీనిని రుజువుచేయుకపో వచ్చును. వేదాంతము దీనిని రుజువుచేయకపోవచ్చును. కాని యిది సత్యము; అనుభవైకవేద్యమైన విషయము. దీనినియనుభవము రుజువుచేయగలదు.

నేను కొన్ని తార్కాణములను మీకు చూపించెదను. మానవభ్రాతృత్వము అను పదముకూడ సరియైనదికాదు. విశ్వైకమానవభ్రాతృత్వము. ఇదికూడ సరియైనదికాదు. భ్రాత యనుటతోడనే కొంతభిన్నత్వము ధ్వనించుచున్నది. భ్రాతలుకూడ తమలోతాము కలహించుచుందురు. ఇక్కడ భిన్నత్వమున కెంతమాత్రమును యాస్పదమే లేదు. ఏకత్వము, విశ్వమానవైకత్వము. ఇవియే సరియైన పదము.

కంటికి కాన్పించని యాత్మనుగురించి మాకు మెట్టపంచాంగములను చెప్పకుడు అని మీరనవచ్చును. నేను దానినిగురించి మీకు చెప్పబోను. అక్కడ మనమందరమును నొక్కటే! ఆత్మలన్నియు నొక్కటే యని యొప్పుకొనితీర

వలెను. స్థూలమైన శరీరమునుగూర్చియే యాలోచింతము. శరీరములుకూడ మనమందరమును యొక్కటేయని చెప్పుచున్నవి. మనస్సులుకూడ మనమందరము యొకటేయని చెప్పుచున్నవి. భావములలోగూడ మనమందరమును యొకటేయని యాధునికశాస్త్రములు రుజువుచేయుచున్నవి. శారీర, మానసిక, భావావేశరంగములలోకూడ మనమందరమును ఒకటే. మీ నిత్యజీవితములలో మీరీయేకత్వసిద్ధాంతముపై జీవించరేని మీరు పరమసత్యమునకు విరుద్ధముగా ప్రవర్తించుచున్నారనుట నిశ్చయము. న్యాయవిరుద్ధముగా నడుచుచో మనము శిక్షింపబడుచున్నారము. అట్లే యీభ్రాతృత్వమునకు, యీయేకత్వమునకు విరుద్ధముగా నడుచుటచేతనే ప్రపంచములోని దౌర్భాగ్యము, బాధ, క్లేశము, దుఃఖము మొదలగునవన్నియు జనించుచున్నవి.

మీశరీరములన్నియు నొకటే! ఇది యెట్లగును? ఈశరీరమిక్కడనున్నది. ఆశరీరమక్కడనున్నది. రెండును ఒకటియెట్లగును? సముద్రములో నొకకెరటము యిచ్చట మరొకకెరటము మరియొకచోట కాన్పించును. అవి వేరు వేరుస్థలములలో నున్నట్లు కాన్పించును. ఒకటి పెద్దది ఒకటి చిన్నదిగా కాన్పించవచ్చును. కాని ఆరెండును ఒకే నీటిలో పుట్టుచుండుటచే రెండును ఒకటే ఈకెరటములలో మనకు కాన్పించునది యొకేసముద్రము. ఈ కెరటములలో యిప్పు

డున్ననీరు మరికొంచెము సేపటికి మరియొక కెరటములో నుం డవచ్చును. మనశరీరములుకూడ యీకెరటములవంటివే. ఇప్పు డీశరీరములోనున్న పదార్థమే మరికొంచెముసేపటికి మరియొక శరీరమగుచున్నది ఇంతేకాదు. ఇప్పుడు మీరు రామునిశరీర మని పిలుచుచున్న యీశరీరములోని ప్రతియ ణువుకూడ యీజీవితములోనే మరియొకశరీరమగుచున్నది. ఉచ్ఛ్వాసనిశ్వాసములు దీనిని రుజువుచేయుచున్నవి. మన ము గాలిలోని ప్రాణవాయువును (Oxygen) పీల్చి విషవా యువును (carbon dioxide) విడుచుచున్నాము. ఈవిషవా యువును చెట్లు పీల్చి ప్రాణవాయువును విడిచివేయుచున్నవి. ఆప్రాణవాయువునే మనము మరలపీల్చి విషవాయువును విడు చుచున్నాము. దీనిని మరల చెట్లు పీల్చుచున్నవి. ఇట్లు మన ము చెట్లునుకూడ సోదరులమే యగుచున్నాము. అవి మనకు ప్రాణము నిచ్చుచున్నవి. మనము వాటికి ప్రాణము నిచ్చు చున్నాము.

ఇంతేకాదు. నీవు గాలిలోని ప్రాణవాయువును పీల్చి దానిని విషవాయువుగా మార్చితివి. దానిని చెట్లుపీల్చి ప్రాణ వాయువుగా మార్చుచున్నవి. ఆప్రాణవాయువునే మరియొ కడు పీల్చుచున్నాడు. ఇంతకుమునుపు నీయూపిరితిత్తులలో నున్న గాలి మరికొంచెముసేపటి కింకొకని యూపిరితిత్తులలో ప్రవేశించుచున్నది. మనమందరమును ఒకేగాలిని పీల్చుచు

న్నాము. కనుక మనము పీల్చు గాలికి సంబంధించినంతవరకు మనశరీరము లొకటేయని తేలినది. మనమందరమును ఒకే భూమిమీద నివసించుచుండుటచే నొకేసూర్యచంద్రవాతావరణములచే మన మావరింపబడియున్నాము. మనము శాకములు, ఫలములు, మాంసాదులు మొదలగునవి తినుచున్నాము. అవి కొంతవరకు మనశరీరము లగుచున్నవి. కొంత మలరూపమునపోయి తిరిగి ఫలములు, శాకములు మొదలగునవి యగుచున్నది. ఇవి తిరుగ మరియొకని కాహారమగుచున్నవి. మనము విసర్జించినదే మరియొకనిశరీరములో ప్రవేశించుచున్నది. ఇట్లు మనపదార్థమే కొంచెముసేపులో మరియొకరి దగుచున్నది. మీశరీరములను భూతద్దములతో చూచెదరేని యతిసూక్ష్మమైన జీవములు పైకివచ్చునట్లు మీకు కాన్పించును. అట్లే మీశరీరములలోనికికూడ పోవుచుండు సూక్ష్మజీవులును కాన్పించును. ఇక్కడ నిరంతరము నీనుంచి బాహ్యమునకును బాహ్యమునుండి నీలోనికిని జీవప్రచారము జరుగుచున్నది. ఇప్పుడు నీలోనున్న జీవములు మరికొంచెముసేపటికి మరియొకనిలో ప్రవేశించుచున్నవి. మీశరీరములన్నియు నొకటేయని పదార్థశాస్త్రము చెప్పుచున్నది. ఈజీవప్రచారమెట్లు జరుగుచున్నది? నీలోని సూక్ష్మజీవులు మరియొకనిలోనికెట్లు ప్రవేశించుచున్నవని సందేహము తోచవచ్చును. చూడుము: వాసన యెట్లుకలుగుచున్నది? మనము వాసనచూచు

వస్తువులనుండి సూక్ష్మజీవులు బయలుదేరివచ్చును. పుష్పములు సువాసన వేయుటకు కారణము వానినుండివచ్చు సూక్ష్మజీవులే యని యూరోపుదేశశాస్త్రజ్ఞులు ఋజువుచేయుచున్నారు. ఇక్కడ యింతమంది శరీరములను చూచుచున్నాము. అవి వాసన వేయుటలేదా? అవి వాసన వేయుచునే యున్నవి. మానవశరీరములు యిట్లే వాసన వేయును. కుక్కలు మనలను సులభముగా పసికట్టును. మనశరీరములనుండి సూక్ష్మజీవులు పైకివచ్చుచుండుటను గనుకనే కుక్కలు మనలను పసికట్టగలవు. అనగా మనశరీరములలోనుండి సూక్ష్మజీవులు యితరుల శరీరములలోనికిని వారిశరీరములలోనుండి మనశరీరములలోనికిని యెప్పుడును వచ్చుచు పోవుచున్నవి. ఇక్కడ మనయందరమును ఒకటేకదా! మనమొకేశరీరమును కలిగియున్నాము. అన్నివాసనలే యనుభవించుము; భావించుము. ఒకడు జ్వరముతో బాధపడుచుండును. వాని గదియంతయు జ్వరపువాసన వేయును. ఒకడు కలరా, మశూచి, ప్లేగు మొదలగునంటువ్యాధులచే బాధపడును. ఆరోగము చుట్టుపట్లవారలకు కూడ ప్రసరించును. దీని యర్థమేమి? ఆశరీరమునుండివచ్చు జీవరాసులు మనశరీరములలో ప్రవేశించును. తోడనే ఆరోగములు మనకు వచ్చును. ఒకనికి రొంపపట్టును; వాని దగ్గరనున్న వానికికూడ రొంప ప్రారంభించును. ఒకడు క్షయతో బాధపడుచో వానిదగ్గరనున్నవానికి కూడ క్షయ సంభవిం

చును. ఆత్మసంగతి యటుండ శారీరకముగా విూ రందరును నొక టేయని యిదంతయును రుజువుచేయుట లేదా ? ఇక్కడ విూ రొకవిషయమును జ్ఞాపకముంచుకొనవలెను. ఒకడు రోగియైనచో దాని కతడే బాధ్యుడు. అతని యజ్ఞానమే దానికి కారణము. అతడు తత్ఫలితముగా తానే బాధపడుచున్నను ప్రపంచమున కంతకును కూడ యత డుత్తరవాది యగుచున్నాడు. అతడు తన జ్వరకీటకములను ప్రపంచమంతకును పంపుచున్నాడు. నేను రోగినగుటకు నా కెంతమాత్రమును హక్కు లేదు. నేను బాధపడు టేకాక నేను దీనికి ప్రపంచమున కంతకును బాధ్యుడ నగుచున్నాను. కనుక ప్రతివాడును తనశరీరము విషయమై తగినంతశ్రద్ధను తీసికొనవలెను. రోగము శారీరకమేగాక నైతికముకూడ యగుచున్నది. కనుక యారోగ్యమును, బలమును చేకూర్చుకొనుటకు నీ విధాయుకకృత్యము. నీ వేదైనను తినునపుడును త్రాగునపుడును ప్రపంచకళ్యాణమునకు నీవు బాధ్యుడ వనుసంగతిని జ్ఞాపక ముంచుకొనవలెను. అమితముగా త్రాగుట, తినుట యెంతమాత్రము కూడదు.

ఇక నారోగ్యవంతులు రోగులవిషయమై యెట్లుప్రవర్తించవలెను ? వారికి సేవజేసి వారిని నిరోగులను జేయవలెను. ఇది వారి నుద్ధరించుటగాదు. వారికి మేలుచేయుటగాదు. మానవలోకముకొరకు, సత్యముకొరకు, నీకొరకు, ప్రపంచముకొరకు నీ వనారోగ్యవంతులకు సేవచేయవలెను.

చూచితిరా! వేరువేరుగా యున్నవనుకొన్న మనశరీరము లెట్లు నొకదానివలన నొకటి బాధపడుచున్నవో! సమానాస్థిమాంసములచే పవిత్రబంధనములు గలిగిన మానవులందరును శారీరకముగా నొకటే! ప్రతియేడువత్సరములకును శరీరతత్త్వమంతయు పూర్తిగామారిపోవునని వైద్యులు రుజువుచేయుచున్నారు. ప్రతియణువును నూతనయణువునకు స్థానము నిచ్చుచున్నది. అట్టి నిరంతరపరివర్తనము నొందు యణువులు నీవియని యనుకొనుటకు నీ కెట్టిహక్కు కలదు? ఈశరీరము నాదని నే నెట్లుచెప్పుకొనగలను? ఏడువత్సరముల క్రిందట నాదైన శరీర మిప్పు డెవరిదోకదా! పదునాలుగేండ్లక్రిందట నాదైన శరీర మిప్పుడు దేని నలంకరించుచున్నది? అనేకమందిని. కనుక నీ దనుకొను నీశరీర మందరిదని యని గుర్తించుము. ఇట్లెప్పుడును భావించుచుండుము. శారీరకముగాకూడ మనమందరమునొకటే! ఒకటే! ఇక మానసికక్షేత్రమును చూడుడు. నీ శిరోజములు పెరుగుచున్నవి; రక్తనాళములగుండ రక్తము ప్రవహించుచున్నది. ఇట్లు వాటికి పోషణనిచ్చుచున్నశక్తియేది? నీశిరోజములను, నీరక్తనాళములలోనిరక్తమును పోషించు శక్తియేకదా నీసోదరులకును మనందరకును ప్రాణాధారమైనశక్తి! నీజీర్ణకోశములోనుండి నీయన్నమును జీర్ణింపజేయు శక్తియేకదా యితరులకుకూడ పోషణనిచ్చుచున్నది! ఈసత్యమును నొక్కసారి బిగామునోఫలకమున

చిత్రించుకొనుడు! ఈశక్తిని భావనచేయుడు! ఆహా! ఏమిచిత్ర
ము! నే నెవరను? ఈ యన్నిపనులను చేయుశక్తిని నేనేగానా?
నేనే యాశక్తినైనచో నాకు భిన్నత్వమున కాస్పద మెక్కడ?
అన్నిశరీరములలోను నే నొక్కడనుగా నే యున్నాను. ఈ య
న్నిశరీరములను నియమించి పాలించుచున్న పరమశక్తిని; అవి
నాశి యగు పరమశక్తిని; అనిర్వాచ్యమగు పరమశక్తిని, యభి
న్నమగు పరమశక్తిని నేనే! నేనే! దీనిని గ్రహించుడు! దీనిని
భావించుడు' ఇక్కడకూడ మనమందరమును ఒకటే! భిన్న
త్వము లేదు! భిన్నత్వము లేదు! నీదని నీవనుకొనుచున్న శరీర
మాకలిచే శోషించునపుడు నీ వేల దుఃఖించెదవు? పూర్తిగా
తిండియున్న శరీరములన్నియుగూడ నీవే కావా? నీదని నీవ
నుకొనుచున్న శరీరము రోగభూయిష్ఠమగునేని నీ వేల విచా
రించెదవు? ఆరోగ్యసంపద్వంతమైన శరీరములన్నియు నీవే!
దీనిని గ్రహించుడు! ఈ సత్యమును జీర్ణింపజేసికొనుడు! ఇత
రులయెడల నీధర్మమేది? నీ వెట్లు వారిని చూడవలెను? వారు
రోగులైనపుడు నీవు నీశరీరవ్రణములకెట్లు చికిత్సచేసికొందు
వో యట్లే వారికిని చేయుము. నీ యితరులనుగూర్చి యోజిం
చుచుండవలెను. సుఖదుఃఖములలోను కష్టనష్టములలోను
వారి ననునయించవలెను. వారి నుద్ధరించవలెను. ఇక నీస్వ
విషయమై నీ వెట్టిసంకటములలోనైనను సంతోషానందము
లతో పొంగుచుండవలెను. ఎట్టిక్లేశమును యెట్టిమనోవ్యథను

నీదరికి రానీయకుము. వా టన్నిటికిని యీశ్వర వేరువృకమ్ము. సదాయానందాబ్ధినోలలాడుచుండుము. ఇక భావప్రపంచము లోఁగూడ మనమందరమును నొకటే యగుచున్నారము. ఇది సత్యము. ఈసత్యము నవగతముచేసికొనుడు. ఇక్కడ నొకవీణయున్న దనుకొనుడు. దాని మీటల నన్నిటిని సరిజేసి వాయించుటకు తగినస్థితిలో నుంచుడు. దానికెదురుగా మరియొకవీణ నట్లే యమర్చియుంచుడు. మీరొకవీణమీఁద నొకస్వరమును వాయింతురేని రెండవవీణకూడ నదేస్వరమును పలుక నారంభించును. ఒకవీణమీఁదతీగెను వాయింతురేని రెండవవీణమీఁదకూడ నదేతీగ పలుక నారంభించును. దీనికి కారణమేమి? ఒకవీణనుండి బయలుదేరిన గానతరంగముతో రెండవవీణ పరిసరములలోను యుండుటే దీనికి కారణము. నీ వొకసంగతినిగూర్చి యాలోచించుచుండుము. నీయిరుగుపొరుగువారి కది వెంటనే పొడకట్టును. నాటకములలో నటకులనేకభావములను ప్రదర్శించుచుందురు. వారి భావములన్నియు యథార్థములుగావు. వా రొకప్రక్కను విచారించుచుందురు. మరియొకప్రక్కను నవ్వుచుందురు. అయినను గొప్ప నటకుడు విచారమును ప్రదర్శించుచో సభారంగమంతయు విచారముతో మునిగిపోవును. దీనికి కారణమేమి? మనస్సు అను ఒకవీణ విచారించుటతోడనే తదితరమనస్సులును విచారించును. ఆభావమే యిచ్చటను యుద్రేకించును. మనందరి

మనఃప్రవృత్తులును, భావములును, భ్రాతృత్వసంబంధమును కలిగియుండనిచో నిదియసంభవము, అసాధ్యము. సముద్రకెరటములవలె మనమనోతరంగములును నొకే సముద్రమునుండి యుద్భవించుచున్నవి. ఒకవస్తువు మరియొకవస్తువుమీాద ప్రయోగింపబడినపుడా రెంటికిని యవిచ్ఛిన్నసంబంధ మేర్పడు చున్నదని పదార్థశాస్త్రము చెప్పుచున్నది. ఇక్కడీబల్లయున్నది. దీని నొక్కమూాల మీారు కదిపినచో బల్లంతయు కదలుచున్నది. ఇక్కడ ప్రతియణువునకును సంబంధముండుటచే యీచాలనము బల్లకంతకును కలుగుచున్నది. ప్రతిశక్తియు యీావిధముగా యవిచ్ఛిన్నముగానే సాగుచుండును; సాగవలెను. శక్తికి, కారణములున్నగాని, విఘ్న మెంతమాత్రమును యుండనేరదు. ఇక్కడ యొకని భావములు మరియొకనిలో ప్రవేశించుచున్నవి. ఒకరిహృదయము మరియొకనికి హృదయముతో యవినాభావసంబంధమును కలిగియుండనిచో నిది యసాధ్యము. కనుక వాటికి యవిచ్ఛిన్నసంబంధమున్నది. ఇది పరమసత్యము. మనభావములును మనయాలోచనలును ఒకరినుండి యొకరిలోనికి ప్రచారము చేయుచుండుటచే యేకశరీరమువలె మనమనస్సు లన్నియు యవినాభావసంబంధమును కలిగియున్నట్లు ఋజువగుట లేదా? మనయాలోచనలలోను భావములలోను యేకత్వమున్నది. ఒకడు నవ్వుచో అందరును నవ్వుచుందురు. రాముడు నవ్వినపుడు మీారందరును నవ్వుట

లేదా? ఒకఁడు యేడ్చుచో నందరిహృదయములును కరుగుచుండును; నీరగుచుండును. ఒకఁడు పాడుచో నందరును రాగములను తీయుచుందురు; తలల నూపుచుందురు; తాళములను వేయుచుందురు. మీభావములన్నియు మీమనస్సులన్నియు నొక్కటిగానిచో నిదెట్లుసంభవమగును? ఇదిగాక మన మెట్లు విద్య నభ్యసించుచున్నాము? గురువులనుండి స్నేహితులనుండి యితరులనుండి మనము విద్యనభ్యసింతుము. గురువునకు శిష్యులకు నొకేమనస్సు లేకపోయినచో నతఁడు విద్యనెట్లు చెప్పగలఁడు? శిష్యు డెట్లభ్యసించగలఁడు? వారిమనస్సులో నేకత్వ ముండవలెను. ఇచ్చట నొక మనస్సు మరియొకమనస్సుతో ప్రత్యక్షసంబంధమును కలిగియున్నది. గురువుగారిజ్ఞానమే శిష్యునిజ్ఞానమగుచున్నది; వారి మనస్సులు రెండును నొకటేగానిచో నిదెట్లుసంభవమగును. మరియొక యనుభవమును నీవు నీజీవితములో చూడఁగలవు. నీవొక స్నేహితుని ప్రేమింతువేని, యతనియెడల నాదరభావమును కలిగి యతని బుద్ధివైశద్యమును మెచ్చుకొనుచు యతనిని భావమునందుంచుకొందువేని యనేక వేలమైళ్ళదూరములో నున్నను, యతఁడును నీపై నట్టిభావములనే కలిగియుండుటను నీవు చూచియుండలేవా? రాము డీసత్యమును పరీక్షించినాఁడు. అతని కింకను యిది నిత్యానుభవమే!

ఈప్రపంచములో దోషులును, అపరాధులును యెట్లుత్పత్తియగుచున్నారో నీవెరుగుదువా? ఒకడు వచ్చి నీ కపకారమును చేయును. అతడు నీకంటె బలవంతుడు. నీవతనికి ప్రత్యపకారమును చేయజాలవు. కాని యాతనిపై నీకు కోపముండును; ద్వేషముండును. ఆ బలముగల నీశత్రువే మరియొకసాధువున కపకారమును చేయును. సాధువును నీవలెనే యేమియును చేయజాలక తన క్రోధద్వేషభావములను మాత్రము వానిపై బరపుచుండును ఆదండనీయు మరియొక బీదవానిపైగూడ నిట్లే దూకును. అతడును దుర్బలుడగుటచే తనక్రోధమును లోలోన నిగ్రహించుచుండును. ఇట్లా బలోన్మత్తుడనేకుల కపకారమును చేయుచుండును. అనేకుల క్రోధానలమును, ద్వేషానలమును మూటగట్టుకొనుచుండును. చివరకతనికంటె బలవంతు డొకడతనికి తటస్థమగును. ఇతడతనికి పైచేయియగును. ఇతనికి కొద్దిమాత్రమపకారము జరుగుటతోడనే యాతనిపై పెనుచిచ్చువలెమండి యాతనిని హతమార్చును. తనకు జరిగిన పరాభవమునకంత దండనయావశ్యకమాయను సంగతి యాతని కక్కరలేదు. మొదటిదోషి చంపబడుటతోడనే రెండవవానిని పోలీసువారు పట్టుకొని మేజిస్ట్రేటువద్ద కేసుపెట్టుదురు. మేజిస్ట్రేటుగారు విచారణ ప్రారంభింతురు; సాక్షులు, వాఙ్మూలములు, రాద్ధాంత సిద్ధాంతములు యెన్నియోజరుగును. మేజిస్ట్రేటువా

రంత స్వల్పయపరాధమున కింతకఠినదండనయా! యని తెల్ల బోవును! వార్తాపత్రికలన్నియు సగ్గోలుపెట్టును. ఇతడొక ముక్కోపి! మహాపరాధి! చిన్నతప్పునకు ప్రాణము తీసివేసినాడు!

ఎంతదురన్యాయము! ఎంతదుర్మార్గము! ఎంతకా్రరము! ఇట్టి కేసులను మీరు నిత్యమును చూచుటలేదా? కాని వార్తాపత్రికలును, మేజిస్ట్రేటులును యింత చిన్నతప్పునకు గొప్పదుర్మార్గ మేలజరుగవలెనో చెప్పజాలరు. ఇంతక్రోధావల మేలప్రజ్వరిల్లెనో యెరుగరు! కాని, వేదాంత మీచిక్కును విడదీయగలరు. ఈరహస్యమును వ్యక్తపర్చగలదు. వేదాంత మేమిచెప్పుచున్నది? ఈ భావప్రపంచమంతయు నొకయున్మాదివర్తకసంఘమువంటిది. దీని కనేకమంది భాగస్వాములును, యొక మేనేజరును యుండును. మొదటయపరాధి నీకపకారముచు చేసినపుడు నీవు నీక్రోధానలభాగమును పంపితివి. అట్లే రెండవవాడును, మూడవవాడును, వానిచే పరాభవింపబడిన మీరందరునుగూడ మీమీభాగములను బాకీలేకుండ పంపించితిరి. ఇట్లు తగినన్ని భాగములు వచ్చుటతోడనే వ్యాపారమును సాగించవలసివచ్చెను. (కావలసిన భాగములన్నియు సమకూడినగాని వ్యాపారముసాగదు కదా!) భాగములన్నియు సమకూడుటతోడనే యొక మేనేజరు, బలవంతుడు, బయలుదేరెను. ఇతని కపకారము జరు

గుటతోడనే యమోఘమైన యాధ్యాత్మిక న్యాయానుసార ముగా మీామీా క్రోధములన్నియు వానిచే నాకర్షింపబడి వానిలో మూర్తీభవించును. ఈ యన్నిక్రోధములు ఒక్కని లో వచ్చి చేరును. చివరకాతఁడా హాననము నొనర్చి ప్రభుత్వ ముచే ఖయిదీ చేయబడును. ప్రభుత్వము వారితని నొక్కనినే శిక్షింతురు. కాని భగవంతునిదృష్టిలో మీారందరును యప రాధులే. సత్యదృష్టిలో మీారందరును యపరాధులే. మీా రందరును హంతకులే. కేవలము హంతను గావించిన వా డెంతదోషియో క్రోధద్వేషములను గుప్పిన మీారందరును కూడ నంతదోషులే. కనుకనే జీసను మీారు చంపకపోవు టతో చాలదు. క్రోధద్వేషములను గూడ మీారు మీా చెంతకు రానీయజనదు. వాటిని సుతరాము విసర్జించవలెనని చెప్పి యున్నాడు. హంతకుడును, మీారును సమానదోషులే! ఏమి? అతని యాగ్రహమతనిదొక్కనిది కాదు. అది మీాయంద రిదిని. మీాయందరికోపము నతని నావహించుటచే నతఁడు దయ్యముపట్టినవానివలె పిచ్చివాడగును. ఈస్థితిలో వాడు హత్యచేయుచున్నాడు. హత్యలు జరుగుటకిదియే కారణము. ప్రపంచచరిత్రలను పరికించుడు. ఒకనాఁడు రాక్షసపరిపాల నను సాగించును; ప్రజలందరును భయభ్రాంతులగుదురు. దేశములో నల్లకల్లోలమును, యరాచకమును ప్రబలును. ప్రతివాడును యరాచకము నణచి సుభిక్షముగా దేశమును

పరిపాలించగల యోధునికొరకెదురుచూచుచుందురు. ప్రతి వాడును నట్లు చేయజూతురు. కాని విఫలమనోరథులగుదురు. ఇంతలో నాయిచ్ఛాశక్తి యొకనిలో మూర్తీభవించి యొక నెపోలియనో, యొకకృష్ణుడో బయలుదేరును. వీరిలో ననేక లక్షలమందిబలము, శక్తి తాండవించును. కాలము (ప్రజలు) వారిని కోరెను. వా రుద్భవించిరి. యోధులలో ననేకలక్షల మంది శౌర్యప్రతాపము లుండుటకు కారణమేమి ? నపోలి యనును పట్టుకొనుటకు వేలకువేల సైన్యమువచ్చెను. ఒక్క నెపోలియను యేకాకిగా నిరాయుధుడై వారిమధ్యకు పోయెను. అందరును నాయుధములను పారవైచి వానిని కౌగిలించుకొనిరి. ఒక్కమనిషి వేలను పెదవి మెదల్పకుండ నూకీకృతులను జేసెను. ఎంత యాశ్చర్యము! దీనికి వేదాంత మేమి చెప్పుచున్నది? అనేక వేలమంది భావములన్నియు వానియొక్కనిలోను కేంద్రీకరించును. అనేకవేలమంది భావములు కలసి యతడగుచున్నాడు. కనుక నెపోలియనుగాని మరేమహామహుడుగాని యనేకత్వత్వమును వహించజనడు. నీ కనేకలక్షలమంది శక్తియున్నయెడల నీ వనేకలక్షలమందియొక్క సముదాయమవు. వారిభావములే నీలోనుండి పనిచేయుచున్నవి. ఇందులో నిప్రత్యేకదేవతావ్యక్తిత్వ మేమియును లేదు. నీవు ప్రజల సృష్టివి.

షేక్స్పియరు మహాకవి యెట్లుద్భవించెను ? ఈరోజు లలో షేక్స్పియరు అక్కరలేదు. ఆరోజులలో ప్రజలు నాటకములనిన చెవికోసికొనెడివారు. ఎక్కడచూచినను నాటక రంగములే. ప్రతివాడును నాటకములకు పోయెడివాడును నాటకకబుర్లను చెప్పుకొనెడివాడునునై ప్రజలదృష్టియంతయు నట్లే కేంద్రీకరించబడెను. దానికి ఫలితముగా షేక్స్పియరు మహాకవి యుద్భవించెను. అతడొక్కడేకాక యతనితో బ్యుమాంటు, ఫ్లెచరు, మార్లో మొదలగు ననేకమంది ధీమంతులు, మహామేధావులు, వేదాంతులు మొదలగు సాహిత్య రత్నములుద్భవించెను. ఈవిధముగా షేక్స్పియరు, నెపోలియను మొదలగు కవీశ్వరులు, మహాశూరులు వీరందరును కాలమూర్తులు. ప్రజలే వీరిని సృష్టించిరి. వారియాశయము లు, వారిభావములు, వారికోరికలు, వారి యాక్రోశములు వీరిలో మూర్తీభవించెను. ఈవిధముగా మానసికముగాకూడ మానవులందరును సోదరులే.

ఈసోదరన్యాయమును మనము మఱియొక రంగము నుండికూడ చూచెదము. నిద్రావస్థలో మనమందరమును ఒకటే. నిద్ర దరిద్రుని, మహారాజును సమముచేయును. రోడ్డుప్రక్కను రాళ్ళపరుపుమీద పడుకొని గుఱ్ఱుపెట్టువానికిని హంసతూలికలమీద నిటునటు కొట్టుకొనువానికిని భేదమెక్కడ? గాఢనిద్రలోనున్న వారిద్దరనుగూర్చి యోచించుము!

వారిలో యించుకైనను భేదము నీకు కాన్పించునా? వారిరు వురును సములు కారా? సోదరులు కారా? నిద్రలో భేదమే మైన కాన్పించునా? లేదు లేదు. వారిద్దరును ఒకటే. గాఢనిద్రలో మీరందరును ఒకటే! జాగ్రదవస్థలో నున్న పుడు మీశరీరములన్నియు నొకటే! మీభావములు మీ యాలోచనలుకూడ నొకటే!

ఇక మనము మన నిజాత్మనుగురించి కొంచెము పరిశీ లింతము. ఆత్మ! ఆహా! సత్యములలోకెల్ల సత్యమైనయాత్మ! దీనిని నిర్వచించుటకు సాహిత్యముచాలదు. ఇక్కడ భేదము నకు తావులేదు. ఇక్కడ కెరటము లను పదముకూడ పనికి రాదు. అంతయు నొకేసముద్రము! మహోదధి! నాకొడుకు నావాడు. ఇతడు పెద్దవాడు. నావాడు కాడు. అని నీవన వచ్చును. నీ కిట్టియభిప్రాయ మున్నచో నీవు తప్పుదారి త్రొక్కుచున్నావు. నీయూహ సరియైనది కాదు. నీ కుమారు నకును నీకును యెంతబాంధవ్య మున్నదో నీ పితరు లనుకొ నువారికిని నీకును నంతబాంధవ్యమే యున్నటుల నీవెరుగవు కాబోలును! నీ వెన్నివారలు వారికి తమ్ముడవో, అన్నవో, యక్కవో, తండ్రివో, తల్లివో కాలేదు! నీపూర్వజన్మలను నీ వేమియెరుగుదువు? వెర్రివాడా! ఇప్పుడు నీకు శత్రువైన వాడు పూర్వజన్మలో నీతండ్రి కావచ్చును. నీకుమారుడు కావచ్చును. ఇప్పుడు నీతండ్రియైనవాడు ముందుజన్మంలో నీకు

తండ్రి కాకపోవచ్చును. నీవు మరియొక తల్లిదండ్రులకు పుట్టు దువు. నీభావములు, నీరాగములు, నీకోరికలు మాటిమాటి కిని మారుచుండును. కనుక నీయక్కలు, తల్లిదండ్రులు, అన్న దమ్ములు, నీబంధువర్గమంతయు మారిపోవుచుండును. ఒకే యింటననేకమంది యక్కడచెల్లెండ్రతో బుట్టినవా డెప్పుడును తనస్వంతగృహ మెక్కడనున్నదోకూడ యెరుగకుండ యన్య త్రజీవించుచుంటను నీవు చూచియుండలేదా ? ఈదేశములో పుట్టిన మరియొకడు తన జన్మనంతను మరియొకవిదేశములో గడుపుటను నీవు వినియుండలేదా ? దీనికి కారణమేమి ? అన్యదేశములలో పుట్టినవారు నీని కాధ్యాత్మికబంధువులు. చూచితిరా ! మీబాంధవ్యమును మీరు మీయన్నలతోను, మీయక్కలతోను, సరిపెట్టుకొనరాదు ; భర్తలతోను, భా ర్యలతోను సరిపెట్టుకొనరాదు. అందరును ప్రతివాడును నీ యాత్మయే ! దీనిని గ్రహించుము. శాస్త్రము దీనిని రుజువు చేయగలదు.

శాస్త్ర మేమిచెప్పుచున్నది? ఒక్కటైన నీశరీరములో వేళ్ళు పాదములకు, పాదములు కాళ్ళకు—కాళ్లు శరీరముకు యీవిధముగ నొకయంగము మరియొకయంగములో నవిచ్ఛి న్నసంబంధమును కలిగియుండుటచే శిరమునుండి పాదములవ రకును నొకేయాత్మ వ్యాపించుచున్నది. ఒకేశక్తి ప్రవహించు చున్నది. అన్నియవయవములను నడుపునది యొకే పరమశక్తి.

అట్లే యీవిశ్వములోని సమస్తజీవరాసులను సూక్ష్మాతిసూక్ష్మజీవి మొదలు బ్రహ్మపర్యంతముగల ప్రతిజీవిని తీసి క్రమముగా నొకటితరువాత నొకటిని వరుసలో నిలిపి పరీక్షింతుమేని మన కేమిగోచరమగును? శాస్త్ర మేమిచెప్పుచున్నది? ఈ జీవరాసులన్నియు నీవిశ్వశరీరముయొక్క యవయవములే! ఏకశరీరముయొక్క యంగముల క్రమమే యిక్కడను నీకు కాన్పించును. ఈ విశ్వమంతయు నిట్టి యవిచ్ఛిన్నక్రమమునే కలిగియున్నది. ఏకశరీరములో నొకేయాత్మ ప్రవహించుచున్నట్లు నీ వెట్లు విశ్వసించక తప్పదో యట్లే యీవిశ్వశరీరములోను నొకేవిశ్వాత్మ ప్రవహించుచున్నట్లు గూఢియగుచున్నది. సూక్ష్మజీవి మొదలు బ్రహ్మవరకున్న జీవులలో పాదములలోను చెవులలోను నొకేశక్తి యెట్లు ప్రసరించుచున్నదో యట్లే యొకేయాత్మ ప్రపంచమంతటను వ్యాపించియున్నది. కనుక నాత్మపరముగాకూడ మనమందరమును యొకటే!

ఇక నీతత్త్వము నాచరణలోనికి తెచ్చుమార్గమును గురించి కొంచెము చెప్పెదను. ఈతత్త్వము మీబుర్రల కెక్కవచ్చును! ఎక్కకపోవచ్చును! కాని నైతికన్యాయములుమాత్రము మిమ్ము పట్టిపెట్టును. ఈసత్యముప్రకారము మీరాచరింపవలెను. లేదా మరణించవలెను వే రొకమార్గముమాత్రము సున్న. మీ కొకచిన్నకథను చెప్పెదను. ఇదిగో యిది

చెయ్యి. ఒకప్పుడు దీనికి స్వార్థపరత్వ మెక్కువయై తనలో తా నిట్లు యనుకొనెను. "నేను పగలంతయు కష్టపడి యెంతయో సంపాదించుచున్నాను కాని అదంతయును యీ పొట్ట మ్రింగివేయుచున్నది. నా సంపాదనంతయు నాకే యేల యుండకూడదు. నే నేమియును తినుటను మాని వేసెదను. ఈనోరు, దంతములు, పొట్ట మొదలైన వేమిచేయునో చూచెదను. నాకష్టమువలన వాటి కెంతమాత్రమును లాభము లేకుండ చేసెదను. అదంతయు నాకే యుంచుకొనెదను" అని చెప్పి వర్జించిన రొట్టె, పాలు, మాంసము మొదలగు పదార్థముల నన్నిటిని తానే కబళించనెంచి దాని కొకయుపాయమును పన్నెను ఒకసూదితో తా నొకచోట రంధ్రము చేసికొని యందులో పాలను వగైరాలను యెక్కించెను. నోటికి తినుటకు లేకుండచేయుటే దీనికి కావలెను. ఫలిత మేమయ్యెను. చెయ్యంతయు వాచి నలుపు, బాధ, పోటు, వాపు మొదలగు రోగములు బయలుదేరెను. చివరకు దానికి జ్ఞానము కలిగెను. 'అయ్యో! నేను తెచ్చునదంతయు స్వార్థపరత్వముచే నాకొరకే వినియోగింపబడవలెనని యెగిరిపడితిని. అదంతయు పొట్టలోనికిపోవలెను. అప్పుడదిర క్తముచేతను, కాళ్ళచేతను, చేతులచేతను తదితర యవయవములచేతను పరిగ్రహింపబడును. అప్పుడే నాకునుయథార్థమైన లాభముండును' అని స్మృతివచ్చెను తనయాత్మ తనకాస్త చేతిలోనే కాక

శరీరమంతటను యున్నట్లు చెయ్యి గ్రహించక తప్పినదికాదు
కండ్లలోనియాత్మ, కాళ్ళలోనియాత్మ, శరీరమంతటిలోని
యాత్మ. వీటన్నిటికిని ప్రయోజనమున్న గాని చేతికిని యేమి
యు ప్రయోజనము నుండజాలదు. కనుక మీస్వార్థపరత్వము
మిమ్ములనే కొట్టును. స్వార్థపరులగునట్టి చేయిగతియే
మీకును పట్టును. ఆధ్యాత్మిక న్యాయము మిమ్ము మీస్వజన
మునుండి వేరుకానీయదు. నీతోటివారితో నీయాత్మైక్యమును
చూడజాలనేని నీవు పరమపవిత్రసత్యమును తిరస్కరించిన
వాడవగుచున్నావు. ఆయి కొంతాదాసుల మంచిని తమమం
చినివలెనే కాపాడుటకు చూడక మోసగించజూచు వర్తకుని
యెవరును చేరబోరు. ప్రతివాడును వానిని నిరసించుటచే
వానివ్యాపారము ధ్వంసమగును. నీజీవితములో దీనిని నీవు
గ్రహించవలెను. అప్పుడే నీవు బాగుపడుదువు. నీయాత్మయే
విశ్వముయొక్క యాత్మ. ఓ వాస్తమా! కన్ను, కాళ్ళు, చె
వులు వేరనుకొని పొరబడకుము. స్వార్థమును వీడుము!
వాటిలోనున్న యాత్మయే నీయాత్మ. శరీరమంతటను నున్న
యాత్మయే నీయాత్మ. నీవు దుఃఖపంకిలమ్మునుండి దూరు
డవగుదువేని దీనిని గ్రహించుము. దీనిని యనుభవమునకు
తెచ్చికొమ్ము. అప్పుడు సర్వమును యానందమయమగును.
అప్పుడు నీయభ్యాసమే, నీస్వకీయానుభవమే, శరీరమ్ములోని
యీభాగమున దురదకలిగినప్పు డేవిధముగ హస్తము తనం

తటతానే సహాయమునుచేయునో యట్లే ప్రతివాడునుకూడ నీకు సహాయమును చేసితీరునని చెప్పగలడు. ఇక్కడ దురద పుట్టినది. చెయ్యి అచ్చటకనాహ్వానముగా పోయి తనంతట తానే సహాయము చేయుటను మీరు చూచుటలేదా! అట్లే యీసత్యముపై మీకు విశ్వాసమున్నచో, యీసత్యమును మీరు జీవింతురేని, నిత్యానుభవమునకు దెత్తురేని, మీ మనస్సులను దీనియందు లగ్నముచేతురేని విశ్వాత్మయే మీయాత్మయని ధ్యానించుచుందురేని మీకన్ని యవసరములలోను వారు తప్పక సహాయపడెదరు. అనుభవము, తార్కాణము, పరీక్ష — ఇవన్నియు నీసత్యమునకు రుజువు నీయగలవు.

### గృహస్థజీవితము—బ్రహ్మజ్ఞానము.

గృహస్థు బ్రహ్మజ్ఞాని కాగలడా? భార్య, బిడ్డలు, బంధువులు, స్నేహితులు, తదితర సంసారజంజాటములుగల మామూలుమానవుడు సత్యమును, ఆత్మను, బ్రహ్మజ్ఞానమును గ్రహించగలడా? యను ప్రశ్న వేయబడుచున్నది. దీనికి సమాధానమేమి? నీచేతిలోనున్న కత్తి నీశత్రువులను చంపగలదా? అది నీశత్రువులను చంపగలిగినచో గృహస్థాశ్రమమాత్రముగూడ బ్రహ్మజ్ఞానము నీయగలదు. అది దానిని నీ వుపయోగించుటలో కలదు. మనచేతిలోనున్న కత్తితో మనము మనశత్రువులనుండి రక్షించుకొనవచ్చును. లేదా

మనలను మనమే పొడుచుకొనవచ్చును. చూచితిరా! కత్తి యొకటైనను రెండువిరుద్ధపనులను చేయుచున్నది! అట్లే సంసారబంధనములన్నియు మిమ్ము 'గంగలో' ముంచగలవు. లేదా మీ యాధ్యాత్మికాభివృద్ధికి దోహదము నిచ్చి మీలో నున్న యాత్మను, బ్రహ్మమును గ్రహింపచేయగలవు. అదంతయు మీ చేతిలోనే యున్నది.

మనసడతలు, మననిత్యకర్మకలాపములు, మనదివచర్యలు మొదలైన వన్నియు మనకు భోగయోగ్యములు కావచ్చును. సంతోషనిధులు కావచ్చును. వాటిని మనము సరిగా గ్రహించితిమేని యవి మన కనేకప్రయోజనములను కలుగజేసి సంపూర్ణసాన్నిధ్యరము నీయవచ్చును. కాని వాటిని దుర్వినియోగముచేసితిమా యవియే మనల నధఃపాతాళమున కణగద్రొక్కును; అవియే మనకు దుఃఖ, యసంతోష, విచారకారకములై బ్రతుకుపై రోతపుట్టించును; మన కనేకసంకటములను తెచ్చిపెట్టును. మనసంసారబాధనములుకూడ నిట్టివే! ఒక యజమానియొద్ద నొకయభాగ్యసేవకు డుండెను. అత డెప్పుడును వంకరపనులనే చేయుచుండెను. తిన్నగా యేపనిని చేసినపాపము నత డెప్పుడును చేసియెరుగడు. ఎట్టి శాంతమూర్తియుకూడ నతనిపనులకు కుపితుడు కాకుండ నుండలేదు. కాని యీ యజమానిమాత్ర మతని విశేషదయతో చూచుచు నెప్పుడును కినుకవహించి యెరుగడు.

మిట్టి యాత్మనిగ్రహపరులు, యింద్రియనిగ్రహపరులు లేరా? ప్రయత్నముచేయుచో నీవును యట్లే చేయగలవు, నీవు వాంఛింతువేని, నీ కిష్టమున్నచో సత్యమును గ్రహించుటకు, బ్రహ్మమును తెలిసికొనుటకు, విశ్వాత్మలో నీ యాత్మైక్య సంధానమును చేయుటకు, బ్రహ్మత్వసిద్ధికొరకు నీ సంసార బంధనములుకూడ నీకు సాధనములే యగును.

ఈప్రపంచములోని ప్రతివాని పరమావధియు ఆశయమును, పరిణామాంతమును తనలోనున్న బ్రహ్మత్వమును తెలిసికొనుటే. బ్రహ్మత్వమును నొందువరకును నీకించిదాత్మ యనుభవమును, జ్ఞానమును గ్రహించవలెను. ఉరి స్తంభమునకు గొంపోబడినను యీసత్యమునే చాటవలెను; గ్రహించవలెను. ఇదియే పరమావధి. భార్యాబిడ్డలీ సాధన కుపకరణములే యగుదురు అట్లు చేసికొనుట నీలో నున్నదని రాముడు చెప్పుచున్నాడు. భూమి సూర్యునిచుట్టు తిరుగుచున్నది. చంద్రుడు భూమినంటిపెట్టుకొని యున్నాడు. భూమి యేమిచేయవలెను? తాను తిరుగక తప్పదు. కనుక చంద్రుని తదితరగ్రహములనుకూడ తనతో తీసికొని భూమి సూర్యుని చుట్టు తిరుగుచున్నది. ఓమానవుడా! ఓమానవతీమణీ! మీరును భూమివలె తేజస్సులకెల్ల తేజస్సైన, భాస్కరుల కెల్ల భాస్కరుడైన యాపరంధామునుగూర్చి పోవనుకట్టితిరేని మీతోకూడ మీబంధువులను, మీ యాశ్రితులను

తీసికొనిపొందు! వారిని విడుచుట న్యాయముగాదు. ఒక్క నీవే యీ భాస్కరతేజస్సును చూరగొనుటకంటె నీ భాగస్వామికిగూడ నీ వాయానందమును కలుగజేయగలవు. ఒక్క నీ యాత్మనేకాక యితరాత్మలనుగూడ నీవాకర్షింపగలుగుదువు. ఒక్క నీశరీరములోనుండిగాక యితరశరీరములలోనుండికూడ నీవు పనిచేయగలుగుదువు. నీ ఒక్కశరీరము నీదైన ట్లాశరీరములన్నియు భగవంతునివి కాగలవు; అతనిని తెలిసికొనగలవు! నీ వెక్కడికైనను పోవునపుడు నీతోపాటు నీచెవులను, ముక్కును, తలను మొదలగువాటిని విడిచిపెట్టకుండ తీసికొనిపోవుటలేదా? అట్లే నీవు బ్రహ్మజ్ఞానదర్శనమునకు పోవునపుడు నీయర్ధశరీరమును విడిచిపోవ జనునా? నీ భార్యను, బిడ్డలను, తదితరులనుకూడ వెంటబెట్టుకొని పోవచ్చును; పోవలెను. నీవు బ్రహ్మైక్యసంధానమును చేయుటకు ముందు నీభార్యాపుత్రులతో నైక్యమును పొందుము. భార్యాపుత్రులతో నైక్యమును పొందజాలనివాడు విశ్వముతో నైక్యమును పొందు టెట్లు ?

సర్వధర్మములను మొట్టమొదట నీయింటివద్దనే ప్రారంభించవలెను అను సామెత నెరుగవా ? మొట్టమొదట స్వబాంధవులతో, నీయిరుగుపొరుగు వారితో ప్రారంభించుము. నీప్రయోజనములే వారి ప్రయోజనము లగునట్లు చూడుము. అన్నిశరీరములను యేకశరీరముగా పోతపోసి యొకేశరీర

పుట్టలు, పశుపక్ష్యాదులు, క్రిమికీటకములు—వీటన్నిటిలో నున్నది తనయాత్మయే. ఇదియొక మెట్టు. ప్రాథమికావస్థలో తనభార్యాపుత్రులతో నైక్యమును గ్రహించువాడే మానవుడు; వారితో నైక్యమును గ్రహించుట యనగా వారికి ధనధాన్యములను, బంగారుముద్దలను ప్రోగుచేసిపెట్టుటగాదు. ఇదెంతమాత్రమును యవసరములేదు. 'ఆత్మావైపుత్రనామాసి' యను శృతిన్యాయమును బట్టి పుత్రాకృతిని యున్నది నేనే! నేనే! యనుభావము పల్లవించవలెను. తరువాత ప్రపంచమంతయు నేనేయగును. ఈమెట్టు దాటుటతోడనే నామరూపములతో గూడిన బాహ్యభేదముపోవును మాయయంతయు నశించి ప్రపంచమంతయు తనశరీరమే యనుభావము కూడ పోయి చివరకు ప్రపంచమంతయు నాత్మమయము ఆత్మమయము అను పరిపక్వావస్థకుమారును, తల్లిదండ్రులతోను, భార్యాపుత్రులతోను, బంధుమిత్రులతోను, యేకత్వమును గ్రహించుచు క్రమముగా దేశ మంతటి తోను ప్రపంచ మంతటితోను యేకత్వమును పొంద దగును. ఈసాధన మొదటకొంచెము కష్టమైన పని ప్రారంభమగుటతోడనే గుఱ్ఱపుదాటువలె యభివృద్ధి తానంతటదే పరుగెత్తును, మనమొకవ్యక్తితో సంపూర్ణమైన యైక్యమును పొందివానిలో కలిసిపోతిమేని విశ్వమంతటితోను నైక్యమగుట కష్టము కాదని నీయనుభవమే నీకు రుజువుచేయగలదు. అమో

ఘమైన ప్రకృతిన్యాయము ననుసరించి యీప్రపంచములోని ప్రేమ నామరూపాత్మకమైన బాహ్యచిహ్నములను వీడి యంతరంగములోనున్న యాత్మవైపునకే ప్రయాణము చేయుచుండును. సోదరా! ఏండ్లుగడచినకొలది మనముప్రేమించువస్తువంతకంతకు సంస్కరింపబడుచుండుటను నీవుకనియుండలేదా? ప్రేమయొక్కలక్ష్యమంతకంతకు మృదువై, మంజులమై, గంభీరమగుచుండుటను నీయనుభవము నీకు చెప్పటలేదా? ముఖకాంతితగ్గి, ముడతలు హెచ్చి, శరీరము సోలి,పటుత్వముడిగి బాహ్యమంతయు భయంకర మగుకొలది భార్యమీఁదిప్రేమ, భర్తమీఁదిప్రేమ, హెచ్చుగుట లేదా? ఇచ్చట నీవు శరీరాకృతిని, యంగసౌష్ఠవమునుసుందరరూపమును చూచి మురియుచున్నావా? లేదు. లేదు. లోపలనున్నయాత్మ, బ్రహ్మత్వము, పవిత్రత, ప్రేమ, హృదయమ్ము- యివియేచూచుచున్నాము. అంగవైకల్యమునుత్రోసి పుచ్చుచున్నాము. కురూపములను సురూపములుగా చూచుచున్నాము. వయస్సు ముదిరినకొద్ది ప్రేమ హెచ్చుచున్నది. దీనిభావమేమి? మనమిప్పుడే యొకడుగు ముందుకువైచితిమి. బాహ్యచిహ్నములను వీడి యంతరంగమునకు మరలుచున్నాము. భౌతికశరీరమును విడిచి సంస్కారభావములను గ్రహించుచున్నాము. తరువాత మెట్టులో దీనినికూడ నతిక్రమించవలెను. ఇచ్చట భావము, ఉద్రేకము, మనస్సుయొక్క పవిత్రత, మనము ప్రేమించు వస్తువు యొక్క

బాహ్యదర్శనము మొదలగువానినుండి వానిలో సర్వత్రగతమైన యాత్మను, బ్రహ్మత్వమును, నిజతత్త్వమును ప్రేమించుట కారంభించుము. ఈప్రపంచములోని వస్తువులన్నియు నామమాత్రములై, విగ్రహప్రాయములై, కొంతకాలికములై మనకు వస్తువులు గాక వానిలోనున్న యాచైతన్యమే, బ్రహ్మత్వమే, కాన్పించు స్థితి సిద్ధించినపుడు ప్రపంచజయమును సాధించు టతిసులభమగును. దీని తరువాతస్థితి బ్రహ్మత్వములో పూర్తిగా నైక్యమగుటయే. ఇదియే సమాధి; బ్రహ్మానందస్థితి; పరవశత్వము; బ్రహ్మభావము: నిర్వాణము. ఇక్కడ మనఃప్రవృత్తిలేదు. భావము లేదు. అంతయు శాంతి, బ్రహ్మత్వము, ఆనందము. ఈప్రపంచసంబంధములు మన కీస్థితి నెట్లు చేకూర్చగలవు? ఒకవృద్ధ రా లొకయోగిని సమీపించి తాను కృష్ణజన్మస్థాన మైన మథుర బృందావనమునకు కృష్ణవిగ్రహము నారాధించుకొనుటకు పోవలెనని యున్నదనియు, తన బంధుమిత్రపరివారమును వీడి సంసారబంధములను త్రెంచుకొనదలచితిననియు, నిందుకు మీరేమిసలహానిచ్చెదరనియు నడిగెను. ఆమెతోకూడ నామె మనుమ డుండెను. 'తల్లీ! నీమనుమని కళ్ళలోనుండి నిన్ను తిలకించుచున్న దెవరు? ఆపిల్లవాని ప్రస్వేదరంధ్రము నుండియు నీవైపునకు తొంగిచూచునదే శక్తి?" యని యోగి యామె నడిగెను. "ఆశక్తిభగవంతుడే. ఈనోరులేని పసిపిల్లవాడే పాపమును, యేయన్యాయమును నెరుగడు. ఈబుడు

తను నిరపరాధి; పవిత్రుడు అని చెప్పునపుడు భగవంతుడే కీనాలాపము చేయుచుండును" అని యామె బదులు చెప్పెను. "శ్రీ బృందావనములో కృష్ణవిగ్రహమును కదా పూజించవలెను. అప్పుడు నచ్చకృష్ణవిగ్రహములోని బ్రహ్మత్వమునే తలపోయుచుండవలెను కదా! మనిషి బాలుని శరీరము మాత్రము కృష్ణవిగ్రహమువలె నేల యుపాస్యము కాగూడదు? అని యామె యాగి యుండగా నామె సుపుత్రుండై కొంచెము సేపటికి స్మృతిదెచ్చుకొని 'యీబాలుఁ డితఁడు చిన్నికృష్ణుని యవతారమే. ఇతని కన్నులలోనుండి చూచునది, చెవులలోనుండి వినునది, యితనికి చిచ్ఛక్తి నిచ్చునది, యితని ప్రతిరోమ కూపమునుండి కనిచేయునది— బ్రహ్మత్వమే" యని యామె తెలివిదెచ్చుకొనెను. నాటినుండి యామె యోగివాక్యానుసారముగా యాపిల్లవాని తన కుమారుఁడను భావమును సన్యసించి యతనిని భగవంతునివలెనే చూచుకొనెను. మనకుండవలసిన బంధన మొక్కటే భగవత్సంబంధనమే. బ్రహ్మత్వబంధనమే. ఇదియే సన్యాసమునకు మార్గము. సన్యాసమనగా జటాధారణాదికాయక్లేశతంతు కాదు. సన్యాసమనగా ప్రతిదానిని పవిత్రము చేయుట. పిల్లవానిని సన్యసించుట యనగా వాని నేయడవిలోనో విడిచిపెట్టుట కాదు. సుత, మిత్ర, కళత్రాది భావముపోయి సర్వత్ర బ్రహ్మభావ ముదయించవలెను. శత్రువులోగూడ బ్రహ్మభావమునే చూరగొనవలెను.

ప్రతిభార్యయు, ప్రతిభర్తయు నిట్లేచేయవలెనని హిందూ వేదాంతము ఘోషించుచున్నది. రామునిగృహస్థాశ్రమము లో నిట్లే జరిగెను. రామునిభార్య ప్రతిదినము ప్రాతఃకాలముననే మేల్కాంచి రాముడు బ్రహ్మభావములోనుండి బ్రహ్మత్వమును గ్రహించుచుండ, దేహభావమునువిడి యాత్మభావమున మగ్నుడై యమరత్వామృతవృష్టిపానమున సొక్కిసోలుచు పరవశుడైయుండ, నామె వినయవిభూషణాంగియై రాము నెదుట నిలచి యతనిసేవలెనే తానును రామునిశరీరమునుమరచి బ్రహ్మత్వమునే కొలుచుచుండును. రాము డోంకారధ్యానమును చేయుచుండ నామె సర్వమును, తనశరీరమునుకూడ మరచి రామాత్మపరాయణియై యతనిలో లీనమగుచుండెను. శరీరమును మరచుట సరికదా తన యాత్మయే రామునాత్మ; ధ్యాననిష్ఠలోనున్నది తన యాత్మయేకాని రామునాత్మకాదు; రాముధ్యానమే తన ధ్యానము. తానే విశ్వాత్మ; విశ్వాత్మయే తాను. ఈవిధముగా రాము డామెకును యామె రామునకును పరస్పర సహాయమును చేసికొనుచుండిరి. ఆమె యతని కెట్లుసహాయపడెను. రాముడు బ్రహ్మత్వసిద్ధికొరకు ధ్యానము చేయుచుండ "నాభర్త బ్రహ్మయే" యను నామె భావనాశక్తి, మనశ్శక్తి నిరంతరము యతనిపై ప్రసరించుచుండ నాశక్తి యేమగును? నిజముగా యతని బ్రహ్మత్వమున కీశక్తి యెంతయో తోడ్ప

డును. ఏరినైనను మన యిష్టానుసారముగా భావించునట్లు చేయవచ్చునని క్రైస్తవశాస్త్రవేత్తలందరును తమ యనుభవమునుబట్టి యిప్పుడు తెలిసికొనుచున్నారు. నీకు తలనొప్పి వచ్చుచున్నది; తలనొప్పి వచ్చుచున్నదని చెప్పి యట్లు తలనొప్పిని తెప్పించినవారిని నీవు చూడలేదా? ఇక్కడ భార్య తన భర్త భగవంతుడేయని ధ్యానించుటచే నామె యతని బ్రహ్మైక్యసంధానమునకు తోడ్పడుచున్నది. తాను భగవంతుడనని తెలిసికొనుటచే భర్త భార్యకు సహాయము చేయుచున్నాడు ఆహా! ఆధ్యాత్మికసంయోగ మిదియేకదా! ఏమి యన్యోన్య సహాయము! ఏమి—యుదారసంయోగము! ఒక్క యిట్టి యాధ్యాత్మికసంయోగజనిత ప్రేమయు, వివాహమును, కదా ప్రపంచములో ననుపమాన యమందానందకందళితస్వాంతమును చేకూర్చగలుగునవి! శరీరపుష్టి, అంగసౌష్ఠవము, ముఖకాంతి మొదలగు మోహావేశజనితప్రేమ ప్రేమయా? అట్టైన నదెంతకాలము నిలుచును? అట్టిప్రేమ దుఃఖములకు, క్లేశములకు, యసంతుష్టిమనోవ్యథాది హృదయవిదారణములకు కారణము కాదా! ఆధ్యాత్మిక సంయోగము! బాహ్యప్రేమగాక యాంతరంగిక బ్రహ్మత్వప్రేమ! ఇదియే మహదానందసంధాయిని.

చూడుడు! అజ్ఞానప్రజ లెట్లు వాపోవుచుందురో! ఒకస్త్రీ వచ్చి నాభర్త కొద్దిమాసములక్రితమే చనిపోయెను.

నే నతని నెట్లు రక్షించగలను ? మరియొకడు వచ్చి శోక శోక
కలిగిన నా యేకపుత్రుఁడు మరణించెను. నే నాత్మహత్యచేసి
కొనుచున్నాను. ఈ వియోగతాపమును నేను భరింపజాలను.
ఇం కొకఁడు వచ్చి నా సౌందర్యరాశియగు భార్యచనిపోయి
నది. ఇక నేను జీవించనొల్లను—అని యొకయోగికి ప్రశ్న
చేసిరి. ఆయోగి యీమొత్తో నిట్లు చెప్పెను. నీవు నా సలహా
ప్రకారము నడచెదవేని నీ కెంతమాత్రమును విచార ముండ
నేరదు. నీ కధైర్యము గలిగినపుడు, నీకు దుఃఖజనించినపుడు,
నీభర్త నీకు జ్ఞాపకమువచ్చినపుడు వెంటనే యొకచోట కూ
ర్చొని కండ్లుమూసికొని నీభర్తను ధ్యానించుము. వెంటనే
నీభర్తయొక్క విగ్రహము నీకట్టెదుట గాన్పించును. అట్లు
నీభర్త నీకు గాన్పించినపుడెంతమాత్రమును విచారించకుము.
గుండెలు బాదుకొనకుము. నేలపడి దొర్లబోకుము. ఇట్టి
వికారచేష్టలన్నియు నతనిని పతితునిచేయును. అతనిని తిరుగ
భూమి నాశ్రయించునట్లు చేయును. అతఁడున్న మరియొక
ప్రపంచమునుగురించి నీవు తలపోయవచ్చును. లేదా కండ్లు
మూసికొనినపుడు నీ కాతఁడు కాన్పించుచునే యుండును గనుక
నతఁడు చనిపోవనట్లే నీవు భావించవచ్చును. నీ కతఁ డట్లు
కాన్పించినపుడు యతఁడు బ్రహ్మయని భావించుము ; బ్రహ్మ
యని గ్రహించుము. నీవు భగవంతుఁడవని యావిగ్రహమునకు
బోధించుము ‘నీవు భగవంతుఁడవు. నీవు ప్రభువువు. నీవు

పరాత్పరుడవు. నీవు బ్రహ్మము. నీ విగ్రహములోను, నీశరీర
ములోను, నీరూపములోను సర్వత్ర నేను బ్రహ్మమునే చూచు
చున్నాను అని చెప్పుము నీవు టెలిఫోనువద్ద చెవిపెట్టి యొ
క వార్తను విందువు. ఆవార్త యాతీగలలో తయారగుట లేదు.
వాటివెనుకనున్న యొకస్నేహితుడే నీ కావార్తను పంపుచు
న్నాడు. అట్లే నీ భర్తవిగ్రహము కాన్పించినపుడు దాని వెనుక
నున్నది బ్రహ్మమని గ్రహించుము 'నీవు బ్రహ్మము. నీవు
భగవంతుడవు. అని యావిగ్రహమునకు బోధించుటచేతనే
నీవు నీభర్త నుద్ధరించగలవు' ఇట్లు మనము చనిపోయినవా
రినే లేవదీసి రక్షించగలిగినయెడల సజీవులైయున్న మనస్నే
హితులను రక్షించు టబ్బురము కాదు.

భార్యాభర్త లిరువురును యిట్లు జీవింతురేని వారిసం
యోగ మాత్మాభివృద్ధి గాక మరేమి యగును. వారు పర
స్పర మానందనిధిలో నోలలాడరే! గృహస్థుల కింతకంటె
వేరుమోక్షమార్గము కలదే! ప్రతివాడును తనభార్యకు సుఖ
మునే చేకూర్చుచున్నాడు. ఆమె కేదిసంతోషము నిచ్చునో
దానిని తెచ్చి యిచ్చుచున్నాడని నీవు చెప్పవచ్చును. అజ్ఞాన
ముచే ప్రజ లిట్లు భావించుచుందురు. ఇతరుల యభిరుచులకు
దోహదమొసగి వారిని సంతోషపెట్టుట సరియైన మార్గమని
మనము మోసపోవుచున్నాము. దీనివల్ల వారును మనమును
గూడ పతితుల మగుచున్నాము. నాకేది సంతోషము నిచ్చు

నో యది నీకును సంతోషమునిచ్చును. నాకేది మంచిదో యది నీకును మంచిదగును. నాకేది యభివృద్ధిదాయకమో యది నీకును యభివృద్ధిదాయకమే. నేను రోగినగుచో ప్రపంచము నంతనుకూడ రోగభూయిష్ఠము చేయుచున్నాను. నేనారోగ్యముగా నుంటినా ప్రపంచమునంతనుకూడ నట్లే యుంచుచున్నాను. ప్రకృతిన్యాయ మిట్లేయుండును. అనుభవము మీ కీసత్యమునే చాటగలదు నీ కానందమును గూర్చినపుడు నేనును యానందపడవలెను. అట్లుగాక వీరినివారు వారినివీరు సంతోషపెట్టుటకు చేయుచేష్టలు పిచ్చిచేష్టలు ; అనర్థదాయకములు; దుఃఖప్రదములు. వాటివలన చివర కుభయులకును ఖేదము, మనస్పర్థలు సంభవించును. వారిజీవితము దుర్భరమై భయవిహ్వలు రగుదురు.

ఒకరి కొకరెట్లానందమును చేకూర్చుకొనవలెనో తెలియకపోవుటయే యిట్టిదుఃఖములకును, స్పర్థలకును కారణమగుచున్నది. అన్యోన్యానందము నభివృద్ధి చేసికొనవలెనన్న మన కించదాత్మను, స్వార్థపార్థమును, బాగుచేయువలెను. నీస్నేహితుని నిజతత్త్వము నద్గ్రహించునట్లు చేయవలెను. నీవు దానికి యథార్థబలము నొసంగవలెను.

ఒకరి కొకరు పరస్పర జ్ఞానదాతలు కావలెను. ఇట్లు చేయుటచే నీవు నీసహాచరులను సుఖపెట్టుటే కాక చివరకు నీవును పరమసుఖము నొందెదవు. నీవు యథార్థమైన పురోహి

తమును గోరుచో నానందమునకు మూలకారణము లగువా టిచే నీయందును నీసహచరులందును యభివృద్ధిచేయవలెను. జ్ఞానము, ఆధ్యాత్మిక, స్వేచ్ఛ యీ రెండును నిరతిశయానందము నీయగలవు. వీటిని మీ స్నేహితుల కొసంగుడు. ప్రతి భర్తయు తనభార్యకు విద్యనొసగుట విధాయికకృత్యము. తనభార్యకు గురువు కావలెనని భర్తయు, తనభర్త కాధ్యాత్మికస్వేచ్ఛ నొసగి యతని యభ్యున్నతి కన్ని విధములను సహాయపడని భార్యయు తనుజీవితములో యానందము నొందజాలరు. అట్టి సతి పాపి; స్వగృహామునే భార్యకొక విశ్వవిద్యాలయముగా చేయజాలని భర్త పాపాత్ముడు. మీ రానందస్వాంతు లగుట కిదియే మార్గము గృహాము ప్రేమకు కేంద్రస్థానము కావలెను గాని యదియే పరిహద్దుగోడ కాగూడదు. గృహాభార్యలు కేంద్రస్థానముగ గలిగి ప్రేమ యిచ్చటనుంచి తనకాంతులను దిగంతములకు వెదచల్లవలెను అంతియేగాని నీప్రేమయంతయు భార్యయందే నిలచిపోవుటన్యాయము; నీస్వార్థచింతచే నీవు నీభార్యను నిన్నునుగూడ పతితులను చేయుచున్నావు. ఇద్దరకును వినాశమును తెచ్చిపెట్టుచున్నావు. భార్యప్రేమను చూపమని నీకు బోధచేయును. నీ వా ప్రేమను పవిత్రముచేయవలెను. బాహ్యాహాపమును. శరీరకాంతిని, అందచందములనుచూచి మఱియుప్రేమను బ్రహ్మాత్మప్రేమగా నీవు మార్చవలెను. అప్పుడట్టి ప్రేమతో

నీ వేవ్యక్తిని చూచినను- నదులు, గిరులు, పుష్పములు, వృక్షములు, తృణకాష్ఠములు మొదలైన వన్నియును నీవే యగుదువు. నీవు వాటితో నైక్యమును పొందుదువు.

విశ్వమంతటిలోను నీ కెట్టిస్థాన ముండవలెనో, నీస్థానమును నీ వెల్లమర్చుకొనవలెనో భాగ్య నీకు బోధచేయవలెనే గాని నీ వామెమూలమున విశ్వమున శాంతిలేక యిటునటు కొట్టుకొను పిచ్చికుక్కవు కాగూడదు. నేనిప్పుడు మీకు కొన్ని యాధ్యాత్మిక న్యాయములను తెలిపెదను. నేను తెలుపకపోయినను వాటిని మీ రిదివరకే యనుభవించుచున్నారు. రథికుడు రథముమీద పోవునపుడు చూడకపోవుట చేత తిటాలున నొకరాయి నెక్కుట రథములో నుండువారందరును 'డీడిక్క' లు కొట్టుకొనుట, రథమునకు దెబ్బలు తగులు చుండుట మన యనుభవములోనిదే. రథికున కారాయి సంగతి ముందుగానే తెలిసినయెడల జాగ్రత పడియుండెడివాడు. ఇట్లే మీ ప్రపంచవ్యవహారములలోను యనేక 'బోల్తాలు' విఘ్నములు, దుఃఖములు, పరాభవములు మొదలైనవి వచ్చుచుండును. ఇవన్నియు యెప్పుడు సంభవించునో నీ వెరుగుదువా ? రాముడు దీనిని మీకు చెప్పగలడు. ఇక్కడ గణితశాస్త్రన్యాయములవలె తిరుగులేనట్టి న్యాయ మొకటి కలదు. ఇది యితరభౌతిక సత్యములంతటి సత్యమై వాటివలెనే తిరుగులేనట్టి న్యాయము.

పురుషుడుగాని స్త్రీగాని యొకరూపమునో, శరీరము నో లేక మరేవిషయవస్తువునో చూచి ప్రేమించునేని యావస్తువు కొంతకాలమే అనగా హృదయపీఠమున బాగుగ స్థాపితమగువరకు మాత్రమే భోగ్యమగును. తరువాత నది మనమధ్యనుంచి చటాలున లాగివేయబడును. ఈన్యాయము నేశక్తిగాని, యేవ్యక్తిగాని ప్రతిఘటించజాలదు. దీనికి తిరుగులేదు. బహుపురాణకాలమునుంచి నేటివరకు నీన్యాయ మమోఘముగనే జరుగుచున్నది. నీ వేబాహ్యవిషయమునందైనను సంగము నొందుము! ఏరూపమునైనను, పేరునైనను, మహావ్యక్తినైనను పట్టుకొని ప్రేలాడుదువేని వెంటనే యది లాగివేయబడును. నీవు క్రిందకు పడుదువు. నీ వొకబల్లపై యానుకొనినచో నాబల్లను లాగివేసినపుడు నీవు పడిపోవుచున్నావు. దెబ్బ తినుచున్నావు. దీనియర్థమేమి? ఇదేమి బోధించుచున్నది? మనమెన్నడును మనప్రేమను, మనరాగములను బాహ్యభౌతిక విషయములందు నిలుపరాదు. నీటియందు రాగముల నుంచరాదు. కాని మనహృదయములో ప్రేమాంకురమునకు కారణము లివియేయగుచున్నవి. ఇవి లేకుండ ప్రేమ యంకురించుటలేదు. కాని యొకసారి యిట్టి ప్రేమోదయ మగుటతోడనే విషయములకు విడిచిపెట్టి యది ముందుకు సాగవలెను. విషయములకు బంధింపబడక వాటివెనుకనున్న బ్రహ్మాత్మమును సమీపించవలెను. ఇట్లు చేయనిచో నీకు దుఃఖమే

శరణ్యమగును నీవు దెబ్బతిని తీరుదువు. ఇట్లు భార్యాభర్త లిరువురును సమముగ పెరుగుచు రావలెను. ఆమె మనకు ప్రేమను బోధించుచుండును. నీ వాప్రేమ నాశరీరముతో నాపక యందరిని, ప్రతివానిని, ప్రపంచము నంతను ప్రేమించవలెను.

విషయభోగక్షేత్రములలో నాటిన బీజములలో నాధ్యాత్మికాభివృద్ధి మొలకలెత్తునా? భర్తశరీరములో గాని భార్యశరీరములోగాని నాటబడిన ప్రేమ యచ్చటనే కప్పబడియుండవలెను. ఆబీజ మచ్చట నాశనమై నూతనాంకురము లఁదాల్చి ప్రపంచకమునకు వచ్చి ఫలముల నీయవలెను. విషయభోగములకు చెందినంతవరకు కపటము తప్పదు. అక్కడ వి త్తనము చనిపోవుటతోడనే ప్రకృతి న్యాయానుసారముగ నావిత్తనమే బ్రహ్మజ్ఞానాంకురముగ బయలుదేరి పెరిగి పెద్దదై పుష్పఫలసమేతమగును. ప్రేమ నెరుగనివానికి బ్రహ్మజ్ఞాన మెన్నటికి కలుగనేరదు. ఇది పరమసత్యము.

మతమునకు విషయప్రేమతో సంబంధ మొంతమాత్రమును యుండజాలదని బహుజనుల యభిప్రాయము. ఇది పొరపాటు. మతమునకు విషయప్రేమతో సంబంధమున్నది. ప్రేమను సరిగా నుపయోగించిన యెడల నది బ్రహ్మజ్ఞానమును చేకూర్చగలదు. 'దానికితరమైన సౌఖ్యములన్నియు వ్య

ధావృథలు. శ్రమచేటు' పవిత్రప్రేమ బ్రహ్మజ్ఞానకవాటము. దానికి మరియొకప్రేమ బ్రహ్మమే.

ఈ దేహాబంధము సత్యావస్థస్థితికి గొంపోవుటే భర్తయొక్క లక్ష్యముకావలెను గాని ధనార్జనా పిపాసయు సంసారసంబంధములను దుర్వినియోగము చేయుటయు దూష్యములు. ఆనందమూన కేవలవస్తువులు మొట్టమొదట సాధనములయ్యెనో సరియే. పరమసాధ్యములు (పరమావధి) గా భావింపబడుచుండుటచే దుఃఖహేతువులగుచున్నవి. శీతోష్ణములనుండి కాపాడుటకు, ఆకలిదప్పుల నుపసంహరించుటకును, జంతు మనుష్యకోటిచే బాధనొందకుండుట కొంతతావును కల్పించుటకు మాత్రమే ధనమవసరము. క్షుత్పిపాసలను తీర్చుకొఱకును శీతోష్ణములనుండి కాపాడు వస్త్రములకొఱకును మనకెంత స్వల్పధన మవసరమో గ్రహించుము!!

నాకు రొంపపట్టినదనుట కొం[illegible]మున నేను రొంపను పట్టుకొంటినను ప్రయోగము కలదు. అది మనలను పట్టుకొనుటలేదు. మనమే దానికొఱకు పరుగెత్తుచున్నారము. ఇదియథార్థము శీతాతపరక్షణకొఱకు మనకు వస్తువులు కావలెను. కాని అవి నిన్ను శీతాధిక్యతనుండి కాపాడుటకు మాత్రమే యని మరువకూడదు. అట్టివస్తువులు మోటుగానుండవచ్చును. ఇతఖరీదు, యింత నాజూకుగలవస్తు లనవసరమే గాక వాటి యథార్థోద్దేశముకూడ నశించుచున్నది. మనకీయాకాశ

సౌధసీమలును, యీతళుకు బెళుకులును, యీజిలుగుపర్యంక ములును, యీహిరణ్మయ స్తంభములును నవసరము లేదు. ఇంపైన చక్కని చిన్నచిన్న కుటీరములు మనకు తగినంత రక్షణ నొసంగజాలవా?

ఆహా! మానవు లెట్టిభ్రమలలో తగుల్కొని శ్లేష్మ ములోపడిన యీగలవలె పైకి లేవజాలకున్నారో చూడుడు! మేడలను మిద్దెలను జూచి మురియుచు వాటినే పరమావధి గా నెంచువా డొకడు. మిలమిల మెరయుచు జిలజిలలాడు వస్త్రములే పరమావధి యనుకొనువ డొకడు. పులిహోర, దధ్యోదన, చక్రపొంగలి మొదలగుచిత్రాన్న 'కైంకర్యమే' పరమావధి కొంతమందికి. ఇట్లింద్రియలోలత్వము బలిసినది! ప్రపంచచరిత్ర నెరుగవా? ఎంతమందికో పర్ణశాలలును, కుటీరములును, వాసస్థానములయ్యెను. కర్కశప్రస్తరములే పట్టుపాన్పులయ్యెను. ఒంటినిండగుడ్డ, కంటినిండనిద్ర, కడుపు నిండతిండి, వారెరుగనేయెరుగరు. అయినను అట్టివారే ప్ర పంచమును నడిపించగలయోధులైరి. ప్లేటోమహాశయు డొ కతొట్టెలో నివసించెడివాడు. అదియే యతనియాస్తి; అతని గృహము నిత్యదరిద్రులయినను ప్రపంచ మిట్టియోధులఋణ మును కొనగలదా? షేక్స్పియరుమహాకవికి మేడలు లేవు. అతడు నాటకములకు వచ్చుప్రేక్షకుల గుఱ్ఱములను జాగ్రత గా చూచుటకు నియమింపబడెడివాడు. తరువాతనతడు కొద్ది

యాస్తిని మాత్రమే బహుకష్టముమీద సంపాదించగలిగెను. స్వాటనుమహాశయునకుకూడ నిత్యదరిద్రుడే. పుస్తకములను కొనుటకును, ముష్టివాండ్ర కొసంగుటకును డబ్బులేక యత డెన్నియోసార్లు విలపించెను. కాని వీటికితప్ప యత డెన్నడును డబ్బుకొరకు విచారించి యెరుగడు. ఇట్టి నిత్యదరిద్రులే ప్రపంచమున కెంతమేలు నొనగూర్చిరో చూడుడు! భారత దేశమున మన పూర్వులు కందమూలఫలములను తినుచు యడవులలో విహరించువారు ఇట్టిప్రాచీనులే ప్రపంచములో నత్యుత్కృష్టమైన వేదాంతజ్ఞానమును ప్రసాదించగలిగిరి. సోదరులారా! ఉదారచరితులును గొప్పవారును కండు! మేడలను సౌధములను నిర్మించుటకొరకు మీజనసత్వములను బుద్ధిసంపతును ధారపోయకుడు! మీ మేధాసంపత్తు నట్లు వృధపుచ్చకుడు. మీగృహాంగణములు, మీసౌధములు చాలగొప్పవిగను పెద్దవిగను యున్నవిగాని అందులో నివసించు మనుష్యులుమాత్రము చాల చిన్నమనుష్యులగుటశోచనీయము. భారతదేశములో గొప్పగొప్ప కట్టడములు గలిగిన సమాధిస్థలములు లేవా? వాటినలంకరించునవేవి? కుళ్ళిన శవములు; కులకులలాడు పురుగులు; విషసర్పములు.

ఆకాశసౌధములను, వెండిగిన్నెలను, బంగారుతొడుగులను, పట్టుపాన్పులను ప్రోగుపెట్టి నీభార్యను, నీమిత్రులను నీసంతును, నిన్ను గొప్పవారిని చేసికొనవలెననెడు వెర్రికోరి

కలను విడనాడుము. నీశక్తి నట్లు ధ్వంసము చేయకుము. నీశక్తిని, నీజీవితమును, నీబుద్ధిని ధనార్జనకొరకు దుర్వినియోగము చేయక నీ తెల్లపుడును నీయంతశ్శక్తులను గ్రహించుటలోను, నీ నిజమోక్షమునకు విద్యాధనము సమార్జించుటలోను, చివరకు బ్రహ్మాత్వసిద్ధిని పొందుటలోను నీ జీవితమును గడుపుదువేని, యదియే పరమానందమని భావింతువేని సంసారజంజాలమెంతమాత్రమును నిన్ను బంధించనేరదు. బాధించనేరదు. అగుడిబాడ నీకొరక సోపానమగును. కొంతమంది మేము తే నిరాడంబరముగా నుండగలము. కాని స్నేహితులు, బంధువర్గము మొదలైనవారిని సంతోషపెట్టవలదా? పాన్పులు, పంఖాలు, సోఫాలు, ఎగువపీటలు దిగువపీటలు మొదలగు నట్టహాసము లేకున్న వారేమనుకొందురు? కాస్తదర్జా కాపాడుకొనవలదా? అని యందురు.

ఓ వెఱ్ఱినాయనా! నీవు నీకొరకు నివసించుచున్నావా? లేక యితరులకొరకు నివసించుచున్నావా? నీకొరకే నీవు నివసించవలెను. నీ జీవితముతో నితరులెట్టి జోక్యమును కలుగజేసికొనరాదు. నీ వన్నమును తినునపుడు నీవు తినుచున్నావా లేక నీకొరకు వారు తినిపెట్టుచున్నారా? నీయన్నమును నీవు జీర్ణింపచేసికొనుచున్నావా? లేక నీకొరకు వారు జీర్ణింపజేసిపెట్టుచున్నారా? నీవు చూచునపుడు నీ నేత్రేంద్రియములా చూచుచున్నది లేక వారినేత్రములు నీకొ

రకు చూచిపెట్టుచున్నావా? వెర్రివాడా! నీపాదములమీదనే యాధారపడుము. నీయిష్టమునకు నీవు స్వతంత్రుడవుకమ్ము. వెన్నుముక లేనివానివలె కాక కొంచెము చేవగలిగియుండుము.

నీయతిథుల యభిప్రాయములను, నీబంధుమిత్రుల యభిప్రాయములను సరకుచేయకుము. అతిథి యభ్యాగతులను చిత్రాన్నములతోను, పక్వాన్నములతోను సత్కరించకపోయిన కొంపమునుగునా? అట్లు చేయనిచో గౌరవముగా నుండదని, మర్యాదాలోపమని ప్రజ లనుకొందురు. ఈ హేతువులవలన మీరు గేహాదివస్తుజాలములకు తగిలింపబడు తోకలగుచున్నారు. ఇది న్యాయముకాదు. అవియే మీయాజ్ఞలకు లొంగియుండి మీకు తోకలు కావలెనుగాని మీరే వాటికి తోకలు కాగూడదు. వివేకమును గుర్తించుకొనుడు!

అతిథి నీయింటికి వచ్చినపుడు వానిని తత్పూర్వముకంటె జ్ఞానవంతుని, సంస్కారిని, యుత్తముని చేసి పంపుటే నీధర్మము. నీతోడివారికి నీవింతకన్న చేయు ధర్మకార్యము మరొకటి యుండకపోదు. నీగృహమును నీ కాటే సంతోషవార్ధి నోలలాడించవలెను. గృహమేధి యైనవాడు తనగృహమును సోపానముగా చేసికొనవలెను గాని గుదిబండవలెగ తగిలించుకొనజనదు. ఎక్కువ జ్ఞానవంతుడవుగ నీ యతిథి నీగృహమును వీడునేని వాని తిండికొరకును, శయ్యకొరకును లెక్కచేయకుము. వానికి జ్ఞానభిక్షను పెట్టుము. అతనికి నీప్రేమను పంచి

పెట్టుము. నేను మీకొకపైసనైన నీయజాలకపోయినను, మీకెట్టిదైహికసేవనుగాని చేయజాలకపోయినను సదయహృదయముతో, సరళస్వభావముతో, ప్రేమభావముతో నొక్క చిరునవ్వును తాల్చితినేని నదియే మిమ్ము సంతుష్టాంతరంగులను పవిత్రులను చేయగలదు! ఇది మీ కొకసేవచేసినట్లే యగును. ధనము నిచ్చుట లెక్కలోనిది కానేకాదు. అది భార్యకు సొమ్ములిచ్చి తరువాత విడిచిపెట్టుటవంటిది. ఆమెకు కావలసినది నీప్రేమగాని నీధనముగాదు. ఒకనికి ధనము నొసంగుటవలన నీవు వానిని మోసపుచ్చునట్టి యపరాధి వగుచున్నావు. నీవు వానికి జ్ఞానదానమును చేయుము. ప్రేమదానమును చేయుము. ఇంతకంటె సేవ, యింతకంటె నతిథియభ్యాగతిపూజ మరొకటి యుండబోదు. నీదారాపుత్రులయెడల నీ కిట్టిప్రేమయే యుండవలెను. ఇదియే వాంఛనీయముగాని యజ్ఞానజనిత మైన మోటుప్రేమ, పశుప్రేమ నిరర్థకములు.

ఓం శాంతిః శ్శాంతిః.

---

గృహస్థజీవితము.

సరిగా సులోచనముల వంటిది.

సులోచనములతో మనము ప్రతివస్తువును చూచుచున్నాము. కాని కండ్లకు సులోచనములబలు వెంతమాత్రమును కలుగుటలేదు; వాటివలన దృష్టి కెట్టియాటంకమును

కలుగుట లేదు. అవి దృష్టిని నిరోధించకపోవుటేగాక దానికి సహాయపడుచున్నవి. వస్తువుల నవి కప్పిపుచ్చక వాటినిమరింత ప్రకాశింపజేయుచున్నవి. భార్యాభర్తలొకరికొకరు సులోచనములవంటివారు. ఒకరిద్వారా నొకరు విశ్వమునంతను చూడగలిగి యుండవలెనేగాని యొకరికొకరు 'గోడలు' కాగూడదు. వారి కలయిక యాధ్యాత్మికమును, వేదాంతజ్ఞానయుతమును నైనపుడే యిది సాధ్యమగును. ఇతరమరతులేమియు పనికిరావు. అప్పుడే వారు యొకరియాత్మ నొకరు దర్శించగలుగుదురు. అప్పుడే శరీరమురిపెములను, రాగములను, నడవడులను, యాచారములను దాటి చూడగలుగుదురు.

మనము మాటిమాటికిని యుచ్ఛ్వాసనిశ్వాసములను చేయుచునేయున్నాము. కాని మనమట్లు చేయుచున్నట్లే గుర్తించము. గృహస్థజీవితముకూడ నిట్లే సంపూర్ణసౌమనస్యముతో నుండవలెను. ఒకరికొకరు భారము కాకూడదు; 'గుదిబండలు' కాగూడదు. ఇద్దరకును స్వేచ్ఛయే! ఒకరిని గురించి యొకరధఃపతితుల మగుచున్నారమను భావన యుండరాదు. ప్రస్తుతము గృహస్థజీవితములో భార్యతలంపు భర్తయాధ్యాత్మికాభివృద్ధి కాటంకమగుచున్నది; భర్తతలంపు భార్యకు భారముగాను, యాటంకముగాను, కాన్పించుచున్నది.

భారతదేశములో స్త్రీపురుషులు కండ్లలో కాటుకను అంజనమును పెట్టికొందురు. అది కండ్లలోనున్నను దృష్టినెంత మాత్రమును యాటంకపఱచదు. సరికదా దానికి బలము నొసగూడును. అది భారమయ్యేనేని లేక దృష్టి కాటంకము య్యేనేని దానిలో దోషముండి తీరును. ఆవిధముగానే కడుపు బలువెక్కెనా యందులో దోషము కలిగినదన్నమాట సత్యము. దాంపత్యన్యాయముకూడ నిట్టిదే! దంపతు లొకరికొకరు భారము కాగూడదు. నాపూర్వాశ్రమమునాటి భార్య "మీరు నన్ను జ్ఞాపకముంచుకొనెదరా" యని నన్నొకనాఁడు ప్రశ్నించెను 'నేనెప్పుడును జ్ఞాపకముంచుకొన'నని చెప్పితిని. జ్ఞాపక ముంచుకొనుట నీకంటె వ్యతిరేకమైన పురుషుని విషయమై సంభవించును గాని నీకండ్లను, నీముక్కును, నీచేతులను నీవు జ్ఞాపక ముంచుకొనెదవా? అవి నీతో నైక్యమయియే యున్నవి. ఒకరితోనొకరు కలిసిపోవునపుడు యేకత్వమే సంభవించి ద్విత్వజ్ఞానమే యుండదు. అప్పుడు జ్ఞాపక ముంచుకొనుటే లేదు. భార్యాభర్తల న్యాయమిదియే!

స్నేహితుడు మనకొక జాబును వ్రాసినపుడు మనము దానిని ప్రేమించి 'కండ్లలో' పెట్టికొందుము. అట్లు భార్యాభర్తలు భగవంతునివద్దనుండి వచ్చిన యుత్తరములు భర్తశరీరము భగవంతుని నుంచివచ్చిన యుత్తరము లేక పటము. కనుక భార్య భర్తశరీరమును, ప్రేమించవచ్చును; గౌరవించ

వచ్చును. కాని యీశరీర మొకజాబుమాత్రమే; పటముమా
త్రమే గాని యసలు వస్తువు కానేరదు. ఈప్రకార మామె
భర్తద్వారా భగవంతుని చూచును; భర్త భగవంతుని
యొక్క చిహ్నము; విగ్రహము అనుభావ ముండవలెను.
రాత్రి శరీరములు కలియుచో పగలు స్త్రీ భర్తతో నాత్మై
క్యసంధానమును చేయవలెను. ప్రతియాలింగనములోను
దేవత్వమును స్వీకరించుచున్నట్లు భావనచేయవలెను. భార్య
యిట్లు తలపోయుచుండవలెను. 'ఓజ్యోతీ! రమ్ము! నిన్ను
నేనాశ్లేషించుచున్నాను' దీనిని మీ రానంద మనవచ్చును;
విశ్వైక్యసంధాన మనవచ్చును. పరిపూర్ణ పవిత్రతయన
వచ్చును. 'ఓదేవత్వమా! ఓజ్ఞానమా! రమ్ము! నిన్ను
నేను స్వీకరించుచున్నాను' ఇట్లంతయు దేవత్వచిహ్నము గావిం
పబడవలెను ఈమంత్రమును రాత్రి మరచెదవా! పగలైన
పూర్తిచేసికొనుము. మీ యేకత్వమును వివాహమును నీవప్పు
డూహించుకొనవచ్చును. దేవత్వము నాలింగనము జేయుట!
విశ్వమంతయు నొక్కని శరీరమే యనుకొనుట! అంతయు
తాన యగుట! ఈభావమే నిరంతరము మనోసీమను రాజ్య
ము చేయుచుండవలెను.

వేదాంత మొకప్రక్క శరీరైక్యమును సర్వదా మఱ
చిపోవలె నని కోరుచు యాత్మైక్యమును నిరంతరము సాధిం
చమని ఘోషించుచున్నది. నీ వెప్పుడును-దేవత్వము, శక్తి,

సామనస్యము, ఈశ్వరప్రేమ, విశ్వైక్యసామనస్యము- ఇవ న్నియు నీలోనే యున్న వని ధ్యానించుము; భావించుము. 'యద్భావం తద్భవతి' నీభావన యెట్లుండునో నీవును నట్లేయ గుదువు. నేను 'బ్రహ్మము'ను. 'బ్రహ్మము' నేను వాడే నేను. నేనే వాడు. ఇట్లు నిరంతరసాధనను చేయుచుండవలెను.

భారత సతీత్వము.

హిందూదేశములో భార్యను గౌరవముగా చూడ రని యు, ప్రేమించరనియు యింగ్లండు, అమెరికా మొదలగు దేశ ములలో చాటబడుచున్నది. ఇది వారి దృష్టిదోషము తప్ప మ రేమియు కాదు. ఇది తప్పయభిప్రాయము. ఈదేశములలో కంటె హిందూదేశములోనే భార్య యెక్కువ గౌరవప్రేముల తో చూడబడుచున్నది; ఇచ్చట భార్యను బహిరంగములో ప్రేమింతురు. ముద్దు పెట్టుకొందురు; యితరచేష్టలను చేయు దురు. కాని లోపాయికారీగా యింటివద్ద నామె తృణీకరింప బడును; తిరస్కరించబడును. భారతదేశములో బహిరంగమున భార్యకు గౌరవమును ప్రదర్శింపరు; చూపనే చూపరు కాని హృదయాంతరాళమున భార్య పూజింపబడును. ఆమె సహ ధర్మచారిణి. ఆమె లేనిదే యేగృహస్థధర్మమును నెరవేర్చుట కర్హత యే లేదు. ఆమె యర్ధశరీరము.

ఈదేశములో బహిరంగప్రదర్శనమే కాని యంతరంగ మువమాత్రము శూన్యము. హిందూదేశమున నిట్లు కాదు.

అచ్చట బహిరంగమున వికారచేష్టలేమియు పనికిరావు కాని భర్త భార్యయభివృద్ధికొరకే తన శక్తిననుసరించి తన సర్వస్వమును త్యాగము చేయును. ఆమె యానందముకొరకు తానెన్ని బాధలనైనను సహుచుండును. కాని పురుషులకున్నంత చదువు స్త్రీలలోకూడ లేకపోవుటయే నక్కడి లోపము. ఈదేశములో మాత్రము పురుషులకున్నంత చదువు స్త్రీలలో గలదా? యథార్థమేమన హిందూదేశములోని పురుషులకు యిక్కడి పురుషులలోనున్నంత చదువు లేదు. (సంఖ్యలోగాని లోతులోగాదు) అట్లే యచ్చటి స్త్రీలలోను యిచ్చటిస్త్రీలకున్నంతచదువు లేదు. స్త్రీపురుషులలో చదువుకున్నవారు చాల తక్కువగానుండుటయే యిక్కడ కాన్పించుచున్న యనర్థము తప్పంతయు హిందూదేశములోని వివాహ బాంధవ్యముమీదకు త్రోసివేయబడుచున్నది. ఇది న్యాయముకాదు.

హిందూదేశములో నెవడును భార్యను 'నాభార్య' యని చెప్పడు; ఉదహరింపడు; అట్టిమాటలు దూష్యములు; అపవిత్రములు; లజ్జాన్వితములు. అత డెప్పుడును 'మాపిల్లల తల్లి, మా కృష్ణునితల్లి, మా రామునితల్లి' యని సగౌరవముగా మాతృత్వపాదనదృష్టితో నామెను పిలుచును గాని 'నాభార్య'యని తనకు చెందుచున్న యొక వస్తువువలెను, శరీరబాంధవ్యసూచకముగను పిలుచుట గర్హ్యము.

హిందూదేశములో ప్లేగున్నయింటిని అందరును విడిచిపెట్టిపోవలెను. దానిలో రోగి నొక్కనినే యుంచవలెను. తదితరు లుండరాదు యనుశాసనముకలదు. కాని యొకప్పుడొక దయార్ద్రహృదయురాలు ప్లేగుచే బాధపడు యొకకుర్రవాడున్న శాలలోనికి ప్రవేశించి రాత్రి యంతయు మేల్కొని వానికి శైత్యోపచారములు చేయుచుండెను. తరువాత నాపిల్లవానితల్లికూడ లోపలకు వెళ్ళుట కంగీకరింపబడెను. తల్లి పిల్లవానిని సమీపించి వానితలను తన కాళ్ళపై నిడుకొని విసురుచుండగా నతడు ప్రాణములను విడిచెను. ఈదేశములో జీససుకాళ్ళమీాద తల నిడుకొని చనిపోవుటను మీాపుణ్యస్థలములో చనిపోవునట్లుగా తలంచెదరు. హిందూదేశములో తల్లిపాదములకడ తలనుంచి చనిపోవుట మహాభాగ్యముగా చూడబడును; ఈచావు యతిపవిత్రమైనచావు.

మీాదేశములో భగవంతుని తండ్రివలె భావింతురు. 'స్వర్గములోనున్న పరమపిత' యని పూజింతురు. హిందూదేశములో భగవంతుని తండ్రివలెగాక తల్లివలె పూజింతురు. భారతసాహిత్యములో 'మాతాజీ' మాతృదీవి' యనుమాట యతిప్రియమైనది; స్వర్గతుల్యమైనది.

హిందువుడు రోగపీడితుడై యుత్కృష్టబాధపడుచు చనిపోవుటకు సిద్ధముగానున్నపుడుకూడ 'నాదేవుడు' నాదే:

వుడు' అని యనడు. అతనినోటినుండి 'అమ్మా! అమ్మా!' యనుమాటలే వచ్చును. హిందువునకు అమ్మా! అమ్మా! యనుమాతృస్మరణయే చివరకు మిగులును; అతని హృదయకుహరమునుండి యామాటయే బహిర్గత మగుచుండును. తల్లి యనుమాట హిందువుని యంతరాత్మనుండి యతిగంభీరభావముల నుదయింపజేయును.



ఓం

# రామతీర్థస్వామి

# బ్రహ్మజ్ఞానోద్బోధనలు.



## దుఃఖసముద్రమునుండి ఆత్మానందమునకు మరలుడు.

ప్రజ లెందుకు బాధపడుచుందురు? ఈప్రపంచములో దుఃఖము లేల సంభవించుచున్నవి ? అను ప్రశ్న వేయుబడుచున్నది. వీని సమాధానము కొరకు రాముడు చరిత్రకథలను మీముందర చదువదలచుకొన లేదు. మహాత్ముల యభిప్రాయములను, సూక్తులను, పురాణగాధలను వినిపించుట యతని పని కాదు. చరిత్రకారులు, కవులు, ఋషులు మొదలైనవారు వ్రాసినవన్నియు పరమసత్యము లే! కాని ప్రపంచములోనున్న చరిత్రనంతను నమలి మ్రింగినను, కవుల గ్రంథముల నన్నిటిని త్రాగి తెప్పిరిలినను సత్యముల నన్నిటిని స్వానుభవముచే పరీక్షించి, ఆత్మానుభవమును గడించిన కాని యేావంతయును లాభము లేదు. రాముడు తన స్వానుభవము నే మీకు చెప్పుచున్నాడు. మీరును మీస్వానుభవముచే యీసత్యముల నే కనుగొన వచ్చును.

2 ఈరోజులలో ప్రతివాడును యేగొప్ప గ్రంథమునో, యేగొప్ప చారిత్రకునో, యేగొప్ప శాస్త్రవేత్తనో లేక యే గొప్ప ప్రఖ్యాతపురుషుని నామమునో ప్రమాణముగా చెప్పు చుండుట యాచారమైపోయినది. పైగా ఇట్టిపేరులను, గ్రంథములను యేకరుపెట్టువారికే పూజ లొనర్చుచున్నారు. ఇది ఆత్మహత్యకు ప్రథమసోపానము. మన కంతర్దృష్టి లేక పోవుటయే, మనము స్వకీయాభిప్రాయముల నేర్పరచుకొనక పోవుటయే, యితరులపై విశ్వాసముంచి ప్రతిదానిని మహా ప్రసాదమువలె వారినుంచి స్వీకరించుటయే, మన 'బుర్ర' నుపయోగించుకొనక ఆపని నితరులచే జరిపించుకొనుటయే యీప్రపంచము దుఃఖమయ మగుటకు కారణ మగుచున్నది.

ఇతరు లేమిచెప్పిన దాని నాత్మపరిశోధన యావంత యు లేక దిగమ్రింగుదుము. మన కాళ్ళమీాద మనము నిలు వము. మహామ్మదు, బుద్ధుడు, కృష్ణుడు మొదలగువారిని విశ్వ సించుటే గాక అనేకమంది చిల్లరదేవుళ్ళను మనము సృష్టిం చుకొందుము. వారికి నతులొనర్తుము. కాని చిన్నపిల్లవాడు కూడ మన వర్తనమును విమర్శింపవచ్చును. దానితో మనకు ధృతిచెడును; సమత్వము సన్నగిలును; దుఃఖము శరణ్యా మగును. మన మితరుల యాభిప్రాయములకు, యితరుల విమ ర్శలకు దోసి లొగ్గుచుందుము; వణకుచుందుము; ఇతరుల యనుగ్రహమును సంపాదించుటకే మన కాలమునంతను వృథ

చేయుచుందుము. మనలను మన కండ్లతో చూచుకొనక యితరుల కండ్లతో చూచుచుండు యాచారమే దుఃఖకారణ మగుచున్నది. మనలను మనకండ్లతో గాక యితరుల కండ్లతో చూచుకొనుట దంభము. మన మితరుల దృష్టిలో గొప్పవార మనిపించుకొనవలె నని తంటాలు పడుచుందుము.

భారతదేశములో నొకయూర నొక పిచ్చివాడుండెను. అక్కడ ప్రతివత్సరము ఫాల్గుణమాసములో హోలీపండుగ జరుగును. ఆనాడు స్నేహితులందరును కలసి బుక్కాలు, వసంతములు మొదలగువాటితో పరిహాస చేష్టలు చేసికొం దురు. గ్రామములో నున్న స్నేహితు లందరును కలసి యీ పిచ్చివానిని పరిహాసము చేయవలెనని బాగుగా ద్రాగించి అతని ప్రాణస్నేహితునివద్దకు పంపించిరి. ఇత డెంతచెప్పిన పిచ్చివాని కంతగురి. ఇతడు పిచ్చివానివద్ద కల్లవడ్పు ఏడ్చు చు, పెడబొబ్బలు పెట్టుచు, కంట దొంగనీరు కార్చుచు "అయ్యో! ఇంకేమున్నది! నే నిప్పుడే మీయింటినుండి వచ్చి తిని. నీభార్య ముండమోసినది. నీభార్య విధవ యగుటను చూచి యిప్పుడే వచ్చుచున్నాను." అని చెప్పెను. 'అయ్యో! నాభార్య విధవయై పోయినదా? నే నింకేమిచేతును ? ఏమి దారి!' అని యాపిచ్చివాడు గూడ గొల్లున యేడ్పులు, పె డబొబ్బలు మొదలుపెట్టెను. అంతలో చాలమంది గుమిగూ డి నీవెందు కేడ్చుచున్నావని యతని నడిగిరి. 'నాభార్య వి

ధవ యైనది కనుక నే నేడ్చుచున్నాను' అని యతడనెను. 'నీవు బ్రతికియుండ నీభార్య విధవ యెట్లగును? భర్తపోకుం డ భార్య విధవయగుట సంభవమా? ఇదెంతయాత్మవిరుద్ధ ము?' అని వా రతని నడిగిరి. 'పిచ్చివాళ్ళులారా! పొండు! పొండు! మీకేమియు తెలియదు! మీరు శుద్ధ మొద్దులు. ఈపరమ విశ్వాసపాత్రుడైన నాస్నేహితు డిప్పుడే నాయిం టనుండి వచ్చుచున్నాడు; నాభార్య విధవయైనట్లు చెప్పుచు న్నాడు. పైగా యీవిషయము నతడు కండ్లార చూచిన ప్ర త్యక్షసాక్షి! ఆమె విధవయై పోయినది.' అని యతడు చెప్పి వారిని మందలించెను.

ఎంతచిత్రము! ఎంతవింత! ఎంత హాస్యాస్పదము! మీ రీకథను విని నవ్వుచున్నారు. ఆశ్చర్య పోవుచున్నారు. కాని ఇంత హాస్యాస్పదముగనే, ఇంత విచిత్రముగనే మనమును సంచరించుచున్నా మనుసంగతిని మీరు గ్రహించవలెను! ఈ ప్రపంచములోని అన్నిమతములును, అన్ని తెగలును యి ట్లే నంచరించుచున్నవి. దంభప్రలాపులు, గర్వాంధులు, విలాసపురుషులు మొదలైనవా రిట్లే తమజీవితములను గడు పుచున్నారు. వారు తమకండ్లతో చూడరు. తమ బుర్రలతో యోచింపరు. నీనిజతత్వము, జ్యోతుల కెల్ల జ్యోతి, పవిత్ర మై అచలమై స్వర్గముల కెల్ల స్వర్గమైయున్న నీనిజాత్మ నీయం దే యున్నది. నీనిజాత్మ యెప్పుడును సచేతనమైనదే! దానికి

చావు లేదు. అదెప్పుడను చిరంజీవియే. దాని కాస్తిక్యమే కాని నాస్తిక్యము లేదు. అయినను నీవు యేడ్చుచు, పెడ బొబ్బలు పెట్టుచు "నా కానంద మెప్పుడు కలుగును" అని విచారగ్రస్తుడవై లేనిపోని దేవుళ్ళ నందరను నీకు వచ్చి సహాయముచేసి యీమహోపద్రవమునుండి రక్షింపుమని వేడుచు, సాష్టాంగనమస్కారములు చేయుచు, ముష్టిబ్రతుకుకు సిద్ధమయి నిన్ను నీవే గర్హించుకొనుచున్నావు. ఒక గొప్ప ప్రవక్తయో, గ్రంథకర్తయో లేక మరే మహానుభావుడో 'నేనుపాపిని, మీరందరును పురుగులు' అని చెప్పినంతమాత్రమున మీరందరును అట్లే భావించుచున్నారు. మీరు మృతతుల్యులు, మృతులు అనుకొనుటలోనే మీకు మోక్షము చేకూరు ననుకొనుచున్నారు. ఇట్టి దెంతమాత్రమును యుచితముకాదు నీజీవితమును గ్రహించుము! నీయాత్మను తెలిసికొనుము. ఆత్మజ్ఞానశూన్యకారకములగు మృతప్రాయజీవితముల నిక చాలింపుము! అమృతుడవైన నీవు మర్త్యుడ నని యేల గోలపెట్టెదవు? నీవు కులీనుడవైనను కొద్దివాడవైనను, నీపదవి గొప్పదియైనను కొద్దిపాటిదైనను నీకాళ్ళమీదనే నిలువబడుము. వాటిని సరకుచేయక నీబ్రహ్మాత్వమను, దివ్యత్వమును గ్రహించుము! ప్రతిదానిని నిర్భయుడవై ముఖవీక్షణము చేయుము! జంకకుము. నిన్ను నీయితరుల కండ్లతో చూడక నీలోనికి నీవేచూచుకొనుము. ఈప్రపంచ

మంతటిలోను నీవే మహోత్కృష్టుడ వని నీయాత్మ నీకెల్ల ప్పుడును బోధించుచున్నది.

బౌద్ధమతము, వేదాంతము మొదలగునవి మేముచె ప్పినట్లే చెప్పుచున్నవని ప్రజలందురు. కాని నీలోపలనున్న స్వర్గము, ఆపరంజ్యోతి 'నేను వ్యర్థుడను, అసమర్థుడను, పాపిని' యను నీచభావముల నొకప్పుడును కలిగియుండవద్ద నియే నీకు బోధించుచుండు నని రాముడు చెప్పుచున్నాడు.

ఒకప్పు డొక యుడుతకును, పర్వతమునకును గొప్ప వాదము జరిగెను. పర్వత మాయుడుతను 'ఓసి గడ్డిపరకా' యని వెక్కిరించెను. అప్పు డాయుడుత 'నీవునిజముగా నా కంటె చాల పెద్దదానవే! కాని రోజులు, వారములు, పక్షములు, మాసములు, ఋతువులు, అయనములు మొదలగున వెన్నియో కూడినగాని ఒకవత్సరము కాజాలదను సంగతి నీవు గ్రహించవలెను. నా అల్పస్థితికి నే నెంతమాత్రమును విచారింపజాలను. నేను నీయంత పెద్దదానను కానిచో నీవు నాయంతచిన్నదానవును కావు; నాయంత చురుకుదనమును నీకు లేదు. నీవు నావంటి యుడుతల ననేకములను భరించగల పంజర మగుచున్నా వనుసంగతి నే నెరుగుదును. శక్తులు భేదించుచుండును. కాని ప్రతిదానికిని అర్హమైన స్థానము కలదు. నేను నాభుజముపై యరణ్యములను మోయజాల

నిచో నీవు నావలె యొక కాయనైనను కొఱకజాలవు. అం గుళమైనను పోజాలవు.'

ఇట్లే నీశరీరమును ఆయుడుత శరీరమువలె చాలచిన్న దిగా యుండవచ్చును. నీప్రక్క నొక పర్వతశరీరుడుండవచ్చు ను. అంతమాత్రముచే నీ వల్పుడవని యనుకొనకుము. ఆ యుడుతవలె కొంచెము జ్ఞానమును కలిగియుండుము. నీ వల్ప కాయుడవైనను దీర్ఘకాయుడైనవాడు చేయజాలనిదానిని చేయుకొరకే విధిచే యుద్దేశింపబడినాడవు. కనుక నిన్ను నీవెందుకు గర్హించుకొందువు? ప్రసన్నహృదయుడవు, సంతు ష్టాంతరంగుడవుకమ్ము!

ఒకప్పుడు రామునివద్ద కొకయుద్యోగి వచ్చి తనపై యధికారి తన్నెప్పుడును యవమానించు చుండుననియు, గౌ రవించడనియు చెప్పుకొనెను. నిన్ను నీవే గౌరవించుకొనుట లేదు కనుక నిన్నాతడును గౌరవించుట లేదు. మన కాత్మగౌ రవమే యున్నచో ప్రతివాడును మనలను గౌరవింతురు; గౌ రవించి తీరవలెను. ఈపుస్తకమునకు నాలుగణాలు వెలపెట్టి నచో నెవడైనను దీని కెనిమిదణాల నిచ్చునా! అట్టివెఱ్ఱివా డెవడును యుండడు కాని దీనికి 0-12-0 అణాల వెలయుంచి నచో ప్రతివాడును 0-12-0 చెల్లించి తీసుకొనును.

ఇట్లే నీకు నీవే తగినంత విలువ నిచ్చుకొనినచో యిత రులెవరును నీయందు విలువ నుంచజాలరు. నీపై నీవుత్కృష్ట

విలువను కలిగియుండుము. ఆత్మగౌరవమునుకలిగియుండుము. నీదేవత్వమును భావించుము. నీ బ్రహ్మత్వము ననుభవించుము ప్రతివాడును నిన్నట్లే భావించును. నీ కట్టిగౌరవమునే చూపును.

విశ్వాసమే మనలను రక్షించునని పెద్దలు చెప్పుదురు. కాని నీ వితరములగు బాహ్యసూత్రములపై విశ్వాసముంచిన యవి నిన్ను రక్షించజాలవు. నీబ్రహ్మత్వమందలి విశ్వాసమే నిన్ను రక్షించగలదు. నీబ్రహ్మత్వమునం దకుంఠితవిశ్వాస ముంచుము! ఆత్మగౌరవమును కలిగియుండుము! ప్రతివాడును నిన్ను తప్పక గౌరవించును. సన్మానించును.' అని రాముడు బోధించెను.

రామునిబోధ ననుసరించి ఆయుద్యోగి మరునాటినుండి తన బ్రహ్మత్వమును గ్రహించుటయం దతిశ్రద్ధను వహించి కొంతకాలము నందులకై వినియోగించుచుండెను. అతడు ప్రార్థనలను చేయ ప్రారంభించెను. ప్రార్థన యనగా కొన్నిమాటలను, కొన్నిశ్లోకములను గొణుగుచుండుట కాదు. ప్రార్థన యనగా బ్రహ్మభావమున తేలియాడుట; బ్రహ్మత్వమును గ్రహించుట. అత డట్లే చేసెను. చిత్రము! అతని పైయధికారి యతనిని యథార్థముగా గౌరవింపసాగెను. అతని కెప్పుడును యెట్టి యవమానమును నీతడు చేయజాలక పోయెను. ఒకనా డతని పైయధికారి యతనిపై రుసరుస

లాడుచు మండిపడజొచ్చెను. అప్పు డత డెంతమాత్రమును చలించక ప్రసన్నవదనముతో, చిరునవ్వు వెలయ నిట్లనెను.

"అయ్యా! తమరు నాకంటె గొప్పజీతమును తెచ్చుకొనుచున్న సంగతి నిజమే! మీరు నేను చేయని వేరొక ప్రత్యేకవిధిని చేయుచున్నట్లు కూడ నే నెరుగుదును మీరు నాకవసరమను సంగతియు నిజమే కాని నేనును మీకు చాల యవసరమే! నాబదులు మరియొకడైనను లేకుండ మీరు నాపనిని చేయగలరా? నాకు మీ రెంత యవసరమో మీకు నేనును అంత యవసరమే! మీకే మొట్టమొదట నాయవసరము కలిగినది. ఈ యుద్యోగమునకు మీకొకరు కావలసియుండి నాకు కబురంపిరి. నేను మీకు నౌకరీచేయుట లేదు. నేను నౌకరు నైనచో నాకోరికలకును నాయవసరములకును మాత్రమే నేను సేవచేయుచున్నాను నేను మీ నౌకరును కాను. నేను నాకే నౌకరును. నే నెవరికిని దాసుడనుగాను. యధార్థసేవ యుచితమే యగుచున్నది"

చూచితివా! నీ వీప్రపంచములో నెవనిపైనను ఆధారపడి యుండుటలేదు. తనకోరికలమీదనే యాధారపడి యుండుచో నేనౌకరును తన యజమానిపై యాధారపడుటలేదు. బాహ్యముగా నాధారపడియుండుటభ్రమమాత్రమే! మనమీదనే మనము నిజముగా నాధారపడి యుండగలెను. కనుక నీరీతిగానే నీనిజస్వాతంత్ర్యమును గ్రహించుము; భా

వించుము; అనుభవించుము! నీవు దేవునిమీదగాని క్రైస్తు, మహామ్మదు, బుద్ధుడు, కృష్ణుడు మొదలగువారిపైన గాని యీ ప్రపంచములో మరే ఋషీశ్వరులపైన గాని యేల నాధారపడి యుండవలెను? నీవు స్వతంత్రుడవు! ప్రతివాడును, అందరును సర్వస్వతంత్రులే! 'నేను స్వతంత్రుడను! నేను సర్వస్వతంత్రుడను' అను యధార్థ భావావేశతత్పరుడవైనపుడు నిశరీర ముప్పొంగుట లేదా! నీవు మహదానందమున మగ్నుడ వగుట లేదా? తనకు వంగి సలాములు చేయలేదని యొకరాజొకనిని యపరాధునిగా పట్టుకొని శిక్షింపనెంచెను. 'ఓరిపశువా! నేను సామ్రాజ్యాధిపతినని యెరుగవా? నీ పొగరుమోతుతనమునకు నిన్ను నేను ముక్కలు ముక్కలుగా కోయింతునని యెరుగవా?' అని యత డామహాపరాధిపై రోషకషాయితనేత్రుడై మండిపడెను. అప్పుడత డారాజు మోముపై నుమిసి తీవ్రసత్యాగ్రహానలదృష్టి నతనిపై బరపగా రాజు నిర్విణ్ణుడై చేష్టలు తప్పినవాడయ్యెను. 'ఓమార్ఖ్యశిఖామణీ! ఓయుత్సవిగ్రహామా! నన్ను చంపుటకు నీ కధికారము గాని, శక్తిగాని యెంతమాత్రమును లేదు. నేనే నాకు యజమానిని. నేను నీపై నుమియగలను; నిన్నవమానించగలను. ఈ నాశరీర మురిస్తంభమును కౌగలించుకొనుటను చూడగలను ఈశక్తులన్నియు నాలోనే యున్నవి. నా శరీరమునకు నేనే యధిపతిని. మొట్టమొదట నాయధికారమే

చలాయించును. తరువాత నీయధికారము నెరవేరిన నెరవేర వచ్చును.' అని యతడనెను. కనుక నీవే నీయజమానివని యెప్పుడును భావించుకొనుచుండుము! గ్రహించుచుండుము! సత్యములను యితరుల కండ్లతో గాక నీయాత్మదృష్టితోనే చూడుము! నీ స్వతంత్రము ననుభవించుము! "ప్రభువులకెల్ల ప్రభువును. దేవుళ్ళకెల్ల దేవుడను" అను సంగతిని మననము చేసికొనుము. 'తత్త్వమసి.'

ప్రజ లెందుకు బాధపడుచున్నారు? ఆత్మజ్ఞానశూన్యతచే తమ్ము తాము మరచిపోయి యితరులు తమ్మేటుల పిలుతురో యట్లే యాత్మభావన చేసికొనుటచేతనే వారు బాధపడుచున్నారు. ఈయజ్ఞాన మున్నంతకాలము, దేవభావము మన కుదయించకున్నంతకాల మెప్పుడును మనము బాధపడుచునే యుందుము.

అజ్ఞానమే అంధకారము. నీవొకచీకటిగదిలోనికి పోతివేని గోడ తగిలి బుర్ర పగులుట, బల్లతగిలి చేయి విరుగుట, పెట్టె తగిలి మోకాలు బ్రద్దలగుట మొదలగు అపాయము లెన్నియో కలుగుచుండుటను నీవెరుగవా? అంధకారమున్నంతకాల మివి యెన్నడును తప్పవు. రాము డొకగృహస్తు యింటిసమీపమునుండి పోవుచుండెను. యజమాని తనయింటిలోనికి పోయి భార్యను తదితరులను తిట్టనారంభించెను. అత డెప్పుడును ప్రతిరోజున యిట్లే చేయుచుండును. "ఈబల్ల

యిక్క డేందుకు తగలేశావు? కాలు ముక్కలైపోయిందే ముండా! ఆకుర్చీ అక్క డెందుకేసిశావు? చెయ్యి విరిగిపో యిందే పీనుగ!" అను మహావాక్యములతో నతడు గగ్గోలు పెట్టుచుండెను. కాని అదేమైనను నివారణోపాయమా! దాని వలన లాభ మేమైన కలదా? కుర్చీ, బల్ల మరియొకచోట పెట్టినను యేగోడకో, యేతలుపుకో తాకి యతనిబుర్ర పగు లుట, చెయ్యి విరుగుట, మోకాలు పగులుట, ముక్కు ముక్కలగుట తప్పునా? అంధకార మున్నంతికాల మట్లే జరు గును. దీపము వెలిగించినచో యేవస్తు వెచ్చట నున్ననేమి? నీయిష్టమువచ్చినచోటు కావంతయు అపాయము లేకుండ సునాయాసముగా పోవచ్చునే!

ఈప్రపంచమున కూడ నీ విట్లే మెలగవలెను. నీబాధ లన్నియు నశించవలెనన్న నీపరిసరములలో మార్పులను చేసి కొనుట, నీపదవిలో నభివృద్ధిని గాంచుట మొదలగు బా హ్యోపచారములు చాలవు. నీయంతరంగభాస్కరుని నీవు యథాస్థితిలో నుంచుకొనిన చాలును అదియే నివారణోపా యము ప్రతివాడును యిక్కడిదక్కడ, అక్కడిదిక్కడ పెట్టుటచేతను, యినుకభోషాణములు, వెండిగిన్నెలు, పట్టు పాన్పులు, స్వర్ణాంబరములు, సౌధసీమలు మొదలగు చిత్ర విచిత్ర హేమపాత్రాన్నాది యుపభోగ్య సాధన సామగ్రిచే తను దుఃఖములను పోగొట్టుకొని యానందమును చూరగొన

చూచుచున్నాడు. కాని దుఃఖ మిట్టెంతమాత్రమును యుప శమింపనేరదు. నీయింట దీపమును వెలిగించుటచేతనే నీ హృదయాంతరాళమున జ్ఞానజ్యోతి ప్రకాశించుటచేతనే, దుఃఖ ముపశమించును. బాధ యంతరించును.

హిమాలయప్రాంతములలో నొక కొండజాతి ప్రజలు కలరు. వా రెప్పుడును నిప్పుచేసికొని యెరుగరు వారు చేపల నెండబెట్టుకొని భక్షించెడివారు. వా రెప్పుడును అన్నమును వండుకొని యెరుగరు. వారివంట యంతయు సూర్యరశ్మి లోనే జరిగెడిది. సూర్యాస్తమయము కాకపూర్వమే వారు పండుకొని సూర్యోదయముతో తిరుగ లేచెడివారు. ఈవిధ ముగా వారికి చీకటితో సంబంధమే లేకపోయెడిది. అచ్చ టనొక పెద్దగుహాయుండెను. ఆగుహాలో వారి పూర్వు లెవరో మహానుభావులు నివసించుచున్నారని వా రనుకొనెడివారు. వీరిపూర్వులు కొంద రాసాంద్రతమఃపటలమైన గుహాంతర సీమలో పంకిలాక్షిప్తు లగుటనో, అశ్మసంఘాతములచే భగ్న శిరస్కులగుటచేతనో మడసిరి. ఈగుహా వారి కతిపవిత్రమైన దిగ నుండెను. కాని వారికి చీకటి యనునదేదియో తెలియక పోవుటచే నీగుహాలోని చీకటి యొక యుపద్రవకరమైన రా క్షసియని యెంచి దాని నెట్లైన తరుమగొట్టవలెనని వా రెన్నియో ప్రయత్నములను చేసిరి. ఇది మీకు నవ్వును పుట్టించుచున్నదిగాని యింతకంటె ననేకములైన పరిహాసనివ

యముల    మన యాఘునికులు చేయుచున్నారు. ప్రార్థనలు    ను చేసినచో నారక్కసి పోవునని యొకరు చెప్పిరి. ... ల్లనె చేసిరి! కాని భూతము ప్రార్థనలతో పోలేదు. మరియొక రా రాక్షసితో యుద్ధము చేసినగాని పోదనిరి. సరే యని బాణములు, కర్రలు, రాళ్లు, కొడవళ్లు, యీటెలు మొదలగు వివిధాస్త్రములతో వా రొక్కుమ్మడి నారక్కసిపై బడిరి. కాని ఎన్ని చేసినను ఆదయ్యము పోలేదు. మరియొక రుపవాసము చేసినచో నాభూతము పోవుననిరి. పాపము వారందరును రోజులతరబడి యుపవసించిరి. ఇట్లు వారెంతత్యాగము చేసినను లాభము లేకపోయెను. మరియొకరు భూతతృప్తికొఱ కన్నదానము చేయవలె ననిరి. వారి కున్నదంతయు వారు దానముచేసిరి. కాని దయ్యముపోలేదు. చివర కొకవృద్ధుడు వచ్చి తాను చెప్పినట్లుచేసిన యారక్కసి తప్పక పోవుననెను. వారు సరే యని యతని సలహాను చెప్పమనిరి. అప్పు డొకపొడుగైన వెదురుకర్రకు కొంతగడ్డి, గుడ్డపీలికలు మొదలైనవి గట్టిగా త్రాళ్ళతో కట్టబడెను. దానిపై కొంత చేపచమురు పోయబడెను. అప్పు డావృద్ధుడు రెండు చెకుముకిరాళ్ళను తెప్పించి ఒకదానిపై నొకటి కొట్టెను. అప్పుడు నిప్పు పుట్టెను. అతడు దానితో నా వెదురుకర్ర చివరనున్న గడ్డి నంటించెను.

ఇట్టి దృశ్యమును వా రెప్పుడును గా          వారి కదెంతయో చిత్రముగా దోచెను. అప్పు          వెదురు కర్రను చేతితో పట్టుకొని యాగుహాలోనికి నిర్భయముగా చఱచఱపోయి యాదయ్యము, ఆయంధకారరక్కసి, మీ కెదురైనచో రెండుచెవులను పట్టుకొని బరబర యీడ్చుకొని రండని వారి నాజ్ఞాపించెను. మొట్టమొదట వా రతని మాటలను విశ్వసింపలేదు. వారిపూర్వులు ప్రార్థనలతోను, ఉపవాసములతోను, దానములతోను దయ్యము పోవునని చెప్పిరి. వా రవన్నియును సంవత్సరముల తరబడి చేయుచున్నను ఏమియులాభము లేకపోయెను. కాని నిన్న మొన్న తలయెత్తిన యీ వింతమనిపి మాటలు మాత్రము నిజము లెట్లగును? యని వా రాకాగడ నార్పివేసిరి. కాని అందులో దురభిమానగ్రస్తులు కానికొంద రా దీపమును తిరుగ వెలిగించి గుహాలోనికి పోయిరి. ఎంతదూరము లోపలికి వెళ్ళినను వారికారక్కసి కాన్పింపదాయెను! ఆగుహాలోని రంధ్రములలో నారక్కసి నక్కియుండు నని వారు ప్రతిరంధ్రములోనికి నాదీపమును జొన్పిరి. కాని దయ్యము కాన్పించలేదు. అదెప్పుడును అక్కడ లేనట్లే వారికి తోచెను. కనుక అజ్ఞానమే అంధకారమనురాక్షసి. అది మీహృదయకుహరములలో స్థావరమేర్పరచుకొనినది. అక్కడ యొకనరకమును కల్పించుచున్నది. దుఃఖములు, విచారములు, బాధలు, ఇవన్నియు నీయందే యున్నవి. అవి నీకు బాహ్యమున లేవు.

ఓ                                నిన్ను తూలనాడెద రనుకొను
ము. తిట్టెద.                         .. అనగా వారు, నీవు వాటిని గ్ర
హించుచో, నీకపకారమును కలిగించు యాహారమును
తయారుచేయుచున్నారు. కాని నీవు వాటిని గ్రహించనిచో,
లెక్కచేయనిచో, నీకట్టి క్రోధమును, యుద్రేకమును జనిం
పనే జనింపదు. రాము డెప్పుడును వాటిని తన కాపాదించు
కొనడు. అతడు వీధులమ్మట బోవునపు డనేకమంది యనేక
విధముల విమర్శించుచుందురు. కాని వాటి నతడు సరకుచేయ
నపుడును విశ్వసించనపుడును అవి యతని నేమిచేయును? ఏ
నుగలు పోవుచుండును. కుక్కలు మొఱగుచుండును.

ఇట్టి విషసమ్మిళిత విందులను దరి జేరనీయనివాడును,
గ్రహించనివాడును జ్ఞాని యని వేదాంతము చెప్పుచున్నది.
అతడు వేటిచేతను వచింపబడడు; వేటికిని చలింపడు.

నీ నిజాత్మను తెలిసికొనుము. నీ నిజాత్మప్రకమ్మ!
నీబ్రహ్మాత్మ్వ మగుము! ఇతరులను నిదించువారియెడల దయ
గలిగి యుండుము. నేను పతితుడను, అధముడను, అవమా
నార్హుడను అను భావములను పోనాడుము. నీదేవత్వమును
గ్రహించుము; అనుభవించుము. దీనికి విరుద్ధమైన దంతయు
నంధకారము; అజ్ఞానము. నీలోనున్న యంధకారమే నీకొక
నరకమును సృష్టించుచున్నది. ఇతరపద్ధతుల నెన్నిటి నవలం
బించినను నీ వీ యంధకారమునుండి తప్పించుకొనజాలవు.

మూ[illegible]ందల ముప్పది మూడుకో[illegible]లు వచ్చి
నను, నీయంధకారమును పోగొ[illegible] సంకల్పించి
నగాని యతఁడేమియు చేయజాలఁడు ఇ[illegible]నాధారపడ
కుము ఈసంఘము [illegible]దని ఆసంఘమున జేరుట, ఈమతము
గాదని ఆమతమున చేరుట, ఈదేవుఁడు కాఁడని మరియొక దేవు
ని మ్రొక్కుట, కృష్ణుఁడు కాఁడని క్రైస్తును, అతఁడు కాఁడని
మరియొకనిని మ్రొక్కుట — మొదలగు వికారములవలన
నెట్టిలాభమును లేదు. ఇట్టివి నీ వెన్ని చేసినను లాభము లేదు.
జ్యోతియే నీయంధకారమును బాపును. జ్ఞానమే, అనుభవ
జ్ఞానమే జ్యోతి. నీబ్రహ్మత్వమందలి యకుంఠిత, యనుభవ
విశ్వాసమే జ్యోతి. అదియే నివారణోపాయము. పరమ
శరణ్యము.

స్త్రీపురుషరూపములో నున్న దేవత్వమా! ప్రతిశ
రీరములో నున్న ఓ నా నిజాత్మా! ఈయన్ని శరీరములలో
నుయున్న ఓ భగవతీ! ఓ తల్లీ! బాహ్యరూపములు, బాహ్య
శరీరములు పూర్తిగా శూన్యమగునట్లు గ్రహింపగలుగు
పరమసత్యమే జ్యోతి యని గుర్తించుము! జ్యోతి లేక సత్య
ము ఈబాహ్యశరీరముల నన్నిటిని స్ఫటికసదృశములుగా
చేయును; వ్యక్తిభేదములను హరించివేయును. ఎవ డెట్లు పైకి
కాన్పించినను జ్ఞానియైనవా డతని బాహ్యశరీరమును, కించ
దాత్మనుకాక దేవత్వమునే చూచును. అతనికి బాహ్యశరీర

ము. మా. కారము. అజ్ఞానమును పోగొ
ట్టుకొనుట తెలిసి చూచుట; నిజాత్మను సత్య
మును, దేవత్వ గ్రహించుట; విచారరహితుడును, భ
యరహితుడు నగుట.

ఓ దేవత్వమా! ఓ బ్రహ్మత్వమా! ఈయుని శరీరము
లలోను ప్రతిబింబించుచున్న ఓ నా యమూల్యదేవతాగ్నీ!
ఇతరుల దృష్టిలో నెవరు శత్రువులుగా భావింపబడుచున్నా
రో వారందరును నా నిజాత్మయే! ఎవరు మిత్రులుగ భావిం
పబడుచున్నారో వారు కూడ నా నిజాత్మయే! బాహ్యశరీర
ములను, కించదాత్మలను చూడకుము! ప్రతిశరీరములోను దేవ
త్వమును చూచుటమాత్రమే గాక నీలోగూడ దేవత్వమును
గ్రహించుటే జ్యోతి. దీనివలన నీవే దేవత్వము; దేవత్వమే
నీవు అగుదువు. దేవత్వమే నానిజాత్మకు మఱియొక నామము
ఆ 'నేను' నిజాత్మ, సర్వత్రి కలదు. దానిని భావించుము;
గ్రహించుము; అనుభవించుము. అన్ని కష్టములును, అన్ని బం
ధనములును, అన్ని నిర్బంధములును, అంధకారమంతయు
పటాపంచలగును. ఎట్టి సత్యము! ఎట్టి దివ్యదృష్టి! దీని నెవ
రును నిర్వచింపజాలకపోవుట విచారకరము. ఇది వర్ణనాతీత
ము; శబ్దజాలమున కగోచరము. ఇది సత్యము! సత్యము!
దీనిని నీ వాసింతువేని, కోరుదువేని యిది నీకు తప్పక
సిద్ధించును.

మనము ఖగోళశాస్త్రః నక్షత్రమండలిలోని నక్షత్రములకును న్నదూరమును, ఒక్కొక్క నక్షత్రముయొం కనుగొనుచో నీభూమి యంతయు నొక్క యణువు, ఒక్కబిందువు మాత్రమే యగును. అట్లే నీవు "జ్యోతులకెల్ల జ్యోతిని, భాస్కరులకెల్ల భాస్కరుడను, ప్రభువులకెల్ల ప్రభువును, దేవతాలోకమునకెల్ల దేవుడను" అని గ్రహింతువేని, ఈ ఖగోళ నక్షత్రములు, యీ చంద్రసూర్యులు మొదలైనవన్నియు నీ ముందర బిందుప్రమాణము లగును. నీవట్లు గ్రహింతువేని, యనుభవింతువేని యీ సాంసారికభూతము లన్నియు నిన్నేమి చేయగలవు? నిన్నెట్లు స్పృశించగలవు? నక్షత్రముల ముందర భూమియే బిందు వగుచో, శూన్యమగుచో, భాస్కరులకెల్ల భాస్కరుడై జ్యోతులకెల్ల పరంజ్యోతియైన, నా నిజాత్మముందర యీసాంసారికబాధలు, విచారములు శూన్యములు కాక మరేమగును? అనేకలక్షల సూర్యులు నశింతురుగాక! అనంతకోటిచంద్రులు మాయమగుదురుగాక! జ్ఞాని మాత్రము హిమవన్నగమువలె చలింపక నట్లే యుండును. వానికేయపకారము సంభవింపగలదు? వాని నేది బాధింపగలదు? ఎంత విచిత్రము! ఎంత ఆశ్చర్యము! అట్టి యనంతమైన, అభేద్యమైన, అప్రమేయమైన జ్యోతియే నీ నిజాత్మ. ప్రజలు దీనిని మరచిపోయిరి. మనకండ్లకు మాయ యను

తెఱ                                  సౌన్కరుని మఱగుపరచుచున్నది.
ప్రకృ                        ్ధార బంధురమై మనము దేనిని సరి
గా చూ                     ్తున్నారము. అద్వితీయు, అప్రిమేయు,
అఖండ పరంజ్యోతిస్వరూపమును చిన్న యజ్ఞానమేఘ మావరించినది.
దీనిని, యీదుర్బల, దుష్ట పిశాచమును పెఱికివేయుడు;
పోదోలుడు. "నేను ప్రభువులకెల్ల ప్రభువును, జ్యోతులలో
పరంజ్యోతిని, నిత్యుడను, అనిర్వాచ్యుడను" అని గ్రహించు
డు తత్త్వమసి. తత్త్వమసి. ఆహా! నీవీభావమును భావించు
చున్నపుడు, దీనిలో తేలియాడుచున్నపుడు సర్వమును, ప్ర
పంచమంతయు స్ఫటికమువలె నిర్దుష్టముగా కాన్పించుట
లేదా?

రాముడు చరిత్రాంశములను గాని, యుత్కృష్టపు
రుషుల జీవితములను గురించిగాని చెప్పుట లేదు. ఇదంతయు
నతని స్వానుభవమే! మీరును దీనిని స్వానుభవమునకు
తెచ్చుకొనగలరు. మనము సత్యమును గ్రహించి దానిని
యనుభవించునపుడు భూతలమును స్వర్గ మాంగళ్యముగా
మార్చితి మని రాముడు మీకు చెప్పుచున్నాడు. అప్పుడు
మనకు శత్రువులు లేరు! భయము లేదు! బాధ లేదు! విచా
రము లేదు! అది స్వర్గము! అది స్వర్గము!

మన మొక పర్వతముమీదనుండి చూచితిమేని క్రింద
నుండు వస్తువులలోని నిమ్నోన్నతములును హెచ్చుతగ్గులు న

మన కేమియు కానరావు. కి ఇయా యిల్లు అతియెత్తుగాను, ఆయిల్లు , ఆవీధి చాల మెరకగాను, యీావీధి చాల —యీావిధముగా నంతటను హెచ్చుతగ్గులే కాన్పించును. ఇట్లే నీ వాధ్యాత్మికపర్వతరాజము నధిష్ఠించితివేని, నిజాత్మను తెలిసికొంటివేని, నీ యాంతరంగిక ప్రత్యాహారాహారము నీకయ్యేనేని మిత్రులు, శత్రువులు, అపకారి, ఉపకారియను సమస్తభేదములు, ద్వంద్వములు నశించును. ఈభేదదృష్టియే మనకసంతోషమును, అరిష్టములను కలిగించుచున్నది. ఈదృష్టిని చాలించి యుత్తమదృష్టిని పొందుము. అప్పుడు భేదములన్నియు నశించి సత్యము సత్యము కాగలదు ఇదియే యేకత్వమని వేదాంతము చెప్పుచున్నది. భగవంతుడే సత్యము. కాన్పించునదంతయు మాయ; అజ్ఞానము.

ఈవిధముగా నీనిజాత్మను తెలిసికొనుము. ప్రపంచమంతయు అయథార్థముగను అంతరంగమున నున్న భగవంతుడే, దేవత్వమే, సత్యముగను నీకు గోచరమగువరకు నీసాధనను చేసికొనుము. నీసోదరునిలోని దివ్యత్వమును గ్రహించజాలక నీ వాతనిని మానవుడని సంబోధించుటచే మహాపరాధమును చేయుచున్నట్లు నీవు గ్రహించ జాలకున్నావు. అట్లు చేయుటచే నీవాతనిలోని దేవత్వమునే చంపివేయుచున్నావు. మాతృహత్య, భ్రాతృహత్య, ఆత్మహత్య యను అనేకహ

త్యలు ... లోను, ప్రతి వానిలోను, యు
న్న దేవత్వ ... లక పోవుటచే మనము దైవహ
త్యనే చేయు ... . నీకు బాహ్యరూపములు, శరీర
ములు, నామములుమాత్రమే స్ఫురించునంత కాలము దుఃఖ
ము, బాధ తప్పదు. ఇట్లు నీలోనున్న దేవత్వమును చంపు
కొన్నంత కాలము నీ ప్రపంచము నుండి నాశనము గుచున్నా
వనుసంగతిని గ్రహించుము. ఇదియే యజ్ఞానాంధకారము.
ఈయజ్ఞానమే ప్రపంచములోని సమస్త దుఃఖములకును కార
ణము అనుభవ మొంత మాత్రమును లేని వారికి సత్యము కల
వలె నుండును. ఇది పరమసత్యము. దీనిని గ్రహించిన పర
మానందమును పొందుదువు. దీనిని భావించుచో, నాచరిం
చుచో నీవొక యద్భుతప్రపంచమున జీవించగలుగుదువు.
ప్రకృతిశక్తు లన్నియు నీకు సేవచేయును. సూర్యచంద్రులు,
గ్రహతారకములు, పృథివ్యాకాశములు సమస్తము నీయా
జ్ఞకు బద్ధము గును. దీనిని నీవు నీ నిరంతరానుభవ సాధనలచే
కనుగొనగలవు తన నిజదివ్యత్వము నాస్వాదించు వాడు, ఈవి
శ్వ మంతటితోను తనయైక్యతను చూచుకొనునా డానందో
దధి నోలలాడడే! అనేక శతాబ్దములనుండి పోగుబడిన గు
హాంతర సాంద్రాంధకారము దీపము వచ్చుటతోడనే క్షణిక
కాలమైనను యాలసింపక పలాయన మగుట లేదా! అట్లే
నీపుట్టుకనుండియు సంచితమగుచు వచ్చిన యజ్ఞానమును

ఒక్క క్షణికములో నాశన                    శ్వము, నీది
వ్యతేజస్సు హృదయాంతర                    టతోడనే
యజ్ఞానము పలాయనమగును.

రాముడు తన నిత్యానుభవముల నిసత్యమును కను గొనెను. "నే నేవ్యక్తిని గాని చూచునపుడు నా కావ్యక్తి కాని, బాహ్యశరీరముగాని గాక యందులోని దేవత్వమే గోచర మగునపుడు నా కెట్టిబాధయు కలుగకుండెను. అట్లు కాక నేను బాహ్యశరీరమునే, వ్యక్తినిమాత్రమే చూడగలిగి నపు డంతయు దుఃఖమయ మయ్యెను; అంధకారమయ్యెను. కాని ఈయనుభవములచేతను, జయపరంపరలచేతను నేని ప్పటికి కలలోకూడ నట్టిదోషమును చేయజాలని స్థితికి వచ్చి తిని. అంతటను బ్రహ్మపదార్థమే తప్ప మరేమియు నాకు కాన్పించుట లేదు. మీరందరు నా నిజాత్మస్వరూపమే; నా యాత్మయే; మీశరీరములన్నియు నాశరీరమువంటివే నాశరీరమే; అని నేను భావించునపుడు మీరును నావలెనే భావించి తీరవలెను అను సత్యము నాకు ద్యోతక మయ్యెను."

మజనుడను యొకకాంతు డుండెను. అతడు తన ప్రేయసిని ప్రేమించినట్లు మరెవరును ప్రేమింపజాలరు. కాని యతనిప్రేమ తనప్రేయసిశరీరముకొరకు మాత్రమే యగుటచే నత డామెను చూడజాలకపోయెను. మీకున్నకో రికలన్నియు ఫలించవలెనన్న మీ రాకోరికలను విడనాడ

వలెను ... నతనువహించవలెను.' పాపము
మను ... రుగొన లేకపోయెను. కాని ప్రపం
చ మం... త్రకాంతుడు లేడని చెప్పవలెను. కాని
యతనికోరిక ... వేరకపోవుటచే నతడు పిచ్చివాడైపోయి
తండ్రిగృహమును వీడి యరణ్యములో తిరుగనారంభించెను.
అతని కొక గులాబిపువ్వు కనిపించినచో నదియే తన కాంత
యని దాని నాశ్లేషించుట కతడు పరువెత్తును సాలవృక్షమును
జూచి దానిని చెక్కిటజేర్చును హరిణశాబక మతని చంచ
లాక్షివలె దోచి దానిని దారొక్కుచును. ప్రతివస్తువు తన
కాంతస్వరూపముగా నతనికి గోచరించుచుండెను. అతడు వా
టి బాహ్యశరీరములను దాటి ప్రతిచోటను తనకాంతశరీర
మునే చూచుచుండెను. కాని యతనిప్రేమ విషయలక్ష్యము
నుమాత్రమే కలిగియుండుటచే నతనికి దుఃఖమే యాశ్రయ
మయ్యెను.

మీరందరును మజనునివలెనే ప్రేమించవలెను. కాని
భార్య బాహ్యశరీరము మీలక్ష్యము కాగూడదు. మీరు
నిజతత్త్వమును, దేవత్వమును, మాత్రమే ప్రేమించవలెను.
ప్రపంచమంతయు నానందముకొరకే కదా పరువులెత్తుచు
న్నది ? ఆనందమే బ్రహ్మము. పాపమితడు యథార్థానంద
ము, బ్రహ్మము, యెచ్చటనుండునో కనుగొనజాలక పోయె
ను. చెట్లలోను, జంతువులలోను, పుష్పములలోను తన ప్రే

యసిని కనుగొనిన మజునుని. ములలోను సత్యమును కనుగొనువాడు ఎవరకు మజునుడు తిరిగి తిరిగి స్మృతితప్పి యడ... చోట పడి పోయెను. అతనితండ్రి యతనిని వెతుకుకొనుచు నచ్చటికి వచ్చిపడియున్న కుమారుని లేవనెత్తి ముఖముతుడిచి సేద దీర్చి 'కుమారా! నీవు నన్ను గుర్తించితివా' అని యడిగెను. కాని మజునుడు వెర్రివానివలె వెర్రిచూపులు చూడనారంభించెను. అతని కీవిశ్వమున మరేమియు కాన్పించుటలేదు. 'తండ్రి యననేమిటి? తండ్రి యన నేమిటి?' అని యతని శరీరమంతయు ధ్వనించుచుండెను. 'కుమారా! నేను నీతండ్రిని. నీవు నన్నింకను గుర్తించుట లేదా' అని అతడు మరల నడిగెను. 'తండ్రి యన నేమిటి' అని మజును డడిగెను. చూచితిరా! అతని కీవిశ్వమంతటిలోను తనప్రేయసి తప్ప మరొకటి కలదా?

మజును డీయసిమాంసములపై, విషయముపై, చర్మముపై చూపిన యనన్యప్రేమను సత్యముపట్ల కలిగి యుండుటే జ్ఞానము. అదియే యాత్మానుభూతి. బ్రహ్మజ్ఞానము. నీకా దివ్యప్రేమ కలిగినపుడు, తల్లి, తండ్రి, సోదరులు, శత్రువులు, సమస్తచరాచరములు మొదలగు వన్నిటిలోను నీవు బ్రహ్మత్వమునే చూడగలిగినపుడు, భార్యలో భార్యగాక బ్రహ్మత్వమే నీకు కాన్పించునపుడు నీవు బ్రహ్మమే యగుదు

వు. సి ... ామునందే పవిత్రస్నాన మాచ
రించుచు వు. ... ప్రాణములను విడిచెను. అతడుజీ
వించియున్నంత కాలము తన ప్రేయసిని చూడనే లేకపోయెను.
చనిపోయినతరువాత నతని భగవంతునివద్దకు తీసికొనిరాబ
డెను. 'ఓ మూర్ఖుడా! సి ... ప్రేమించక విషయము నంతగా
నేల ప్రేమించితివి? నీ ప్రేయసికొరకు నీవు వృథపుచ్చినప్రేమ
లో లక్షవంతు ప్రేమను నాపై చూపియుంటివేని నీకు నేను
దేవేంద్రపదవి నిచ్చియుందునే' అని భగవంతుడనెను. "భగ
వంతుడా! నీ ప్రియ ... నిన్ను నేను క్షమించుచున్నాను.
నాచే ప్రేమించబడుటకు నీకంత యుత్సాహమే యున్న యె
డల నీవే నా ప్రేయసివై వచ్చినచో నీకోరిక సిద్ధించెడిదే!
నాచే పూజింపబడవలెనన్న నా ప్రేయసి వేల కాకపోతివి?"
అని మజునుడు భగవంతునే మందలింపజొచ్చెను. ఇత డంత
యు తారుమారు చేసెను! అతనివలె మీరును అకుంఠితప్రే
మ యుండవలెను. కాని సత్యమే, మీ నిజాత్మయే మీ లక్ష్యము
క్ష్యము కావలెను. దానినే మీరు సర్వత్ర చూడవలెను.
గ్రహించవలెను. అనుభవించవలెను. తదితరమంతయు భ్రమ
మజునునివలె మీరును భ్రష్టు లగుదురు.

"అయితే దానివలన లాభ మేమి? మేము దానిని
తెలిసికొనవలసిన యగత్యము లేదు. మానరకరూపమే మా
కు సంతోషావహముగనున్నది." అని మీ రడుగవచ్చును.

మీా రెంతేని సంతోషము నొందుడు. యె
ప్పటికైన నదియే మీాపరమావధి యని గ్రహింపవ
లెను. కనుక నీమార్గమధ్యమున కుంటుకొనుచు మీా రేల
యాలసించెదరు? ఏల వృధా కాలయాపన చేసెదరు? ఎప్పు
టికైన మీా రాస్థితిని పొందవలెను కనుక కర్దమమార్గముల
నేల కౌగిలించుకొనెదరు? శీఘ్రగాములైన రైలుబండ్లు, ట్రా
ముబండ్లు లేవే! రెక్కలను ధరించియైనను మహావేగముగా
పరమావధిని జేరక మార్గమధ్యమున కాలయాపన చేయుచు
పడియుండుటలా!

నీ నిత్య, నిరంతర వాతావరణమును పరికించుము!
నిన్నా పరమావధికి జేర్చుటే ప్రకృతివిధానమని నీవుగుర్తింప
గలవు. ఇదియే ప్రకృతి తత్త్వము. నీవు ప్రశాంత, నిర్మలా
నందచిత్తమును కలిగి యుక్తస్థితియందే కొంతకాలముందువేని
నీకేదో శుభవర్తమానము, శుభము, మాంగళ్యము చేకూ
రుటను నీవు తప్పక నూాచెదవు. ఇది యనుభవవాక్యము. పర
మసత్యము. ఈ శుభోదర్కస్థితిలో, నీప్రశాంతతలో, నీసామ
రస్యములో నీవున్నపుడు నీకేపరమస్నేహితుడో, మరేపరమ
హృద్యవిషయమో చేకూరును. కాని నీవీవిషయమునుచూచి
మురిసిపోవుదువేని, దాని నత్యంతము ప్రేమించి నీకౌగిలింత
లతో దానిని నలిపివేయుదువేని చివరకు దాని కేయనూహ్యా
ప్రమాదమో సంభవించి యదిమాయమగును ఈధర్మ
మప్రతిహతము.

ఇ                    తోడనే నీవు విచారింతువు; బాధపడుదువు.          ంది యీవిచారముచేతను దోషమును గ్రహించలేక బాహ్యపరిస్థితులను విమర్శింపనారంభింతురు. వాటిపై చిందులు త్రొక్కనారంభింతురు. దానితో మరికొన్ని విచారములు, బాధలు వారికి సంప్రాప్తించును. అప్పుడు వారు 'దురదృష్టము లెప్పుడును యొంటరిగా రావుకదా! అవి తండోపతండములుగా వచ్చి పడుచుండును' అని విలపించుచుందురు. ఏమిలాభము! ప్రజ లొకనాఁడు దురదృష్టములకు పాల్పడుటతోడనే తమసమత్వమును తిరుగ ప్రతిష్ఠించుకొనలేక బాహ్యపరిస్థితులను విమర్శించుచు, అజ్ఞానముచే చిందులుత్రొక్కుచు దురదృష్టపరంపరలను తామే తెచ్చిపెట్టుకొందురు. చిట్టచివరకు సమత్వము, వైరాగ్యము, కామముల కతీతులగుట, సౌమనస్యము, ప్రశాంతత చేకూరి దుర్భర, దుస్సహవిచార మేఘములు విడివడును. మంచిపరిస్థితు లేర్పడును. కాని తిరుగ వెనుకటి కథయే జరుగును. బాహ్యవిషయములపై మోహము జనించి దుఃఖములు మరలప్రారంభమయి చిట్టచివరకు మతము శరణ్యమగును. విచారములును, బాధలును మతమునకు దారిచూపునని పెద్దలందురు.

ఇట్లు మీ నిత్యజీవితములలో రాత్రింబవళ్ళను మీర నుభవించుచున్నారు. సంతోషమును పగలును రాత్రియను దుఃఖ మనుగమించుచున్నది. రాత్రియను దుఃఖమును సంతో

షమనుదినము వెంటాడుచున్న [illegible]ు, విష
యములను మన మామోదించునం[illegible] యుత్పతన,
అధోపతనము లొకటితరువాత నొకటి [illegible]చుండును. ఈ
యాంతరంగిక యుత్పతన అధోపతనము లేల కలుగుచున్నవి?
వాటియుద్దేశ్యమేమి? నీ యాంతరంగిక భాస్కరుని గుర్తింప
జేయుటకే యివి యుద్దేశింపబడెను. భూమిమీద రాత్రింబవ
లులు కలుగుచున్నవి. కాని సూర్యుని కెప్పుడును దినమే
కాని రాత్రి కలదా? సూర్యునిచుట్టు తిరుగుచు భూమియే
దివారాత్రములను కల్పించుకొనుచున్నది. సూర్యునిలో మా
త్రము రాత్రి లేదు. అక్కడంతయు బ్రహ్మతేజస్సే! పగలే!
దుఃఖములు, విచారములు, బాధలు—ఇవన్నియు నీ యాం
తరంగిక స్వర్గమును వ్యక్తపరచుటకే యని గుర్తించుము. భా
స్కరులలోని కెల్ల భాస్కరుని, తేజస్సులలోని కెల్ల తేజస్సును
గుర్తించవలెను; గ్రహించవలెను అను భావమును నీలో
కలుగజేయుటే వీటి యుద్దేశ్యము. అట్లు నీవు గుర్తించుటతో
డనే ప్రాపంచిక బాధలు, దుఃఖములు నిముందర పలాయన
మగును. ద్వంద్వము లన్నియు పటాపంచ లగును. నీవు వాటి
కతీతుడ వగుదువు. ఇదియే వీటియుద్దేశ్య మెట్లగుచున్నది?
మొట్టమొదటి సంతోషములు నీకేమి బోధించుచున్నవి?
మనము మన బ్రహ్మత్వముతో సహచర్యము చేసినపుడే,
దానిలో మగ్నుల మైనపుడే లేక విశ్వముతో సామనస్యము

పొందిన ... ును. మనము విశ్వసౌమనస్య
మును ... సౌఖ్యములును మన వగును.
ఈ ధర్మను ... లేదు. అని యవి బోధించుచున్నవి.
దుఃఖ మేమి చెప్పుచున్నది? ప్రాపంచికములపై, మాయావి
షయములపై సంగము కలిగినపుడు, రాగము కలిగినపుడు,
నేను నొటాడుదుననని చెప్పుచున్నది. ప్రాపంచికవిషయములు
సత్యములు కావనియు, వాటికొరకు మన శక్తులను, కాల
మును వృధచేయుట తగదనియు దుఃఖము చెప్పుచున్నది.
రాముడు ప్రపంచచరిత్రనంతయు ... ధర్మముచేతనే రుజువు
చేయగలడు. సంతోషము లన్నియును మనలో సౌమనస్య
ముండవలెననియు, విశ్వమంతటితోను, సర్వప్రకృతితోను
ఐక్యతయుండవలెననియు బోధించుచున్నవి. దుఃఖము వ్యతి
రేకసాంప్రదాయమును అనగా ప్రాపంచికవిషయములందు
సంగ ముండకూడదనియు, వాటిని సత్యములుగా భావించరా
దనియు చెప్పుచున్నది; సర్వత్ర యున్న భగవంతుని హత్య
చేయరాదనియు, నామ, రూపములకు మురిసి యతనిని విస్మ
రింపరాదనియు చెప్పుచున్నది. సంతోషదుఃఖములు రెండును
వేదాంతమునే బోధించుచున్నవి. సత్యమును గ్రహించదు
కనుకనే ప్రపంచము దుఃఖభాజన మగుచున్నది. సత్యమును
గ్రహించుచో నీ వానందమయుడవు కాగలవు

భారతదేశములో కుండలను చేతులతో చేయుదురు.

మట్టిని లెస్సగా కాళ్ళతో వ ... చిన్న
చిన్న ముద్దలుగా తీసికొని పైన ... లోపల
దేనినో యాధారముగా నుంచుకుము. ... న్యాయముగా
తగులుచుండు మర్దింపులన్నియు నీయభివృద్ధి కే, నీవు బ్రహ్మ
మగుటకే యని గుర్తించుము. నీకు కలుగుచుండు బాధలన్ని
యు నట్టిమర్దనలు ; సంతోషము లన్నియు లోపలనుండు
యాధారము. ఈ రెంటిచేతను శీల మేర్పడవలెను ; ఈ రెం
డును నీ దేవత్వమును సంపాదించవలెను ఇట్టిబాధలను కల్పిం
చుచు నిన్ను దేవత్వమునకు జేర్చులే ప్రకృతిధర్మము నీ
వల్లభివృద్ధినొందనిచో విచారముపై విచారము, దుఃఖముపై
దుఃఖము వచ్చిపడుచుండును. కుండ కాకారము వచ్చువర
కును యివితప్పవు. ఈ 'లెంపకాయలు' తప్పవలెనన్న నీయా
త్మను గ్రహించుము అదియే నీపరమావధి రాముని శరీరము
నెవ్వరైనను పూజించునపు డతడవమానమును పొందుచుం
డును. అతని యంతరంగమున యనంతమైన సంతోషము,
ఆనందము, శాంతియు నుండగా ధనధాన్యములనుండియు,
స్తోత్రపాఠములనుండియు కలుగు సంతోషమువలన నతని కేమి
యు ప్రయోజనము లేదు. దీనిని నీవు గ్రహించితివేని పేరుప్ర
తిష్ఠలకొరకాశించు భౌతికత త్వము నశించగలదు.

భారతదేశమున నొకస్త్రీ యుండెను. ఆమెకు తొమ్మం
డుగురు సంతానము కలరు. ఒక ముష్టివా డామెపెట్టిన బిచ్చ

మున కపరి యామె నాశీర్వదించవలె
నని 'ఓ నేడుగురుబిడ్డల తల్లిని చేతువు
గాక!' అని పాపము బిచ్చగాని యుద్దేశ్యము
మంచిదేయైనను కిదివరకే తొమ్మండుగు రుండుటచే
నది యిద్దరుపిల్లలను పోగొట్టుకొనవలసిన ట్లయ్యెను. ఆమె
దానికిచింతించి మరియొకసారి యాశీర్వదింపుమన బిచ్చగాడు
తిరుగనట్లే యాశీర్వదించెను ఆమె కెంతయు రోషము గలిగి
వానిపై కోపపడుచుండ ప్రజలు గుంపుగూడిరి అతని యా
శీర్వచన మాశీర్వచనము కాక శాప మగుటకు వారెంతే
యు నాశ్చర్యపడిరి. రామునిలో ననంత, యనిర్వాచ్యమైన
యానంద మున్నది. దాని నందరు కూడ యనుభవించె
దరుగాక ! అదియే మన కీప్రపంచవిషయముల నుండి
స్వేచ్ఛ నొసగగలదు ఈ శరీరము, ఈ వ్యక్తిహీనాది
పోంత వెలయు గులాబివలె నజ్ఞాతవానమును చేయునుగాక!
ఈ శరీర మురికొయ్యపై నుండవచ్చును; కారాగారమునబ్రమ
గ్గవచ్చును; సముద్రతరంగములచే గ్రసింపబడవచ్చును; అగ్ని
హోత్రమున త్రోయబడవచ్చును. దీని కెన్నిజరిగినను నా
యానంద మనంతము. అది కొరతపడదు. ఆయానందము
ననుభవించుము! ఆయాంతరంగిక పరమానందముచే ప్రాపం
చికదంభములను, శశవిషాణములను, మూర్ఖ్యములను తరిం
తువుగాక!

ప్రభువుల కెల్ల ప్రభు ...లో భగ
వంతుడవుకమ్ము! తత్త్వమసి.

మానవుడు తనవిధికి తానే యాజమాన... ప్రభువు

స్త్రీపురుషరూపములోనున్న సమస్తచరాచర విశ్వప్రభూ
త్తంసములారా !

మానవుడు తనవిధికి తానే యజమానియగుచున్నాడు; తన యునికికిని తన యవస్థకును తన సర్వస్వమునకును తానే కారకుడు; వాటి నని .టిని తానే కోరి తెచ్చిపెట్టుకొనును అను విషయమునుగూర్చి మనము చర్చింప నున్నారము. మన మిదివరలో మానవుని యథార్థతత్త్వమునుగూర్చి చర్చించియుంటిమి. యథార్థమానవుడు, మాయా విరహిత మానవుడు, బ్రహ్మమే ! భగవంతుడే ! అతడు బ్రహ్మము తప్ప మరేమియు కాజాలడు! యథార్థమానవుడు తన శరీరమునకు మాత్రమే కాక సర్వప్రపంచమునకును, ఈవిశ్వమంతకును, కూడ ప్రభువు. మనము 'మానవుడు' అనుదానిని వేదాంతులు చెప్పు సూక్ష్మశరీరము అనుయర్థముననే తీసికొందము; అనగా సంకల్పవికల్పములు, ఇచ్ఛాద్వేషములు, కామక్రోధములు మొదలగు మనశ్శక్తి గల మానవుడు. ఈ సంకుచిత భావములో తీసికొనినను మానవుడు తనవిధికి తానే ప్రభువగుచున్నాడు ; కారకుడగుచున్నాడు.

మ [illegible] నతరువాత తన యునికిని తానుచాలవ [illegible] నగలడు. మార్చుకొనుచున్నాడు అను సంగతి మన [illegible]దరకును విశదమే! మానవుని కొన్ని పరిస్థితులలో నుంచుడు. ఎట్టి పరిస్థితులలోనున్నను అతడు వాటి కతీతుడు కాగలడు; వాటిని శాసించుశక్తి వానియందు కలదు. అతిదరిద్రమునుండి యతడు తనదేశ మందరిలోను కూడ మహా ఐశ్వర్యసంపన్నుడు కాగలడు. గర్భదరిద్రులును, నిరుపేదలును కూడ నఖండయశస్సును, ఘనప్రతాపమును గాంచినట్లు ప్రపంచచరిత్ర చాటుచునే యున్నది. అట్టి యుత్కృష్టవ్యక్తు లెందరో కలరు. నెపోలియను, షేక్స్పియరు, విట్టింగిటను, కాళిదాసు, పోతన, శివాజీ మొదలగు యోధులును కవీశ్వరులును యిట్టివారు కారా? మన మీ ప్రపంచములోనికి వచ్చిన తరువాత నాజీవితములోనే మన పరిస్థితులను మార్చుకొనగలమని యీయుదాహరణలు చాటుట లేదా? కాని నీజన్మమును, నీతల్లిదండ్రులనుకూడ నీవే నిశ్చయించుకొనుచున్నా వని వేదాంతము చెప్పుచున్నది. శిశువే ముందు కాబోవు మానవుని చూపుచుండును కదా! అంతే కాక శిశువే తండ్రికికూడ తండ్రి యగుచున్నాడు. తనతండ్రిని తానే నిర్ణయించుకొనుచున్నాడు. నీవు జాత్యంధుడ వైనచో దానిని నీవే తెచ్చిపెట్టుకొంటివి. నీవు గర్భదరిద్రకుటుంబమున జన్మించినచో దానికిని నీవే కారకుడవు. నీవు దౌర్భాగ్యపరి

స్థితులలో జన్మించినను దానికిని పుట్టుకకు కూడ నీవే కారణము.

మానవుడు తన తల్లిదండ్రులను తానే యెట్లునిర్ణయించుకొనుచున్నాడు? ఆత్మ యొకశరీరమునుండి మరియొకశరీరమున కెట్లు ప్రయాణము చేయుచుండును? అను సమస్యను కొంతవరకు మన మిప్పుడు చర్చింపవలెను.

మానవుడు చనిపోవునప్పుడు సంపూర్ణముగా నాశనమగుచున్నాడనియు, అదియే ఆజీవి కాఖరుదశయనియు కొందరు భావించుచున్నారు. అతనిలో సహజముగానున్న యమరత్వభావముచే నేమి, మన స్నేహితులును బంధువులును చనిపోకుండ నుండవలెననెడు కోరికచే నేమి యూహాప్రపంచము నొకదానిని కొందరు మతాభిలాషులు సృష్టించి వారినందులో స్థాపించుచున్నా రని కొందరు భావించుచున్నారు. రెండవభావనలో కొంతసత్యమున్నది కాని యది పూర్తియైన సత్యము కానేరదు. చనిపోయిన తరువాత మనము స్వర్గమునకో నరకమునకో పోదు మనునంగతి సంపూర్ణసత్యము కాదు. ఇక్కడ నొకమానవుడు చనిపోయి పాతిపెట్టబడె ననుకొనుము. "మట్టి మట్టిలో చేరినది" అని యీసమాధిపైనుండును. ఇందు సత్య మెంతవరకు గలదు? శరీరము మట్టియగుట సత్యమే కాని యది నశించుటలేదు. అది రూపాంతరమును మాత్రమే పొందుచున్నది. ఆశరీరములో నున్న పంచ

భూతస                ుక రూపములోనున్నది. దాని
కవస్థాభేద.                కలిగినది. నీస్నేహితునియొక్క శరీ
రమే కొద్దిరోజుల   నాసయూధిపై సుగంధపరిమళముతో
నొప్పు గులాబిపుష్పముగనో ఫలపుష్పభరితమైన మహావృక్ష
ముగనో కాన్పించుచున్నది. అది నశించుటలేదు.

శరీరమే నశించనిచో నిక నశించునదేది? ఆత్మ, బ్రి
హ్మము, లేక నీ నిజతత్త్వము నశించునా? అది నశించనేర
దు. దానికి చావు లేదు. అది యమృతము. అనశ్వరము.
ఇక నశించునదేది? భావములు, కామక్రోధములు, సంక
ల్పవికల్పములు, ఇచ్ఛాద్వేషములు గల సూక్ష్మశరీరమా
నశించునది? మానవుడు పాతిపెట్టబడెను కాని యివిమాత్రి
ము పాతిపెట్టబడలేదు. వీటి నెవరును పాతిపెట్టజాలరు. అయి
నచో నివి యేమైనవి? ఇవి యెచ్చట నున్నవి? ఈసూక్ష్మశ
రీరము, ఈ యాంతరంగికభావసముదాయము, కామాదులు
సంకల్పవికల్పసముదాయసంచితఫల మంతయు, నేమగుచున్న
ది? ఈభావనాశక్తి యంతయు నేమగుచున్నది? ఇది దేనినా
శ్రయించుచున్నది? ఈప్రపంచములో నేదియును నశింపు కా
జాలదు. శూన్యము కానేరదు. అని యాధునిక శాస్త్రము
లు కూడ రుజువుచేయుచున్నవి. శక్తిరూపాంతరము చెందు
చు ప్రవహించుచుండునే కాని దానికి నాశము లేదు. పదా
ర్థముకూడ నశింపు కాజాలదు. ఈధర్మ మీా సమస్తవిశ్వము
నకును చెందును.

శరీరము నశించక రూ ండ, ఆ
త్మ యెంతమాత్రమును చలించక ్రతముగా,
కల్పాంతము వర్తియుండ యీ కామకో్ర లు, మనశ్శక్తి,
యీయాంతరంగిక జీవితపు మాత్రము నాశమునొందునా ?
అదెప్పుడును నశింపజాలదు శక్తికి నాశము లేదని యన్ని
శాస్త్రములును రుజువు చేయుచున్నవి అది స్థలాంతరము
నొందవచ్చును. రూపాంతరము నొందవచ్చును. అవస్థాభే
దము నొందవచ్చును. కాని యది మాత్రము జీవించియే
యుండును. దానికి చావు లేదు మన మొక క్రొవ్వొత్తిని
వెలిగించునపు డొక యరగంటలో వత్తియు, క్రొవ్వును
సమస్తమును మాయమగు చున్నది. ఏమియు కాన్పించు
ట లేదు. కాని శాస్త్ర మేమి రుజువు చేయుచున్నది ?
రసాయనశాస్త్ర మేమిసాక్ష్య మిచ్చుచున్నది ? ఇందేమియు
నాశము నొందుట లేదు. ఒక వంకరగాజుగొట్టముచే క్రొవ్వొ
త్తి కాలుచుండగా పోవు వాయువులను మొదలైనవాటిని పట్టు
కొంటిమేని పదార్థ మావంతయు నశించుట లేదని నీకు తెలి
యగలదు. వేసవికాలములో తబుకులలోను, చిన్నచిన్న గి
న్నెలలోను యున్న నీరు యింకిపోవుచుండుటను నీవు చూచు
ట లేదా? తెలియనివా డానీరు నష్టమై పోయిన దనియు,
నశించిన దనియు తలచును. ఆనీరు ఆవిరి యగుచున్నది. గా
లిలో కలసియున్నది. దీనిని నీవు పరీక్ష చేసి కనుగొనవచ్చును.

్రకును నీలోనున్న మనశ్శక్తి,
నీయాంతర , భావసంచయము సంకల్పవికల్ప
ములు మొదలైన . క్తియంతయు నశించునట్లు పైకి కాన్పిం
చును కాని వేదాంతము తన యాత్మరసాయనశాస్త్రప్ర
మాణముచే సందేమియు నశించుట లేదనియు నిదికూడ య
నశ్వరమే యనియు రుజువుచేయుచున్నది. ఇది నశించనిచో
నే మగుచున్నది? ఎందుపోవుచున్నది? నీ కాప్రపంచములో
నేమి కాన్పించుచున్నది? చచ్చుట పుట్టుట. కొంతమంది చని
పోవుచున్నారు. మరికొంద రుద్భవించుచున్నారు. ఈచనిపో
వువారి చిత్తశక్తి యంతయు, భావనాశక్తి యంతయు శూన్య
మై పోవుచున్నదనియు; నశించుచున్నదనియు యనుకొందమ
న్న నది శాస్త్రవిరుద్ధ మగుచున్నది. పదార్థవిజ్ఞానశాస్త్రము,
రసాయనశాస్త్రము మొదలగు ప్రకృతిశాస్త్రముల కిది విరు
ద్ధము; వ్యతిరేకము ఈశక్తి పోవుచున్నదని మన మొప్పుకొ
ను నెడల ఒకవస్తువు శూన్యములోనికి పోవుచున్న దనవలె
ను. ఇది యసంభవము, ఒకవస్తువు శూన్యములోని కెన్నడు
ను పోజాలదు. నాసతో విద్యతేభావః; నాభావో విద్యతేస
తః॥ ఉన్నదానికి లేకుండుట యెన్నడును సంభవించజాలదు.
లేనిదానికి స్థితి యెన్నడును కలుగదు. కనుక మనము చని
పోవునపుడు కూడ మన చిత్తశక్తి యుండుననియే విశ్వసింప
వలెను. మరియొక టసంభవము కనుక మనము దీనిని యొ

ప్పుకొని తీరవలెను. అట్లయిన ...న్నది ?

పుట్టుకను గురించి మనము ... యోజింపవల

సియున్నది. ఈప్రపంచములో ప్రజలు వివిధశక్తులతో, వివిధ భావములతో, వివిధవాసనలతో, వివిధబుద్ధులతో పుట్టుచున్నారు. ఒకనికి గుండ్రతల; ఒకనికి కోలతల; ఒకని కన్నుముక్కుతీరు వేరు; మరియొకని కన్నుముక్కుతీరు వేరు. చివరకు మానవులందరును యొకరినుండియొకరు భేదించుచునే యున్నారు. ఒకడు ఏకసంతగ్రాహి; ఒకడు మొద్దబ్బాయి. ఒకడు మహాద్భుతశక్తి సంపన్నతతో పుట్టుచున్నాడు; మరియొకడు మందుడు. దీనికి కారణమేమి? ఒక తల్లిదండ్రులకే పుట్టినవారిలోకూడ యెంతమాత్రమును పోలిక లేకుండుటే కాక వ్యతిరేకాశయములను విరుద్ధసంస్కారమును గలవారిని మనము చూచుటలేదా? విభీషణరావణాసురులొకేతల్లికి పుట్టుటలేదా? ఒకేకలాశాలలో చదువుచు, నొకేవిద్యార్థిగృహములో జీవించుచు, నొకే యుపాధ్యాయునొద్ద విద్యగరచుచున్న విద్యార్థులు వివిధభావములను, వివిధరుచులను, వివిధశక్తులను ప్రదర్శించుట లేదా? ఒకనికి చరిత్రయందభిరుచి; ఒకనికి రసాయనశాస్త్రమందు ప్రీతి మరియొకనికి గణితశాస్త్రమందభినివేశము. ఒకడు చిత్రకారుడు; ఒకడు కవి; ఒకడు మొద్దు. వీరి శక్తులలోను, యభిరుచులలోను, సంస్కారములలోను భేదములు కాన్పించుటలేదా! చాల భేదములు

కాన్నా నవరును కాదనజాలరు కొందరు పసితనమ తిబుద్ధిబలులు; సింహాబలులు. శంకరుడు వాయుపుత్రుడు మొదలైనవా రెందరు లేరు! కొందరు పసితనమందే మందులు, బద్ధులు, కుంభకర్ణులు ఈ భిన్నరుచులను, ఈ భిన్నశక్తులను, భిన్నవాసనలను, భిన్నయభినివేశములను ప్రజలు కలిగియుండుటకు కారణమేమి? పుట్టుకయందే యీ భేదము లెట్లు కలుగుచున్నవని వేదాంతము ప్రశ్నించుచున్నది. దీని కేదైన కారణముండనక్కర లేదా? ఇదియీశ్వరేచ్ఛ, భగవన్నిర్మాణము, భగవత్కటాక్షము లేక అతడు వారినట్లు సృష్టించెను అని చెప్పుటలో నర్థ మేమియును లేదు. అది పైప్రశ్నలను తప్పించుకొను ప్రయత్నమే కాని దానికి సమాధానము కాదు. అది నీయజ్ఞానమునే సూచించును; అది యీశ్వరేచ్ఛ; అతడే వారి కా భిన్నశక్తులును, రుచులను కలిగించినాడని చెప్పుటకూడ శాస్త్రవిరుద్ధము. ఇచ్చట యొకవస్తువు శూన్యమునుండి వచ్చుచున్నదని నీవు మరల చెప్పుచున్నావు. ఇది యసంభవమని మనమిదివరకే చూచియున్నారము. కనుక నీ వివిధాభిప్రాయములను, వివిధశక్తులను, వివిధాభిరుచులను పిల్లలు తమతో మరియొక ప్రపంచమునుండి తీసికొని వచ్చుచున్నట్లు మన మొప్పుకొనవలెను. కాని వారు వీటన్నిటిని శూన్యమునుంచి తీసికొనివచ్చుట లేదు. ఇవన్నియు నేదోయొక వస్తువునుండియే రావలెను.

ఇవి తత్పూర్వమేయున్నవి. అనగా పూర్వ పురూపమునుండియే తీసికొని వచ్చుచు ఏతిరా! చనిపోవుటకు పూర్వము కొన్ని కామనలు, సంకల్పములు, యిచ్ఛాద్వేషములు మొదలగు కొంత చిత్తశక్తి యున్నట్లు కానిపించుచున్నది పుట్టుకతో కొన్ని వచ్చుచున్నట్లు కానిపించుచున్నవి. దీని భావ మేమి? వేదాంత మీరెంటిని సమన్వయము చేయుచున్నది. మానవుడు చనిపోవునపుడు వానిలో కొన్ని భుక్తినొందని సంకల్పములుండును. అవి నశింపజాలవు. ఇక్కడ యొక మానవడొకవిధమైన సంకల్పములతో పుట్టెననుకొనుము అవి శూన్యమునుంచి వచ్చుట లేదు. ఇంతకు పూర్వమే పాతిపెట్టబడిన మానవునిలోనున్న భావములే, కామములే యీనూతనముగా పుట్టినవానిలో తిరిగి పుట్టుచున్నట్లు మన మేల యంగీకరింపగూడదు? అట్లైనచో వస్తువు శూన్యములోనికి పోవుచున్నది. శూన్యమునుండి వస్తువు పుట్టుచున్నది యను అసందర్భసమస్య నివృత్తి కాగలదు. ఇదియే కర్మసిద్ధాంతము. దీనివలన పుట్టుక, చావు అనున వెంత ప్రకృతిసిద్ధములో తేటపడగలదు.

ఇంకొకవిధముగా చూచినను మీ రీకర్మసిద్ధాంతము నంగీకరించవలెను. మరియొక తర్కముకూడ దీనికే ప్రోద్బలము నిచ్చుచున్నది. ఒకవిషయమును సులభముగా సహాజమైన, సామాన్యమైన, సూత్రములచే సాధించగలుగునపుడు

దాసని ... హాస్పదమై, తెచ్చిపెట్టుకొనిన
సూత్రే ... ుట న్యాయవిరుద్ధము.

... కలుగుచున్న విరోధభావములను వివి
ధశక్తులను మేము కర్మసిద్ధాంతముచే సాధించము. అవిపారం
పర్య అనగా తలితండ్రుల నుంచి వచ్చుచున్నవని మీరు చె
ప్పవచ్చును; శాస్త్రవేత్తలిట్లు వాదించవచ్చును. కాని కర్మ
సిద్ధాంతమునకును పారంపర్యకును భిన్నమేమియును లేదు;
విరుద్ధము లేదు. పైగా కర్మసిద్ధాంత మీ పారంపర్యసిద్ధాంత
మును స్థిరపరచుటే కాకుండ చనిపోవునపుడు మనకు పైకి
కాన్పించుచున్నట్టి మనశ్శక్తి నాశముకుకూడ నిది సాధించు
చున్నది. పారంపర్యము దీనిని సాధించజాలదు. కనుక కర్మసి
ద్ధాంతమీపారంపర్యము కన్న కూడ విశ్వసనీయము. గమ
నార్హము. కర్మసిద్ధాంతము పారంపర్యము నెట్లు బోధించుచు
న్నది? మానవుడు చనిపోవునపుడు చిత్తశక్తి నశించుచున్న
ట్లు పైకి కాన్పించుచున్నది. క్రొవ్వొత్తి కాలిపోవునపుడు
క్రొవ్వును, వత్తియు నశించిపోయినట్లు పైకి కాన్పిం
చినను యన్యోన్యాకర్షణ శక్తివలన వాటిలో నున్న
యుదజనియు, కర్బనమును ప్రాణవాయువుచే నా
కర్షింపబడి నూతనపదార్థములు తయారగుచున్నవి. అట్లే
యీకోరికలు, యీ సూక్ష్మశరీరము, మరణానంతర మిట్టి
యాకర్షణశక్తిచేతనే మరియొకదానితో కలియుచున్నవి.

క్రొవ్యాప్తిలోని పదార్థములు నైన ప్రాణ వాయువుతో మాత్రమే కలసిన వాటి యభివృద్ధి కనుకూలించు పరిస్థితులుగ కే యాక ర్షింపబడుచున్నవి. ఇట్లు భుక్తి కానట్టి కోరిక యును భుక్తి కొరకు తమ కనుకూలించు క్షేత్రమును వెతకికొనినవి.

ఈవిధముగా ప్రతిమానవుడు తన తల్లిదండ్రులను తానే నిశ్చయించుకొనుచున్నాడు. మానవుడు జీవించియున్న పుడు వాని కనేకకోరిక లుండును. అవి చాలవరకు వాని జీవి తములోనే భుక్తిని గాంచవచ్చును. కొన్నిమాత్ర మట్లే యుం డిపోవును వాటికి భుక్తి లేకపోవుటచే నవి నశించజాలవు. అనేమగును? తోటలో మొగ్గ కాన్పించినపు డది మరునాడు వికసించుచున్నది. పుష్పించుచున్నది. దానికోరిక సఫల మగు చున్నది. చీమలు మొదలగు క్షుద్రజంతువుల కోరికలుకూడ నెరవేరుచున్నవే! మానవుని కోరికలుమాత్రమే యేల ఫలిం చజాలవు? ప్రకృతి, దైవము, మానవునియేల పరిహాసిం చును? మన జీవితములో మన కోరికలు చాలవరకు ఫలించు టలేదా? మనకోరికలే కదా మనకార్యము లగుచున్నవి! అవియే కార్యము వెనుకనున్న మూలశక్తులు. కనుక భుక్తి నొందని కోరిక లేమి కావలెను? భుక్తినొందని నీకోరిక లన్నియు,నీమనశ్శక్తి యంతయు ఫలించి తీరవలెను. అవి యీ జన్మలో కానిచో మరియొక జన్మలో నైనను ఫలించక తప్ప వు. భుక్తియే వాటికి ముక్తి.

ఇక్కడ యుదయించుచున్నది మన
కు పూర్వజ చనిపోయినతరువాత ముందు
జన్మములుక మన కీవెనుక జన్మల జ్ఞాపక మేమి
యును లేకపోవుటకు కారణ మేమి ? జ్ఞాపక మనగా నేమి
యని మనము ప్రశ్నించుకొనవలెను. ఇప్పుడు రాముడు
మీతో విదేశభాషలో మాట్లాడుచున్నాడు. భారతదేశము
లో రాము డెప్పుడును యింగ్లీషుభాషలో మాట్లాడి యెరు
గడు. మీతో మాట్లాడునపు డతని మాతృభాషలోని యొ
క్కమాటయైనను జారదు. అంతమాత్రముచే నతని మాతృ
భాష నశించినదా ? లేదు లేదు. అది యతనిలోనే యున్నది.
అతను పెర్షియను అరబ్బీ మొదలగు భాషలలో మాట్లాడ
వలెనని సంకల్పించుచో నవన్నియు నొక్క త్రుటికాలములో
పైకి రాగలవు. కనుక జ్ఞాపకశక్తి యనగా నేమి ? మనలో
చిత్తసరము లేక సరస్సు కలదు. రామునిలో నున్న యీసర
స్సులో నిప్పుడు అరబ్బీ, పెర్షియను మొదలగు భాషలన్ని
యు అడుగుభాగమున చేరియున్నవి. కావలె నన్నచో నీసర
స్సు నొక్కసారి కదలించి వాటిని సరస్సు పైభాగమునకు
తెప్పించ వచ్చును. జ్ఞాపకమును తెచ్చుకొనుట యన నిదియే!
నీ వెన్నియో విషయముల నెరుంగుదువు. కాని యవన్నియు
ను నీజ్ఞప్తియం దిప్పుడున్నవా? లేవు. కాని నీచిత్తసరస్సునొ
క్కసారి కదలించుచో నీ వా విషయముల నీనిమిషములోనే

జ్ఞప్తికి తెచ్చుకొనగలవు. సర నను వచ్చుట తోడనే విషయములు మెదడుక

నీపూర్వజన్మము లన్నియును, జీవితములన్ని యును నీ జ్ఞానసరస్సుయొక్క యడుగుభాగమున స్థిరపడి యున్నవి. కావలెనన్న నీవు నీపూర్వజన్మవృత్తాంతములను జ్ఞప్తికి తెచ్చుకొనవచ్చును. అది యెంతమాత్రమును కష్టము కాదు. కాని అట్టిప్రయత్న మెంతమాత్రమును ప్రయోజన కారి కాదు. ఏలనన పరిణామసూత్రము ననుసరించి మన మందరమును పురోగమనమునే చేయవలెను. ముందుకే పోవ లెను. గతము గతమే ! దానిని త్రవ్వుట యనర్థము. నీ వీప్ర పంచములో చూచున వన్నియును, నీవు ప్రేమించు వస్తుస ముదాయ మంతయు, నిన్నాకర్షించు విశ్వమంతయు నీ వగు టచేతనే యట్లు చేయుచున్నా వని కూడ కర్మసిద్ధాంతము చెప్పుచున్నది. ఒకప్పుడు నీవు పర్వతరూపమును దాల్చి వా టిపై శయనించితివి ; నీవు నదీతోయములతో ప్రవహించి తివి ; పాదపములతో పెరిగితివి ; పశువులతో పరువె త్తితివి. వీటినే నీ విప్పుడు గుర్తించుచున్నావు. చూచుచున్నావు, ఈ సత్యమును మనము మరియొక వాదముచే గూడ సాధించవ చ్చును. జ్ఞాపకముంచుకొనుట, గుర్తెరుంగుట యనగా నర్థ మేమి ? జ్ఞాపకమునకు తెచ్చుకొను వస్తువును నీవు తత్పూ ర్వమే యెరిగియుండవలెను గదా ? ఇదివరకు నీకు తెలిసిన

వస్తువునే నీవిప ... చ్చుకొనగలవు. మీకొకయుదా

హరణమును ... రాము డుపన్యసించు యుపన్యా

సములకు వార ... జులనుండి యిద్దరు పురుషు లెప్పుడును

కలిసియే వచ్చుచుండిరనుకొనుడు. నీవు వారిద్దరను జంటగా

నే చూచుచున్నావు. గాని యొకమిదవరోజున యొకడేవచ్చు

ను రెండవవాడు రాకపోవుట స్నేహితులందరును యతడే

మయ్యెనని యడుగుదురు. మీస్నేహితు డెక్కడనున్నాడు?

రాలేదేమి? అని ప్రతివాడును ప్రశ్నించును. వారిట్లెందుకు

ప్రశ్నించుచున్నారు? వారిద్దరును యెప్పుడును కలిసియుండు

టచేతనే, అట్టిజ్ఞప్తి చేతనే, యీప్రశ్న వేయబడుచున్నది. మన

కెప్పుడును వారిద్దరును కలసి కాన్పించు చుండుటచే వారిద్దగును

మన మనస్సులో యొకరివలెనే యైక్యము నొందిరి. తరువాత

మనకు వారిలో నొకడే కాన్పించినపుడు వెంటనే రెండవాని

సంగతి జ్ఞాపకము వచ్చుచున్నది. మన మెదడులో నీవిధము

గా జ్ఞప్తి జనించుచున్నది. తత్పూర్వ మొకటియైననే కాని,

కలసియున్ననే కాని, జ్ఞప్తి కలుగజాలదు పూర్వము తెలిసి

యున్నకాని జ్ఞప్తి లేదు.

మానవులందరును మర్త్యులు అనగా మరణించువారు.
రాముడు మానవుడు. కనుక రాముడును మరణించవలెను.
మనుష్యులందరును మర్త్యులు, రాముడు మానవుడు అని చె
ప్పుటతోడనే వెంటనే, మన మేఫలితమును సూచించకుండ

గనే, జ్ఞప్తి వచ్చినట్లే రాము ...డే యనుఫలిత
ము దానంతట దే తేటపడుచున్న ... ఫలితమున
కెట్లు రాగలిగితిమి? మానవులందరు ...్యులు; రాము
డు మానవుడు రాముడు మర్త్యుడు అను మూడు యుపపాద
నలు కలవు మానవులందరును మర్త్యులు; రాముడు మాన
వుడు; అను రెండు యుపపాదనలను చేయుటతోడనే యెప్పు
డును కలసి కాన్పించుచున్న యిద్దరుస్నేహితులలో నొకస్నే
హితుడు రానప్పుడు వానిసంగతి యెట్లు జ్ఞప్తికి వచ్చుచున్న
దో, యట్టే మూడు యుపపాదనలలోను రెండు కాన్పించుట
తోడనే మూడవది జ్ఞప్తికి వచ్చుచున్నది. ఈజ్ఞాపకము త
త్పూర్వము వాని నెరిగి యుండుటవలననే కలుగుచున్నట్లు
మన మిదివరలో చూచియుంటిమి.

నీ వొకలెక్కను చేయుచున్నా వనుకొనుము. వెంటనే
నీకొకఫలితము వచ్చుచున్నది ఇది నీకుజ్ఞప్తివలననే వచ్చుచు
న్నది. ఈజ్ఞప్తియే ప్రతివానిమెదడునందును సహజముగా
నుండుటచే జ్ఞప్తిచే నీమెదడుకు తట్టునట్టి విషయముల నన్ని
టిని నీవు తత్పూర్వమే తెలిసికొని యుంటివని తేలుచున్నది.
ఇట్లు నీకు జ్ఞప్తికివచ్చు విషయములను తత్పూర్వమే నీవు తె
లిసికొని యుండవలెను గదా నీవు వాటినెప్పుడుపఠించితివి!
నీవెప్పు డీజ్ఞానమును సంపాదించుకొంటివి? నీ కీజ్ఞానము నీపూ
ర్వజన్మములలో కలిగిన దని వేదాంతము చెప్పుచున్నది.

అయ్యో! మనవి, మే కారకుల మైనచో మనమే యజమానులమైనచు, మేమెవరమును బీదవారము కావవలెనని యెన్నడును కలలోనైనను కోరుకొనియుండమే! మే మెట్లు గర్భదరిద్రులమై పుట్టితిమి ? అని యడుగవచ్చును. మీరు సత్యమునంతను పూర్తిగా యోజించవలసియున్నది. అర్ధసత్యములపై నాధారపడక విషయముల నన్నిటిని చక్కగా గ్రహింతురు గాక! సత్యము నన్నివైపులనుండియు మీరు కూలంకషముగా పరీకించవలెను. నిజముగా ప్రతివాడును జర్మనుచక్రవర్తి కావలెనని సహజముగా యాశించునా ? ప్రతివాడును కోటీశ్వరుడు కావలెనవి కోరుచుండునా? అట్లు జరుగుటలేదు నెలకు రు 30 లు సంపాదించుకొనువాడు సహజముగా యే 40 లేక 50 రూపాయల కొరకో యాశించును. అత డెప్పుడును జార్జిచక్రవర్తి పదవి వాంఛించవలెనని కోరుట లేదు. మీ యనుభవము మీకేమి చెప్పుచున్నదో యొకసారి చూచుకొనుడు !

మీరు మరియొకవిషయమునుకూడ యోజించవలెను. సాధారణముగా ప్రజలకోరికలన్నియు నసంబద్ధముగా నుండును. ఆకోరికల కొక తల తోక యుండక అవకతవకలుగా నుండును. వారు తమకోరికలను తమ పరిస్థితులతో సమన్వయింపజాలరు. వారు తమకోరికలకు బానిస లగుచున్నారే కాని యజమాను లగుటలేదు. కనుక వారు తమకోరికలచే

తనే యనేక బాధలకును, దుఃఖములు విచారములకును లోనగుచున్నారు.

పశువులవలె కేవల విషయలాలసు లైనవారు మనలో కొంద రున్నారనుకొనుడు. అట్టివారికి జ్ఞానసముపార్జన మవసరము లేదు మఱియు, 'నీతి' ఆధ్యాత్మికములు, కీర్తి, ప్రేమ ప్రతిష్ఠలు మొదలైనవాటిచేంతకు వా రెంతమాత్రమును పోరు. ఈ విషయములు వారికి సుతరాము పనికిరాని వగును. తమలో నున్న పశుస్వభావభుక్తినే యీవృకోదరులు కోరుచుందురు. ఇంద్రియలంపటత్వమే వీరి పరమావధి. ఇట్టివారు చనిపోవుదురు. వారి కోరిక లట్లే యుండును. అప్పుడు వీరి కెట్టి తల్లిదండ్రులు సంప్రాప్తమగుదురు? వారి కోరిక లీడేరవలెనన్న వారు పండితకుటుంబములో పుట్టనక్కర లేదు. వారి మనోభీష్టము లెవియును తదభివృద్ధికొరకు శ్రీమంతులకుటుంబము నాశించుట లేదు; నాగరికతగల వంశమక్కర లేదు. దీనికి వేదాంత మేమిసమాధానము నిచ్చుచున్నది. ఇట్టివారికి సూకరదేహమో, శునకదేహమో చాల యనుకూలముగా నుండును. రాత్రింబవలులు తినుచున్నను విసుగు, విరామము చెందని యట్టి శరీరములు కాక మరేవి వారి కోరికల కనుకూలముగా నుండును? ఈవిధముగా మానవులు సూకరములైనను, శ్వానములైనను తమ విధికితామే యజమాను లగుచున్నారు.

ఈ ప్రపంచ ఖాసు లందరును తమ కోరికలచే తమ కోర్కెఫలితములు సంభవించునో, తమ స్థితికి పోదురో యూ వంతైనను యాలోచింపక యట్టివి తటస్థించినపుడేడ్చుట, తమ విధిని దూరుట, రొమ్ములు బాదుకొనుట, దంతములు కొరుకుకొనుట, పెదవులు విరచుకొనుట, తమ నక్షత్రములు మంచివికావని దూరుట మొదలగు యశక్తిదుర్జనత్వమును చూపుదురే కాని యిదంతయు తమ కామముల ఫలితమే యని గ్రహింపకున్నారు!

భారతదేశమున నొక కవి యుండెను. అతడు మహాబుద్ధిశాలి; నిపుణవచనములచేతను, హాస్యరస వృష్టిచేతను నెత డెట్టివారినైన యానందాబ్ధి నోలలాడించగలడు. అతడొక రాజువద్ద యాస్థానకవిగా నుండెను. ఒకనాడత డారాజు కనేకాద్భుతహాస్య రసభరితములగు కథలను చెప్పుచుండ రాత్రి చాల పొద్దుపోయెను. రాజు యింటికిపోయినతరువాత కూడ నా కథలలోని చమత్కృతిచే నిద్రనుకూడ మరచిపోయెను. అతని రాణి యిదంతయుచూచి మీరు నే డేల యింత పొద్దు చేసిరి? ఇంకను నిద్రపోకున్నదేమి? అని ప్రశ్నించెను. ఆ రాజు రాణికా కవివృత్తాంతమును చెప్పి యతని చమత్కృతిని, చిత్రవిచిత్రకథలను వర్ణించుచు మరింత పొద్దుబుచ్చెను. ఆ రాణి యా కవిచమత్కృతిని, చిత్రకథలను తానుకూడ విని యానందించవలెనని యతనిని తన రాణివాసమునకుగూడ

గొనిరమ్మని రాజును వేడుకొనెను. మరునా డాకవి రాణివా సమునకు తీసికొని రాబడెను. అతడు రాణివాసమున తన కవిత్వమును, చిత్రకథలను నతిశ్రావ్యముగ తన మనోహర కంఠము నెత్తి గానము చేసెను. అప్పు డాకవి తనకు నేత్రరోగము కలదనియు, నంధుడననియు చెప్పుకొనెను. కాని అతడు నిజముగా యంధుడు కాడు. తా నంధుడ నని చెప్పుచో రాణివాసమున తన యిచ్చవచ్చిన ట్లుండవచ్చుననియు, అంతఃపుర స్త్రీలందరును అంధుడగుటచే నట్టివానివల్ల తమ కేమియు మోసముండదని విశ్వసింతురనియు, వా రతనివద్దకు ఘోషా లేకుండగనే వచ్చుచు పోవుచుందురనియు, వారి యంతఃపుర విస్రబ్ధసంభాషణలనన్నిటిని తాను వినవచ్చుననియు, నతడట్టి రోగము నభినయించెను. అతడు గ్రుడ్డివాడని యెంచి రాజత నిని రాణివాసమునకు బోవుట కనుమతించెను. కాని సత్యము బయటపడకుండు టెట్లు? పాతాళమున కణగద్రొక్కబడిన సత్యము ద్విగుణీకృత వేగమున తలయెత్తకుండునా? అనంత కాలవాహిని సత్యముయొక్క నాటకరంగము కాదా?

ఒకనా డీకవి యొక యంతఃపురపరిచారిక నేదియో వస్తువు తెచ్చిపెట్టుట కాజ్ఞాపించెను. కాని యాపరిచారిక తనకు తీరికలేదనియు తా నింకొక పనికి నియోగింపబడె ననియు చెప్పెను. అప్పు డతడు మరియొక పరిచారిక నాపని చేయుమనెను. అప్పు డామె 'యిక్కడ కుర్చీ లేదు' అని బదు

లుచెప్పెను. నా కొకచెంబుతో నీరు కావలెనని యితడు తిరుగ యడిగెను. ఇక్కడ చెంబు లేదు. మరియొకచోటకు బోయి తెచ్చెదనని యామె చెప్పెను. 'అదిగో! అది చెంబు కాదా! లేదనెదవేల' యని అతడు ఆతురతతో తననుతాను మరచిపోయి యామెపై కసరుకొనెను. చూచితిరా! సత్యమిట్లే యబద్ధపుకోరులను గాడిదలను చేయును! ఆమాట వినుటతోడనే యాపరిచారిక నీరు తెచ్చుటకు బదులు వాని గుట్టును, వాని ద్రోహచింతను రాణికి కెరిగించెను. "అతడు గుడ్డివాడు కాడు. అతడు కుటిలాత్ముడు. అతనిని యంతఃపురమునుండి సాగనంపవలెను." అని యామె నిజవృత్తాంతమును చెప్పగా వెంటనే యతని నచ్చటనుండి పంపివేసిరి.

చిత్రము! ఇట్లు జరిగిన మరిమూడుదినముల కతని కండ్లు పోయెను. అత డంధుడైపోయెను. దీనికి కారణమేమి? అత డేలయంధుడయ్యెను? అతని యిచ్ఛచేతనే యత డంధుడయ్యెనని కర్మసిద్ధాంతము చెప్పుచున్నది.

తన విధి కతడే యజమానియయ్యెను. మరెవరును యితనిని శపించియుండ లేదు. అంధత్వము నిట్లు తెచ్చిపెట్టుకొనిన తరువాత నతడు రోదనముచేయును; రొమ్ముల బాదుకొనును; నేలబడి యేడ్వసాగును. ఏమిలాభము!

ఒక వృద్ధుడు తననెత్తిపై పెద్ద కట్టెలమోపు నొకదానిని గొంపోవుచుండెను. అతడు జరాభారముచే కృశించి

యుండెను. పైగ జ్వరపీడితుడయియుండెను. సూర్యు డాకస వీధిని తీక్ష్ణజ్వాలలను ప్రసరింపజేయుచుండెను. అత డెంతయో డస్సి యొకచెట్టునీడను చేరి కట్టెలమోపు నచ్చట పారవైచి యున్నరసుచు "ఓమృత్యుదేవతా! రమ్ము! రమ్ము! నీవు వచ్చి నన్నీల యీభారమునుండి తప్పించజాలవు." అని మృత్యువు నాహ్వానించెను అంతలో మృత్యుదేవత ప్రత్యక్షమయ్యెను; అత డాకాల నికృతాకారమును, భయంకర దృశ్యమును చూచి గడగడవణకుచు నీ వెవడవని ప్రశ్నించెను. "నేను నీవు పిలిచినయముడను; కాలుడను. నీవు నన్ను పిలపించితివి కనుక నీ కోర్కె నీడేర్చుటకే నేను వచ్చితిని" అని మృత్యుదేవత యనెను అప్పు డాముదుసలి భయకంపితుడై, అయ్యా! నిన్ను నేను నాప్రాణములను తీయుటకు పిలువలేదు. ఈకట్టెలమోపును నా నెత్తిపై పెట్టుటకే నిన్ను పిల్చితిననెను.

ప్రజ లిట్లే చేయుచుందురు. నీబాధలు, నీదుఃఖములు, నీవిచారములు, నీమనోవ్యధలు-యివన్నియును నీయాహ్వానముల నంగీకరించియే వచ్చుచున్నవి. వీటి కన్నిటికిని నీవే యాజమాన్యమును వహించి యవి సంభవించునప్పుడుమాత్రము విచారించుచున్నావు. మృత్యువు నాహ్వానముచేసి యది వచ్చుటతోడనే విచారసాగరమున మునుగుచున్నావు. ఇది యసంభవము. కర్మ ననుభవించుట తప్పునా ? ఒకవస్తు

వుకు కిమ్మతు చెల్లించిన తరువాత దానిని తీసికొనక తప్పునా? వేలములో నీవిక్కడ పాటదారువైనపుడు వస్తువును కొనక తీరునా? గుఱ్ఱము పరువెత్తునపుడు బండి యనుసరించకుండు టెట్లు? నీవు నీకోరికను వెలిబుచ్చినపుడు దానిఫలితమును స్వీకరింపకుండు టెట్లు? సాధారణముగా మానవులు వృద్ధాప్యములో చనిపోవుటకు కారణమేమి? యౌవనములో కొద్దిమంది మాత్రమే చనిపోవుదురు. వృద్ధాప్యము వచ్చుటతోడనే శరీరములు వ్యాధిగ్రస్తమగును. వారు వ్యాధిచే దుర్బలత్వమునకును, మనఃక్లేశములకును లోబడి మృత్యువును కోరుచుందురు. మృత్యువు వారి యాహ్వానము నంగీకరించును. కనుక నీచావును నీవే తెచ్చిపెట్టుకొనుచున్నావు. ఇదియును నీయిచ్ఛాధీనమే! ప్రతివాడును ఆత్మహంతకుడే! యని వేదాంతము చెప్పుచున్నది. నీవు కోరుటతోడనే మృత్యువు వచ్చుచున్నది. యౌవనములో కొందరు చనిపోవుచుండుటకు కారణమేమి? రాము డట్టి యనేకమంది యువకుల యాంతరంగికజీవితములో పరిచయమును కలిగి యుండెను. అతడు వారి జీవితరహస్యములను పూర్తిగా తెలిసికొనెను; వారి ననేకవిధముల పరీక్షించి చూచెను. నిజముగా యీ యువకు లందరును తమ హృదయాంతరాళమున మృత్యువు నాహ్వానముచేసిరి. వారు తమ పరిస్థితుల కెంతయు దుఃఖించి వాటితో ప్రాణము విసిగి యది యెట్లైన మారిన చాలునని.

కోరుకొనిరి. కావలెనన్న మీరును యిట్టిపరీక్షను చేసి సత్య మును తెలిసికొందురుగాక !

భారతదేశమున నొక కలాశాలలో ధీమంతుడైన పండితు డుండెను అతడు తన జీవితమునంతను తన సర్వస్వమును, ఆకలాశాలకొరకర్పించి తత్కలాశాలాభివృద్ధికి పాటుపడుచుండెను. ఇంతలో నతని దృష్టిమారిపోయెను. అది యొక మతమునకు చెందిన కలాశాల. అతని హృదయము వికసించెను; మనస్సు విశాలమయ్యెను. భావములు పరిపక్వము నొందెను. ఇట్టి స్థితిలో నతడు ప్రత్యేకమతమునకు చెందిన కళాశాలలో, వాక్షికదృష్టికలవారితో కలసి పనిచేయుయుట యసంభవమయ్యెను తోడిపండితుల కితనిచూచిన కష్టముగా నుండెడిది. ఇట్లు వారెంత కాలము బలవంత వాహాచర్యమును చేయగలరు. తన జీవితము నంతను దానికొరకే ధారపోసెదనని యతడు వాగ్దానముచేసెను. దానిని భంగపరచు టెట్లు? అతని హృదయ మొకచోట నుండెను. శరీర మిక్కడ చిక్కుకొనెను. శరీరహృదయములు విడివడియుండు టసంభవముకదా ! అతడు చనిపోయెను. అతని పరిస్థితులింకొక విధముగా మారుట యసంభవమగుటచే మృత్యువే యాపనికి బూనుకొనెను. చూచితిరా ! మృత్యువు మనము కోరుటచేతనే వచ్చును. దూరదృష్టితో యోచించిన నది మన మనుకొను నట్లు పెనుభూతము కాదు. పిశాచముకాదు.

నీపరిస్థితులకును, నీవిధికిని నీవే యజమానివి. ప్రజలు దుఃఖముల పాలగుటకు కారణమేమి ? వారిని కష్టములేల యెదుర్కొనుచున్నవి ? వారి కామనుల యన్యోన్య సంఘర్షణమే దీనికి కారణము. నీవొక పనిని చేయువట్లు కొన్ని కామములు ప్రోత్సహించును. మరికొన్ని కామములు తద్విరుద్ధమైన కార్యాచరణకు గడంగ ప్రోద్బలము చేయును. రెండువిధములైన కోరికలు నీలోనుండును. కొన్నికోరికలవలన నొకకవి, వక్త, పండితుడు, మతబోధకుడు లేక మరేవిధమగు ప్రజాసేవకుడో కావలెనని యుండును. మరికొన్ని కామములు వీటన్నిటిని విడనాడి యింద్రియలోలత్వమును బలపరచును అప్పుడేమిజరుగును ? రెండుకోరికలును సిద్ధించవలెనుగదా ! ఒకటి యీడేరవలెనన్న రెండవదానికి స్వస్తి చెప్పవలెను. కనుక నదియొక బాధ. రెండువది సిద్ధించిన మొదటిది సిద్ధించదు కనుక నదియును విచారకారణమే ! ప్రజల కష్టము లిట్లే సంభవించును.

భారతదేశమున నొక డిద్దరుభార్యలను వివాహమాడెను. ఒకభార్య మేడమీాద నివసించుచుండెను. రెండవభార్య మొదటియంతస్థులో నివసించుచుండెను. ఒకనా డొకదొంగ వారియింట బ్రవేశించెను. అతడు యావదాస్తిని దోచుకొనిపోవలెనని సంకల్పించెను. కాని రాత్రియంతయు యింటిలోనివా రెవరును నిద్రపోకుండుటచే వాని కేమియు

ను చిక్కకపోయెను. అత డేమియు తోచక కొట్టుమిట్టులా డుచుండగా బల్లున తెల్లవారెను. ఇంటిలోనివారి కాదొంగ కట్టుబడెను. వానిని మేజిస్ట్రేటుకోర్టునకు తీసికొనిపోయి పోలీసు కేసుచేసిరి. అత డేమియును దొంగిలించలేదు. కాని కన్నమును త్రవ్వి లోపల ప్రవేశించెను. ఈయపరాధమున కతడు దండనార్హుడని మేజిస్ట్రేటు నిశ్చయించి యతనికి శిక్షను విధింపబోవుచుండగా నత డిట్లనెను. "ప్రభూ! మీరు నాకెట్టిశిక్షనైనను విధించవచ్చును. నన్ను చీకటికొట్టులో పెట్టించుడు; కాకులకును గద్దలకును పారవేయించుడు; నాశరీరమును తగులపెట్టించుడు; మీ రేమి చేసినను సరేకాని నాకొక్కశిక్షను మాత్రము విధించవ"ద్దని యత డామేజస్ట్రేటును వేడుకొనెను.

మేజిస్ట్రేటు ఆమాటల కాశ్చర్యపడి ఆశిక్ష యేమిటని యడిగెను. "ప్రభూ! నన్నుమాత్ర మిద్దరుభార్యలకు భర్తను చేయవద్దని మిమ్ము వేడుకొనుచున్నాను. నా కాశిక్ష కలనైనను యుండకుండునుగాక" అని యతడనెను. మేజిస్ట్రేటు కాశిక్షబోధపడక యట్లందువేమి? అది శిక్ష యెట్లగునని ప్రశ్నించెను. అప్పు డతడు తను పట్టుబడిన యుదంతము నిట్లు చెప్పెను. "నే నొకచోటనక్కి దొంగిలించుటకు వేచియుంటిని. కాని యజమాని రాత్రియంతయు నామేడమెట్లమీదనే చిందులు త్రొక్కుచుండెను. అతనిని మొదటిభార్య మే

డపైకి రమ్మని రెక్కపుచ్చుకొని లాగుచుండెను. రెండవ భార్య క్రిందకురమ్మని కాలుపట్టుకొని యీడ్చుచుండెను. ఈకొట్లాటలో యతనితలవెండ్రుక లన్నిటిని యూడబెరికిరి. కాలి మేజోళ్ళను చింపి ముక్కముక్కలుచేసిరి. పాప మీశీతకాలపురాత్రియంతయు నతడు వడవడ వణకుచుండెను. ఈవిధముగా నేను పట్టుబడితిని. నాకు దొంగిలించుట కవకాశమే లేకపోయెను.” మీకష్టము లన్నియును, దుఃఖము లన్నియును, మీకోరికలలోని యన్యోన్యసంఘర్షణచేతనే జనించుచున్నవి. మీకోరికలలో వైరుధ్యమే కాని సామరస్యముండదు. అవి పరస్పరము పోరుచుండును. గృహకల్లోలము బయలుదేరినతరువాత గృహము నిలుచునెట్లు? కనుక హృదయపరిశోధనము గావించుకొనుడు. మీమనస్సులను పరీక్షించుకొనుడు. అచ్చట మీకేమైనను శాంతికలదా? మీ రేక లక్ష్యమునే కలిగియున్నచో, ఏక కార్యదీక్షనే వహించుచో మీసంకల్పము లీడేరును. మీ కెట్టిదుఃఖములును సంభవించజాలవు. మీలో నాసామరస్యము లేనిచో కొంపకూలుట తప్పదు; విచారములు మిమ్ము పట్టి పల్లార్చును.

కనుక మీవిధికి మీరే యజమానులు. ఒకనికి నీచాశయములును, ఉదారాశయములును కూడ యుండవచ్చును. ఈరెంటికిని పోరుజరుగును. కాని విశ్వపరిణామసిద్ధాంతము ననుసరించి యీపోరాటములో నర్హతగలదానికే జయము

చేకూరును. అదియే పరిక్రుతి నిధానము. ఏది బలవత్తరమై నదో యదియే జయించును. కాని బల మెట్లు చేకూరుచున్నది? దేనివలన కలుగుచున్నది? వేటిలో సత్య మెక్కువ యుండునో, యేవి న్యాయ, ధర్మబద్ధములో, యేవి పవిత్రములో, యేవి బ్రహ్మప్రతిపాదకములో యట్టికోరికలే జయించును. ప్రతివాడును ప్రాణాంతకము సంభవించినను యభివృద్ధిని పొందితీరవలెను. నీవిల్లపుడును విషయానురక్తుడవై పడియుండజాలవు; స్వార్థపరత్వమే నీపరమావధి కాజాలదు. కుక్షింభరత్వమే మోక్షము కాదు; నీవు క్రమముగా, విధాయకముగా యభివృద్ధిని గాంచవలెను.

ఇదియే ఆనందము. ఈకర్మసిద్ధాంతమే ప్రతివానికిని యానందము నొసగూర్పజాలినదై యున్నది.

మీకోరిక లెందుకు సఫలము కావలెను! అమృతత్వమే నీయథార్థతత్త్వమని వేదాంతము చెప్పుచున్నది. నీయాత్మ అమృతము రాముడు భగవంతుడే! అతడమృతుడు. నీకోరికలు, నీమనస్సు, నిశరీరము—యివన్నియును సనాతన సత్యసలిలములలో తరంగములు, చిన్న చిన్న కెరటములు. కనుక నీ వేతత్త్వముతో చేయబడితివో యాతత్త్వమే వాటి యందును యావన్మాత్రము కలదు. ఆపరాత్పరుడే యావిశ్వమునంతను తన యుచ్ఛ్వాసముగా చేసినాడు; విశ్వమంతయు నాయుచ్ఛ్వాసమే! కనురెప్పపాటుకాలములో నే నీవిశ్వ

మును సృష్టించితివి. నీవును నీకనురెప్పపాటు కాలములో నీవి శ్వమును సృష్టించుకొంటివి. మనకోరిక లన్నియును కొంత యీబ్రహ్మత్వ తత్త్వమును, కొంత కించదహంకారతత్త్వము ను కలిగియున్నవి. ఈబ్రహ్మతత్వమున్న కారణముచేతనే మన కోరికలు సఫలము కావలసివచ్చుచున్నవి. కాని మాయ నాధారముచేసికొనివచ్చినకోరిక లీకార్యసాఫల్యమున కడ్డు తగులుచున్నవి. కోరికలలో బ్రహ్మతత్వ మెట్లున్నది ? అని నీ వడుగనచ్చును. కోరిక లనగా ప్రేమయే! ప్రేమయన భగ వంతుడే! కోరికలన్నియు ఆకర్షణశక్తినంటివి. ఆకర్షణశక్తి అన గా నేమి? భూమి చంద్రుని యాకర్షించుచున్నది సూర్యుడు భూమి నాకర్షించుచున్నాడు. ఒకగ్రహము మరియొక గ్రహ ము నాకర్షించుచున్నది. ఒక పరమాణువు మరియొక పర మాణువు నాకర్షించుచున్నది. ఇదియే విశ్వప్రేమ. ప్రేమ తత్త్వము. అణువుల నన్నిటిని బంధించుచున్న శక్తి యేది? ఒక యణువు మరియొకయణువు నాకర్షించుచున్నది. నీవు దాని నాకర్షించుచున్నావనగా దానిని కోరుచున్నావని యర్థము. ఆకర్షణ మంతయు కోరికే కాని మరియొకటి కాదు. కనుక కోరి కలలో బ్రహ్మతత్త్వమున్నది ఈతత్త్వముచేతనే యవి సాఫల్య ము నొందవలసివచ్చుచున్నది. ఆకోరికలే స్వార్థపరత్వ ప్రేరి తములైనపుడు, అనగా మాయచే నావరింపబడినపుడు తత్సి ద్ధి యాలస్యమగుచున్నది కనుక నీకోరిక లన్నియు నీదేరవ

లెనన్న, మాయను స్వార్థపరత్వమును తగ్గించవలెను. దానిని లేకుండ చేసి బ్రహ్మతత్త్వమును వృద్ధిచేయవలెను. అప్పుడు సంకల్పసిద్ధుడ వగుదువు. నీకోరిక లన్నియు ఫలించును. నావిధికి నేనే యజమానినని నీవొకసారి గ్రహించునపుడు నీకు పరమానందము చేకూరుట లేదా! కండ్లుమూసికొని ఓంకారమును ధ్యానించుచు నావిధికి నేనే యజమానిని; నేనే ప్రభువును, అని నీవు గ్రహించునపుడు దుఃఖములకును, ఏడ్పులకును, పెడబొబ్బలకును తా విచ్చలనుండును! నీపరిస్థితులను నీవు దానితో మార్చుకొంటివి. నీప్రభుత్వమును గ్రహించుము. నీపరిస్థితులకు నీ వెన్నడును బానిసవు కావని గ్రహించుము. నాపరిస్థితు లెట్టివైనను, నాగృహస్థితి యెట్లున్నను, ఈశరీరము కారాగారమున బంధింపబడినను, ప్రవాహాంతరంగములలో కొట్టుకొనిపోవుచున్నను, రాక్షసపదఘట్టనచే చూర్ణీకృత మగుచున్నను మరేమైనను సరే నేను బ్రహ్మమును; నాపరిస్థితులకు యజమానిని. నేను శరీరమును కాను. నేను నావిధికి ప్రభువును. నాస్నేహితు లందరును మత్కృతములే; నేను శత్రువు లనుకొనువారందరును నాసృష్టియే! నాకోరికయే నాకొరకు వీరిని సృష్టించెను. ఓస్నేహితులారా! మీరు నాసంకల్పస్వరూపులే! ఓశత్రువులారా! నాసంకల్పసిద్ధికొరకే మిమ్మును నేను సృష్టించుకొంటిని! ఈసత్యమును మీరు గ్రహించుడు! మీరు బ్రహ్మానందము నను భవింతురు.

అనుభవ పరిజ్ఞానము.

"శ్రద్ధరహితమైన వర్ధజీవితము నొక్క నిముసమైనను గడపువాడు తనశ్మశానమున కొకయడుగు ముందుకు వేసినవాడగుచున్నాడు."

పాండిత్యము వేరు పరిజ్ఞానము వేరు. అవి రెండును యొకటే కాజాలవు. అవెల్లపుడును సంయోగమును కలిగి యుండవు. పాండిత్యము భూతకాలముకొరకు వెనుకకు చూచును. పరిజ్ఞానము భవిష్యత్తుకొరకు ముందుకు వీక్షించును. మన భావికర్తవ్యకర్మను తెలియజేయునదే పరిజ్ఞానమని నిర్వచింపబడుచున్నది. దాని నాచరించుటే సుకృతము.

సుకృతము లేని పరిజ్ఞానము బరువుచేటు కాని కోరిక కార్యముగాను, శాస్త్రము కళగాను, జ్ఞానము శక్తిగాను యెట్లు రూపాంతరమును జెందునో యట్లే పరిజ్ఞానముకూడ సుకృతముగా మారగలదు. భావము క్రియగాను, యుపదేశము లాచరణగాను యెచ్చట మారుట లేదో యచ్చట మానసికాజీర్ణవ్యాధి లేక యాధ్యాత్మిక మలబద్ధము విధాయికముగా సంభవించుచున్నది. ఒకకవి యిట్లు వ్రాయుచున్నాడు. "నేను మనుష్యులను, విషయములను తఱచి తఱచి చూచితిని. ప్రజలు తమ ప్రార్థనలను క్రమక్రమముగా నాచరణకు పెట్టనిచో నట్టి ప్రార్థనలవలన లాభమే లేదు. నీ వేదైనను కావలెనని యం

తఃకరణశుద్ధిగా కోరెదవేని చేతులు జోడించుకొని వెక్కి వెక్కి యేడ్పులు యేడ్చుచు బీహార్పు లార్చిన నిమవా రెవరును లేరు నడుముకట్టి పురుషకారమును చూపుము."

బాహ్యపరిస్థితుల నవలోకించి యోగ్యములు ప్రమాదరహితములు నైన మార్పులను చేసికొను శక్తియే జ్ఞానమునకు ప్రధానలక్షణము. అవసరములకు తగినట్లు కార్యములను మార్చుకొనలేకపోవుటే యజ్ఞానము. 'మార్పు లేక నాశము" ఇదియే ప్రకృతియొక్క భీషణవాక్యము. అభివృద్ధిచెందుచున్న యీకాలముతో నీవును ముందుకు పోవలెను. అప్పుడే యీ జీవితపోరాటములో నీవు జీవించియుండగలవు. (భారతదేశమా! నీవు దీనిని గమనించవలెను )

శ్రీకృష్ణుడర్జునునకీపరిజ్ఞానమును గురించి యిట్లు సూత్రప్రాయముగా చెప్పియుండెను. "నీకు కర్మచేయుటకు మాత్రమే యధికారము కలదు; కర్మఫలితములపై నీ కెట్టి యధికారమును లేదు. కర్మఫల మెన్నడును నిన్ను బంధించకుండునుగాక! అట్లని యకర్మకు నీ వెప్పుడును బానిసవు కాకుండుదువుగాక! ఈయోగము నభ్యసించి కర్మను చేయుము. ధనంజయా! సక్తతనుమాత్రము దరికి రానీయకుము. ఫలాఫలములు రెంటియందును సమత్వమునే చూపుము. జయాపజయములు రెండును నీకు సమమే! సమత్వమే యోగము"

యుద్ధరంగమున ప్రవేశించుము; అదియే నీధర్మము! కాంతుడు ప్రేయసిని ప్రేమించునట్లే నిజమైన యోధుడు కర్మను వరించును. ఆహావరంగమున మడసెదవా నీవు సత్య దేవతకు యశస్సును చేకూర్చెదవు. (అర్హులైనవారు జీవించుటే విశ్వపరిణామసూత్రముకదా) నీవే జయింతువేని నీద్వారా, అక్కడును సత్యమునే ప్రకాశింపచేయుదువు. జయశీలుడ వగు నీవే సత్యముకాని యాహావరంగమున నశించు నీశరీరముగాని మరేశరీరముగాని సత్యము కాదు. నీవెప్పుడును జయశీలుడవే! సత్యములు స్వయం ప్రకాశకములు; కనుక నీవును నీజీవిత శక్తివలె స్వయంప్రకాశకుడవు కమ్ము! స్వయంజ్యోతి వగుము. చనిపోయెదవా వీరస్వర్గము నలంకరించెదవు! జయించెదవా పృధ్వీతలమునకు సార్వభౌముడ వగుదువు! కనుక ధనంజయా! లెమ్ము! యుద్ధసన్నద్ధుడ వగుము లాభాలాభములు, సుఖ దుఃఖములు, జయాపజయములు నీకు సమములే! అవెన్న డును నీకు లేనేలేవు! ఈభావముతోనే యుద్ధమును చేయుచో నీకు పాప మెన్నటికిని సాధించదు"

ఆధ్యాత్మికాభివృద్ధియే యథార్థజయము కాని బాహ్య లాభనష్టములు కావు. కనుక జయ మెంత శుభోదర్కమో యపజయముకూడ నంత శుభప్రదమే!

ఓ మంగళాశయపరవతంసమా! నీ వీవిశ్వకేళీరంగ మున నున్నాడవు. సాగింపుము! అనవరతకేళిని సాగింపుము!

మానవుని యెన్నికష్టము లెదుర్కొనునో యతని శీల మంత సాన పెట్టబడును.

ఈ భూతలస్వర్గమును నరకప్రాయముగా చేయునట్టి కష్టపరంపరల నాలింగనము చేయుము; కష్టములన్నియు నిన్ను పాతాళమునకు క్రుంగదీయుటకు గాని, లేక కొరమాలిన కొయ్యవలె చైతన్యహీనుని చేయుటకు గాని కాక నిన్ను ముందుకు పోడుచుటకే యని గ్రహించుము. మాదువంతులు దుఃఖములే నీసుఖములగునుగాక! సాగింపుము! యుద్ధమును సాగింపుము! బాధను నిగ్రహించుము; తెలిసికొనుము; అభివృద్ధిగాంచుము; కష్టములను సరకుచేయకుము. సాహసించుము. దెబ్బలను సహించుము. చిత్ర మిచ్చటనే కలదు. ఈయద్భుతము నీకేగోచరము కాగలదు. అపజయము కాన్పించినచోటనే జీవితములో జయము కలదు. ఇది హాస్యాస్పదముగా గాన్పించినను యాత్మానందము నొసగును.

సూక్తులు, నీతులు, సూత్రములు, ప్రమాణములు 'ఇది చేయుము' 'ఇది చేయరాదు' అను నిర్బంధవిధులు మొదలైనవి బుద్ధిపూర్వకముగనో యబుద్ధిపూర్వకముగనో బ్రహ్మాభావమందకుంతితవిశ్వాసము నుంచనివారిపట్ల నిష్ఫలములు. చైతన్యవిహీనమైన శవముయొక్క కాలికండరమునో చేతికండరమునో కదలించి బూటకజీవితము నుత్పాదించు విద్యుచ్ఛక్తివలె నివిబాహ్యవిధానములు. ఛాందసప్రకరణములును,

మెట్టవేదాంతమును విడిచి యాంతరంగికానుభవసత్యములను ద్యోతకపరుచుటే పరిజ్ఞానలక్షణము.

"బలవంత మెప్పుడును బలవంతమే! దానికి యథార్థ బలము చేకూరదు." ప్రేమచే నిర్మింపబడని గృహము సైకత గృహము.

మహాత్ముల యద్భుతకార్యము లెప్పుడును 'పరిశ్రమ ఫలితములే' యనుమాట సత్యము కాని యితరుల దృష్టిలో నేది యపరిమితబాధ నొసంగు పరిశ్రమయో యది మహాత్ముల దృష్టిలో మాత్ర మానందమే యగుచున్నది. 'నేను అను స్వార్థకించదాత్మతో' చేయబడు చైతన్యరహిత, రసవిహీన గార్దభకర్మ మన కవసరము లేదు. కర్మ దానంతటదే యాత్మసాధనమైన నీద్వారా జరపించుకొననిచో నీగాడిద మోత యంతయు నిరర్థకము. పేరుప్రతిష్ఠల నాశించు యసత్యకించదాత్మచే నీడ్వబడు రసవిహీన నిరర్థక కృషినే శంకరుడు శానిసత్వ మని నిర్వచించెను.

ఒకపిల్లవాడు హుషారుగా యీల వేసికొనుచుపోవుచుండును. ఒకి పోలీసు వానిపై కన్నెఱ్ఱజేసెను. అప్పుడాపిల్లవాడు 'నే నీలను వేయుచుంటినా? లేదు. దానంతటదే యీలవేసికొనుచున్న'దని బదులు చెప్పెను!

కోయిల యూకసవీథుల నంటు సాలతరుశాఖలపై నధివసించును. వెంటనే ముద్దులొలుకు పికరుతము లంబరవీధిని ప్రతిధ్వనించును. ఇట్లే కించదాత్మను విశ్వాత్మలో హోమము చేయుము. సచ్చిదానందముతో నీయైక్యమును గ్రహించుము. వెంటనే యానందప్రవాహ మానంద వీరకర్మకలాపముగా ప్రకటిత మగును. ఇదియే ప్రబోధజీవితము; ఇదియే నీజన్మ హక్కు.

"తనలో తా నాత్మానందమును కనుగొనుట బహు కష్టము. కాని దాని సింకొకచోట గ్రహించుట యసంభవము" అని స్కోఫనుహారు చెప్పుచున్నాడు.

మహాత్కార్యము లన్నియును కించదాత్మసంబంధము లేకుండ యహంకారరహితముగనే జరుపబడెను. భాస్కరుడు స్వయంప్రభాభాసమానుడై సాక్షీమాత్రముగా నిర్లిప్తతతో ప్రకాశించును! వెంటనే నదులు హిమవన్నగాగ్రములనుండి ప్రవహించుచున్నవి; వాయువులు మందహాసముతో ప్రకంపించుచున్నవి; ప్రకృతియంతయు చైతన్యముతో నుజ్జీవిత మగుచున్నది; పసువులు మేల్కొనుచున్నవి; మొలకలు మొలకలెత్తుచున్నవి; పుష్పములును కమలములును వికసించుచున్నవి; శిశువులు, స్త్రీలు, పురుషులు మొదలగువారి నేత్రకమలములుకూడ సూర్యభగవానుని దర్శనమాత్రముచే వికసించుచున్నవి.

నీవు విశ్వాత్మవలె, తేజోనిధివలె, ఆనందసరస్సువలె ప్రకాశించిన చాలును. యశోనిధీ! సచ్చిదానందములు నీ నుండి విరాజమాన మగును. పుష్పము వికసించును! వెంటనే పరిమళము దానంతటదే వ్యాపించుచున్నది.

ఈత నేర్వనివాడు దురదృష్టవశమున నీటిలో మునిగి పోవును. సహజముగా నీరు వానిని తేలగొట్టును. కాని యతడు ధైర్యమును విడి, శాంతమును పోగొట్టుకొని కాళ్ళతోను, చేతులతోను తన్నుకొని మునిగిపోవుచున్నాడు. విచారోత్కంఠతలచే గిజగిజ కొట్టుకొను కించదాత్మయే మానవుని ముంచివేయుచున్న ముంపుకురాయి. "ఇజ్రేలు దేశములో నొక యరణ్యమున ప్రతిదినమును యమృతము వర్షించుచుండెను. కాని మోసెసుయొక్క దుష్టగణములోని యాత్మజ్ఞానశూన్యులు కొంద రుల్లిపాయలు కావలెనని కోరుకొనిరి. వెంటనే యమృతము వర్షించుట మానివేసెను."

తలనొప్పి, నడ్డిగూను, గుండెదడ మొదలైనవి యెప్పుడు కలుగుచున్నవి? కాళ్ళతో నడుచుటకుమారుగా తలతో నడచునపుడే యిట్టివిపరీతములు సంభవించుచున్నవి. పాదములను భూమిమీదనే యుంచుడు! తలనుమాత్రము గాలిలో నుంచుడు (స్వర్గీయానందమునే పూరించుడు) భగవద్విధానమును తలక్రిందులు చేయకుడు. ధూళిని శిరమున దాల్చి యదియే

యుదారజీవిత మని పొంగిపోకుము! యథార్థతత్త్వమును
విడచి బాహ్యరూపమునే మహాప్రసాదముగా భావింపకుము.

కుక్కగొడుగులకొరకు ప్రయత్నముచేయువాడు సాల
వృక్షములను తనకాళ్ళక్రింద తొక్కివేయునని పెద్దలు చెప్పు
దురు. సోదరా! అఖండసచ్చిదానందమును (నీయాత్మను)
కోలుపోయి స్వల్పపు లాభనష్టములకొరకు కేలపరితపించెదవు?

బాధ్యతలతో మునుగుచు పేరుప్రతిష్ఠలకు ప్రాకులా
డుచు, విధాయికములకు బద్ధుడగు కించదాత్మ నిజముగా
చేయగలుగున దేదైనకలదా? అట్టియిన గుట్టుపుట్టుంటెపై
నున్న జోరీగకూడ తానే గుఱ్ఱమును బరువెత్తించుచున్నట్లును,
బండిని తోలుచున్నట్లును మురియవచ్చును.

ఆనందమయ మగు సత్యపథమున నీయహంకారమును
చొరనీయకుము. ఆసత్యశక్తిని విశ్వసించుము. ఏశక్తిచే యబుద్ధి
పూర్వకముగ నేచిన్నక్రిమి యుత్తమమైన దివ్యమానవరూప
ముగా పరిణామము నొందెనో యట్టిపరమాత్మ, అట్టిదివ్య
తత్త్వము నీయందింకను కలదు. ఆబ్రహ్మము నశించుటగాని
నిద్రించుటగాని లేక నీయందు సదా జాగరూకుడై యుండ
నీకు పతనమెక్కడిది? "తరంగలీల మెచ్చటకు గొంపోవునో
తెలియకుండ పక్షులు సముద్రశయనమును చేయుచున్నవి.
సూర్యచంద్రులను, గ్రహములను, నక్షత్రములను నాశ్లేషించు

యఖండబ్రహ్మానందరసాబ్ధిపై మనమును విశ్రమించవలెను." విచారములును బాధలును నీవు నీబాహ్యపరిస్థితులచే బంధింపబడినాడ వనుటకు నామాంతరములు. దైవదూరమైన యిట్టి కారాగారభ్రమను తరిమివేయుము. బాహ్యప్రకృతిని పాలించు తత్త్వము నీయాంతరంగికతత్త్వమునుండి భిన్నమైనచో శిరము వంచి విధికి నమస్కరించవలసినదే. కాని పరిస్థితులచే నావరింపబడినట్లు నీ వొకవంక కాన్పించుచున్నను నీవే యాపరిస్థితులవలె కూడ కాన్పించుచున్నావు. అద్దము నాచేతిలో నున్నది. నే నద్దములో నున్నాను. మానవునిలో నున్న పరమాత్మను నిరాకరించుటచే దేవదూతకూడ నరకమునకు త్రోయబడినట్లు మహాత్ముదీయ మతగ్రంథములు బోధించుచున్నవి. మానవునిలోనున్న బ్రహ్మమును తెలిసికొనినచో మహాపాపికూడ స్వర్గమును పొందుచున్నాడు.

"నేనే అందరిలోను యున్నాను; నాతత్త్వమే యందరిలో నున్నతత్త్వము" అను యనుభవ, సచేతన జ్ఞానమే జ్ఞానము. అది విశ్వాసముమాత్రమే యనుట న్యాయముగాదు. ఇదియే యుత్తమోత్తమ శాస్త్రము; వేదాంతజ్ఞానము. ఇదియే యుత్తమోత్తమ కళ. ఇదియే యుత్తమోత్తమధర్మము.

సత్యమునకు చివరపరీక్షయెద్ది? మనజీవితములను మనము దాని కర్పణచేయవచ్చును. ఈదృశ్యప్రపంచము

వెనుకనున్న సత్యమునకు నీవు నీయాత్మ సమర్పణనుచేయ వచ్చును. "నేనును నావిశ్వజనకుడును ఒకటే" తత్త్వమసి.

ఆకర్షణ సూత్రము విశ్వాసము నెప్పుడైనను భంగ పరచిన భంగపరుచవచ్చును గాని యాధ్యాత్మికైక్య తమాత్రమెన్నడును నిన్ను వంచింపజాలదు. ఈయైక్యతను నీవొక్కసారి యనుభవించుము. ప్రపంచమంతయు నీశరీర మువలెనే నీకు సేవజేయును. ఓమాయామోహిత మాన వుడా! వెండిబంగారములు నీజీవితమునకు భీమా నొసంగ గలవా? ప్రాణమునకు చైతన్యమును, వెండిబంగారమునకు కాంతిని, సూర్యచంద్రులకు, తేజస్సును నొసంగునది నీవే యని గుర్తించుము.

ఇతరుల యభిప్రాయములు, ఛాందసాచారములు, హిమాలయములవంటి విషయములు మనుష్యుల నణచివేయు చుండుటచే వారుతగినయభివృద్ధిని పొందజాలకున్నారు; ఒక యడుగైనను ముందుకు పోజాలకున్నారు. అనీతికరమైన మాధ్యములనన్నిటిని యికనైనను విడుము. ఈప్రపంచము నీలో ప్రవేశించునపుడెల్ల దానిని కఱగించు ద్రవపదార్థమొ కటి నీమనస్సులో నుండవలెను. ఈవిశ్వమునంతను కఱగించు యాత్మజ్ఞాన మను ద్రవము విశ్వమును కఱగించుకొని తన లో నుంచుకొనినను తన స్వచ్ఛతను, నిర్మలత్వమును పోగొ

ట్టుకొనజాలదు. యథార్థచింతనము నీకలవడినచో స్వర్గము విరిగిపడుచున్నను, భూమిబ్రద్దలయి యావ్రలించుచున్నను యవి నిన్ను ముందుకుగొంపోవు మంగళతూర్యములే యగును. నీకు శత్రువులే యుండరు. గానములో యుదాత్తానుదాత్తస్వరములు క్రమశుద్ధిని కలిగియుండవచ్చును. కానియా స్వరములను పరీక్షించుటచేతను, పోల్చుటచేతనుమాత్రమే గానరసము గ్రాహ్యము కానేరదు; ఆగానమునకు తేజమును గలిగించునట్టియు, ఆధారమైనట్టియు, మూలకారణమైనట్టియు నుత్తుంగ భావగంభీరతకును ఆస్వరములకును గలసంబంధము ననుభవించుటే గానమును గ్రోలుట యగును.

అట్లే బాహ్యాధర్మములను, స్థూలకార్యకారణములను చూచినంత మాత్రముననే గ్రాహ్యము కానేరదు. ప్రకృతి మానవ శరీరమైనపుడే దాని సత్యము గ్రాహ్యమగును సర్వమును గ్రహించినగాని, భావించినగాని, నీవు సర్వమును తెలిసికొనజాలవు. నామరూపముల కతీతమైన యంతరంగమును పరీక్షించుట, యథార్థతత్త్వము నవలోకించుట, నదులను పర్వతములను, అరణ్యములను వనములను, రాత్రిని, దివమును, నక్షత్రములను, మేఘములను, స్త్రీలను, పురుషులను, పశువులను, దేవతలను—ఈయన్నిటిని యాత్మతత్త్వభావముననే ప్రవేశించుట—యిదియే జీవి

తము; ఇదియే యాత్మజ్ఞానము; ఇదియే యనుభవపరిజ్ఞానము.

ప్రపంచ మంతటితోను తనయైక్యత నెవరు తెలిసికొందురో వారి నీ విశ్వమంతయు సేవించితీరును. వారి యాజ్ఞలను శిరసావహించును. ఇది యనుభవసిద్ధాంతముగాని మెట్ట వేదాంతముకాదు. తత్త్వమసి యనుజ్ఞానము హృదయాంతరాళమున ప్రవేశించుటతోడనే అంతయు ప్రేమమయమగును. విశ్వైక్యభావమును, బ్రహ్మానందమును స్వయం ప్రభాభాసమానుడగు భాస్కరునివలె ఘటమున వెల్గుచుండ పోయినను అప్రయత్నముగనే యద్భుత శక్తిగాను, యమోఘక్రియగాను భౌతికరూపమున ప్రవహించుచుండును.

సంపూర్ణము.



## శాశ్వతపోషకులు.

1. శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, చెన్నపట్టణం.
2. నడింపల్లి సుబ్బరాజుగారు, కోడూరుపాడు.
3. బాజాల వలమయ్యశాస్త్రిగారు, రాజమండ్రి.
4. దేవులపల్లి సోమయ్యగారు, ఆకిరిపల్లి.
5. చింతలపాటి బాపిరాజుగారు, పత్తేపురం.
6. తాడి పెదనాగయ్యగారు, దాక్షారామేశ్వరం.
7. బెజవాడ రామచంద్రారెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాలెం.

## రాజపోషకులు.

8. దామోజీపురపు సత్యాధిరావుగారు, కొవ్వూరు.
9. శ్రీరాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారువారు, నూజివీడు.
10. చేడ నారాయణమూర్తిగారు, తొండంగి.
11. పెన్మెత్స రాజంరాజుగారి కుమారులు సత్యనారాయణ రాజుగారు, రేలంగి.
12. రావుసాహేబ్ కళ్లి చిట్టిఅబ్బాయినాయుడుగారు, పూళ్ల.
13. పసల సోమయ్యగారు, తాడేపల్లిగూడెం.
14. ముళ్లపూడి తిమ్మరాజుగారు, జమీందారు, తణుకు.
15. ఇందుకూరి సీతారామరాజు, లక్ష్మీపతిరాజు గార్లు, నువ్వా.
16. ద్వారంపూడి సోదరయ్యగారు, దాక్షారామేశ్వరం.
17. ద్వారంపూడి వెంకయ్యగారు, దాక్షారామేశ్వరం.
18. వెలగల బాపిరెడ్డి సుబ్బారెడ్డిగార్లు, ఆరవల్లి.
19. వెలగల శ్రీరామరెడ్డి, తాడి నాగిరెడ్డిగార్లు, ఆరవల్లి.
20. జవ్వాది లక్ష్మయ్యగారు, పెనుగొండ.

21. డాక్టరు తేతలి సత్యనారాయణగారు, తాడేపల్లిగూడెం.
22. గాడేపల్లి సత్యనారాయణగారు, వకీల్, రామచంద్రపురం.
23. కుంకవల్లి సుబ్బారాయుడు బ్రదర్సు, నాచుగుంట.
24. పేరి విశ్వనాథశర్మగారు, బండార్లంక.

## పోషకులు.

25. డాక్టరు జీడిగుంట కామరాజుగారు, నిడదవోలు.
26. పల్ల సూర్యనారాయణగారు, వకీల్, కొవ్వూరు.
27. బలిజేపల్లి సుబ్రహ్మణ్యంగారు. వకీల్, తణుకు.
28. తల్లాప్రగడ రామేశ్వరరావు, భీమేశ్వరరావు గార్లు. ఉంగుటూరు.
29. జోళ్ల వెంకటరత్నంగారు, పెదపట్నమగ్రహారం.
30. దేవులపల్లి రామమూర్తిశాస్త్రిగారు, తిమ్మరాజుపాలెం.
31. ఇందుకూరి సుబ్బరాజుగారు, పిప్పర.
32. మాజేటి రామచంద్రరావుగారు, ఏలూరు.
33. గాడేపల్లి సోమసూనులుగారు, అత్తిలి.
34. డాక్టరు బొమ్మకంటి రామమూర్తిశర్మగారు, నిడదవోలు.
35. ఆరుమిల్లి వెంకటసుబ్బారాయుడుగారు, నాగుల్లంక.
36. అర్కవ తిరుపతిరాయుడుగారు, రాజమండ్రి.
37. తేతలి సీతారామయ్యగారు, తేతలి
38. రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు. కొవ్వూరు
39. నీరుకొండ వెంకటరత్నంగారు, వంగలపూడి.
40. విస్సావఝుల లక్ష్మీనారాయణగారు, చిలకలంపాడు.
41. శివరాజు వెంకటరామారావుగారు, రాజమండ్రి.
42. ఐలావఝుల రామబ్రహ్మం సన్సు కొవ్వూరు.
43. తాటిపేటి విశ్వనాథంగారు.